


చెన్నపట్టణము నవంబరు ౧౯౨౬

సంపుటము 3 అక్షయ సంవత్సరము కార్తికమాసము సంఖ్య ౧౧

# రేరాణి

మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు

ప్రకృతిసౌందర్య సౌభాగ్యంబుఁ జూచి
పరమేశ్వరునిప్రేమవైచిత్రిఁ జూచి
మనుజునిభాగ్యంపు మహిమంబుఁ జూచి
యానందవార్ధి మున్గాడుచున్నప్పు
డాకస్మికంబుగా నవతారమంది
క్రొత్తవన్నెలతోడఁ గ్రొమ్మొల్కలెత్తి
ప్రాఁతవిచారముల్ పలుతెఱంగులుగఁ
బైవ్రాలి యానంద భంగం బొనర్చి
మానబాఱినపుండ్లు మఱల రేఁపుచును
భరియింపఁగారాని బాధలం బెట్టుఁ
నను భవించినవాఁడె సాక్షి దీనికిని

* * * *

శ్రీవిష్ణుపదసహస్రీతుఁడైనకతనఁ
జండప్రతాప నిస్తంద్రత్వమొప్పఁ
దపనాహ్వయంబు సార్థకము గావించి
భరియింపఁగారానికరములం బట్టి
సరసులజీవనస్వముల నింకించి
సకలారి సమ్మోద సంధాయియాచుఁ
గువలయపీడ మిక్కుటముగాఁ జేసి
క్రోధంపు వీరంపు ఘోరంపురీతి
ప్రకటించిప్రకటించి, పరిపాలనంబుఁ
గావించి కావించి, ఘనతఁ జూపించి
కాలవశంబునఁ గాంతి యడంగ
నినుఁ డస్తమించె..............
.................చల్లనిరాజు వచ్చె

పాలుపొంగినయట్లు పండువెన్నెలలు
నాల్గుమూలల నిండి నలువొంద సాఁగె;
శాంతరసంబున జగతి రంజిల్లె;
ప్రహ్లాదనంబునఁ బ్రకృతి యుప్పొంగె.

* * * *

నిమ్మదానిమ్మల కొమ్మలకమ్మఁ
దాపులం దాపులం దాఁ గొల్లఁగొట్టి
పిల్లతెమ్మెరబంటు మెల్లఁగా వచ్చి
తనపాదములకు నప్పన సేయుచుండఁ
దనదుసౌరభ్యంబుఁ దనదుసంపత్తి
వ్యాపించుచుండ, నవ్యామోదమైన
మాలతీయువతి సమ్మానంబుతోడఁ
గైదండ యొసఁగి ప్రక్కను నిల్చియుండ,
సన్మార్గచారియై జానొందు రాజు
ప్రాణేశ్వరుండు మోహపుఁజూపుతోడఁ
దనుఁ జూచుచుండఁ, దెల్లనిపూలచీర
మేన నిండుగఁదాల్చి, మించి, రేరాణి
చెంబేలికన్నియ చేఁబూని నిలచి,
శృంగారరసము మూర్తిని దాల్చినట్టు
లానందమున నూఁగులాడుచు నుండె
రేరాణియందంబు ప్రీతితోఁ జూచి,
యచ్చెరువందుచు నచటఁగూర్చుంటి
తలపోఁత లెన్నెని కలుగఁగా సాగె.

* * * *

హా పరమేశ్వరా, హా కన్నతండ్రి
యీరీతి నీకృపాదృష్టి నాపైని
గనుపట్టఁగాఁజేసి, ననుఁబ్రోచినావె?
చలువవెన్నెలలోని తెలినిగ్గుఁగూడి
యలమి వింతలుగొల్పు నాకు రంగులను
గనుల కానందంబుఁ గలిగించినావు;
పిల్లతెమ్మెరయూఁచ మెల్లఁగా నూఁగి
పూవుల నవ్వుల పొలుపు చెన్నొంద
పలుఁపులంగొల్పి కొమ్మలు పాడుచుండు
మిక్కిలినన్నంపు మేలిపాటలను
జెవుల కానందంబు చేకూర్చినావు
తలిరుగుత్తులపైడి తముఁ గూడివచ్చు
తేనెబొట్టులతోడి తేఁకువన్ గుటియు
మంచుబిందువుల కమ్మందనంబులను
మేని కానందంబు మేకొల్పినావు;
రాలకకొన్నియు, రాలికొన్నియును,
రాలిరాలక కొన్ని లీలలంజూపి,
పూలుచల్లుచునున్న మేలితావులను
ముక్కున కానందమును గూర్చినావు;
గుత్తుగుత్తులు గాఁగఁ గొల్లకొల్లలుగఁ
దీర్చియమర్చిన తీయనిపండ్ల
జిహ్వ కానందంబు చేకూర్చినావు;
ఇంద్రియంబులను నా కిచ్చియున్నందు
కింత యానందంబు నిచ్చియున్నావు

* * * *

నీప్రేమ యెంతని నిలిపి వర్ణింతు?
నీప్రేమయే యెందు నిలిచి కన్పించు,
నీప్రేమయే యెందు నిలిచి విన్పించు,
నీప్రేమయే యెందు నిలిచి స్పృశించు,
నీప్రేమయే యెందు నిలిచి వాసించు,
నీప్రేమయే యెందు నిలిచి రుచించు!

* * * *

ఇంద్రియంబులతోడ నెఱిఁగెదఁగాని,
వివరింపలేను నీ ప్రేమతత్త్వంబు;
ఏయింద్రియములతో నెట్లు నీప్రేమ
యనుభవింతునో దానిఁ గనుఁగొనంజాల,

కందునో విందునో కనలేను దాని
యందంబు చందంబు నరసికోలేను;
విందునో తిందునో వివరింపలేను;
కాని నీప్రేమయే కనవచ్చు నెందు;
విరులగుత్తులలోన విన్నయట్లుండుఁ
గమ్మదావులలోనఁ గన్నయట్లుండు;
తేటవెన్నెలలోనఁ దిన్నయట్లుండు;
గొనబుమంచునను మూర్కొన్నయట్లుండుఁ
గొమరుటాకులను దార్కొన్నయట్లుండు;
వేఱొం డెఱుంగ నీప్రేమయేకాని;

వేఱొండు తలఁప నీప్రేమయేకాని;
హా, నాయదృష్ట మేమనవచ్చుఁ దండ్రి!
ననుఁ బోటి ధన్యుఁ డున్నాఁడె నాతండ్రి!
ధన్యుండ ధన్యుండ ధన్యుండ నేను
నాదుభాగ్యమె భాగ్యమౌఁ దండ్రి!......
.........................యంచుఁ
జిత్తంబులో నిట్లు చింతించుచుండి
యానందపారవశ్యమున మైమఱచి
కూర్చుంటి—కూర్చుంటి—కూర్చుండియుంటి

* * * *

ఎంతసే పుంటినో యెఱుఁగ నింతేని;
ఇంతలో—నక్కటా—యేకతంబుననో,
రేరాణికొమ్మ తా రివ్వునఁ గదలె
పూవులు మంచుఁ దుంపురులతోఁ గలసి
జలజలమంచుఁ బెన్‌చప్పుడు చేసి
నెమ్మేనిపై రాలి నిలువెల్లఁ గడిపె.
పారవశ్యంబునఁ బడియున్న నాకుఁ
జప్పున—చయ్యన—చైతన్య మబ్బె;
ఆకస్మికంబుగా నట్లు చైతన్య
మబ్బిన యపుడు నాయంతరంగంబు
లోకాంతరమున—ఆలోకమార్గమున—
వేఱొక్కదృశ్యంబుఁ బెట్టి నాయెదుట
ఆనంద మిది యదృశ్యం బయ్యె......
.............................నంత
గుండెజల్లనె; కంటినుండి నీర్కారె;
కాళ్లును జేతులుఁ గంపంబునొందె;

* * * *

అట్టి పున్నమరాత్రి—అట్టి పూఁదోఁట—
అట్టి వెన్నెలలోన—అంత శాంతముగ—
అనుఁగుబిడ్డ కరంబు నంది నిల్చున్న
యాత్మేశ్వరీ రూప మదితోఁచె నెదుట
ఎన్నియేండ్లయ్యె నా యింటినిబాసి
కలనైన నొకసారి కన్పడదయ్యె;
నిలిచినఁ గూర్చున్న నిదురవోయినను
జెలులతో ముచ్చటల్ పలుకుచుండినను
ఏకాంతముననుండి యీశ్వరుం గొలిచి
ధ్యానించుచున్నను బ్రార్థించుచున్న
నేమితలంచిన నేమిచేసినను
ప్రియురాలు హృదయంబు వీడ దెన్నఁడును
బిడ్డ డెందంబును విడువ దెన్నఁడును
పంతంబువైచిన పగిది నిద్దఱును
నను వీడి యేఁగిననాఁటనుగోలె
నెంతచింతించిన నెంతకోరినను
గాంతయు బిడ్డయుఁ గన్పడకుండ్రి
కతమేమియో నేఁడు కన్పట్టి రెదుట.

* * * *

తనకొక్క చెలియ కైదండ యొసంగఁ
జెంతనిల్చిన బిడ్డచేయి చేఁబూని
నాముద్దు టింతి కన్పట్టె నాయెదుట.
పలుకరింపఁగ లేదు, పలుకాడ లేదు

నిశ్చేష్టయై కాంత నిలుచుండె మ్రోల
ఎదుట నొప్పుచునున్న దృశ్యంబుఁజూచి
చేఁ గలంచినరీతిఁ జిత్తంబు కలఁగె.

ప్రాణేశ్వరీ! యంచుఁ బలుకరించినను
బలుకాడదయ్యె నా ప్రాణవల్లభయు;
గన్నతల్లీ! యంచు గరములఁ జాపఁ
గరము లందియ్యదు కన్నబిడ్డయును;
క్షణమాత్ర మీరీతిఁ గన్నులయెదుట
నీదృశ్య మిట్లుండి యెడఁబాసె మఱల;
ఆకసంబునఁ జంద్రుఁ డట్టులేయుండె
వెన్నెల యట్టులే వెలుఁగుచునుండె;
పిల్లతెమ్మెర యట్లె వీచుచునుండె ;
ప్రియయును, జెలికత్తె, బిడ్డయుంగూడ
మాయమై పోయిరి—మఱి కానరారు.

అవల మాలతియును, నివలఁ జెంబేలి
యెనయంగ, శేరాణి యెప్పటియట్లు
కన్పట్టుచుండె నా కన్నులయెదుట.

కాంతయు బిడ్డయుఁ గన్పడ్డ నిముస
మేమి భావంబులు హృదయంబులోన
జనియించెనో చెప్పఁజాల నెన్నఁటికి—
ఆనందమయ్యెనో యప్పుడు నాకు
వంతయేయయ్యెనో వచియింపఁజాల
బలుకశక్యముకాని భావంబు కలిగె,
నిముసంబుమాత్రమే నిలిచె నారీతి,
అంతలో నా భావ మది యస్తమించె
స్పష్టమా భావంబు పైకిఁ గన్పట్టె

*　　*　　*　　*

వంతంబువై చిన వగిది నిర్వురును
విడనాడిపోయిరి బిడ్డయు సతియు;

ఒక్కమాసములోన నొక్కరీతిగని
నాప్రాణములు రెండు నను వీడిపోయె.
వాడికోలల తాఁకు వడినట్లు మనసు
గాయమై పడరాని కాఱియం బొందె.

వ్రణములచే బాధ వడియుంటిఁగాని,
కత్తికోఁతలచేతఁ గలఁగితింగాని,
అట్టి కాఱియఁ బొంద నానాఁడుఁగూడ.
భరియింపరాని యాబాధకు నెట్లు
ప్రాణముల్ నిలిచెనో వచియింపలేను.
దైవవిలాస మింతయు నంచు నెట్లొ
అనుభవించితి దాని—అనుభవించితిని.

తనవిలాసంబంచుఁ దలపోయుకతనఁ
బరమేశ్వరునకు నాపై జాలి కలిగె;
తనప్రేమయే యెందుఁ గనుపట్టఁజేసి
యిహసుఖంబులచెంత కేఁగఁబోనీక,
నాయింద్రియములకుఁ జేయూఁత యిచ్చి
తన కధీనంబులై తనరఁగాఁ జేసి
నిర్మలానందంబు నింపి నాయెదను,
బూర్వవ్రణము మానిపోవుచందమునఁ
బ్రేమతైలపుఁబూఁత ప్రీతిఁజేయుచును
బ్రేమౌషధంబును బ్రీతి నిచ్చుచును,
నామీఁదఁ గనుగల్గి ననుఁ బ్రోచుచుండె.

*　　*　　*　　*

మానఁబాఱుచునుండె మనసులో వ్రణము
మానిపోఁజొచ్చెను మనసులో వ్యథలు
తలపోయ మానితిఁ గలికి బిడ్డలును
దేవునిప్రేమయే తెలియుచునుంటి;
మునివతంసములైన నెనయఁగాలేని
ఇంద్రియాతీతమై యేఁపొందుచుండు

శాశ్వతానందంబు సమకూర్చుకొఱకు
నాపైని జాలిచే నాయింద్రియములు
తనకధీనంబులై తనరంగఁ జేసి
తనప్రేమ చవిచూపి తనివొందఁజేసి
పరమేశ్వరుండు కాపాడుచునున్న
యీసమయంబున నీరీతి నాకు
నిట్టి దృశ్యంబేల యెదుటఁ గన్పట్టి
నిదురింపనీయక, నిలువంగనీక
తిననీక, మననీక, నను బాధపెట్టి
మానఁబాఱుచునున్న మహితవ్రణంబు
మేకుగట్టిగఁ గ్రువ్వ మేల్కాన్నరీతి
రేఁగిన దక్కటా—రేగిపోయినది
ఏల నా కీదృశ్య మిట్లు కన్పట్టె?
ఏల నా కీవ్రణం బిటు రేఁగిపోయె
కాఱుచునున్న రక్తంబును జూడు
కనరావు కన్నులు, వినరావు చెవులు
ప్రాణముల్ తావులఁ బాయుచునుండె
భరియింపలే నింక భరియింపలేను
ఇందాఁక నాచెంత నే యున్న నీవు
కనఁబడ విప్పుడు కారణంబేమి?
వ్రణ వైద్యుఁడవుగదా, పాఱిపోయెదవె?
రమ్ము వేగము రమ్ము రమ్ము నా తండ్రి!
రమ్ము నీ ప్రేమతైలమ్మును దెమ్ము
రమ్ము నీ ప్రేమౌషధమ్ము నా కిమ్ము
వడిరమ్ము వడిరమ్ము వడిరమ్ము తండ్రి !
తనువుపైఁ జేతనత్వం బున్నకతన
భరియింపఁజాల నీ బాధ నాతండ్రి !
మొదట ప్రేమౌషధంబును ద్రావనిచ్చి
చేతనత్వంబుఁ బోఁజేసి యాపైని
బ్రేమతైలముఁ బోసి, బిగియించి, కట్టి
నా బాధలను బాపి నన్ను రక్షించు
నాతండ్రి, నాయయ్య, ననుఁ గన్నతండ్రి
చాలును జాలును, జాలి చూపించు;
మని యిట్లు ప్రార్థింపఁ బ్రార్థింపఁ దుదకు
'కోకో'యనుచు నొక్క కూయి విన్పడియె.

కొమ్ము కొమ్మిదె ప్రేమ కొమ్మంచుఁ బలికి
పరమేశ్వరుండు నాపై జాలిచూపి
తనప్రేమ నాపైని దనరంగఁ జేసి
వ్రణబాధ తగ్గించి, పండువెన్నెలను
దన ప్రేమతత్త్వమంతయు నాకుఁ జూపి
యనుభవింపఁగఁజేసె నానందమహిమ

*　　*　　*　　*

ప్రకృతిసౌందర్య సంపత్తి యెట్టిదియొ
పరమేశుప్రేమప్రభావ మెట్టిదియొ
మనుజుని భాగ్యంపు మహిమ యెట్టిదియొ
అనుభవించినవాఁడు సాక్షి యొక్కండె.






పేరి వేంకటేశ్వరశాస్త్రి గారు

సంస్కృతభాషయందు ప్రభుసమ్మితములగు వేదములకంటెను, సుహృత్సమ్మితములగు పురాణేతిహాసాదులకంటెను విలక్షణముగ కొందరుమహాకవులు కొన్ని కావ్యములను వ్రాయదొడంగిరి. ఇవియే కాంతాసంమితములనంబడును. కాంతాసంమితములన, కాంతయెట్లు తన హావభావాదులచే తనప్రియునిమనమున కానందమును గలుగజేయుచు తనయభీష్టమును నెరవేర్చుకొనునో యట్లే శృంగారాదిరసములచే ద్రష్టలకును శ్రోతలకును నానందమును కలుగజేయుచు కర్తవ్యాకర్తవ్యములను తెలియజేయునవి యని యర్థము. ముందుగ కావ్యరచనాపద్ధతి కొంతవరకువిమర్శించి పిమ్మట ప్రకృతము ననుసరింతము. కావ్యములయందితివృత్త మాయాయికావ్యములయందు నిరూపింపబోవు రసముల కుచితములగు విభావాదులచే రమణీయమైనదై యుండవలయును. ఆకథాశరీరమును సుప్రసిద్ధమగు పురాణేతిహాసాదులనుండి గ్రహింపవలయును. లేనిచో మహాకవులు తాము స్వయముగ నూహింపవచ్చును. సుప్రసిద్ధమగు మహాభారతాదులనుండి యితివృత్తమును గ్రహించినపుడా ప్రబంధములయందలి కథాసన్నివేశమున దాము నిరూపింపబోవు రసములకు ప్రతికూలములగు విషయములున్నచో వానిని విడచి ప్రకృతరసానుగుణమగు విషయములను మహాకవులు తాము స్వయముగ నూహించి చేర్చవలయును.

ఈవిషయమును

"యత్తత్రానుచితం కించి
న్నాయకస్య రసస్య వా,
విరుద్ధం తత్పరిత్యాజ్య
మన్యథా వా ప్రకల్పయేత్."

అనుకారికచే దశరూపకమున ధనంజయుడు స్పష్టపరచియున్నాడు. ఎట్లైనను విభావాద్యనౌచిత్యమును మాత్రము పరిహరింపవలయును. విభావాద్యనౌచిత్యముకంటె వేరొకటి రసభంజకము లేదని యానందవర్ధనుడు ధ్వన్యాలోకతృతీయోద్యోతమున,

"అనౌచిత్యాదృతే నాన్య
ద్రసభంగస్య కారణమ్."

అని సుస్పష్టముగ వ్రాసెను. అనౌచిత్యస్వరూపమును కొంచెము వ్యక్తపరుచుచున్నాను.

ప్రపంచములో నుత్తమ మధ్యమాధమ భేదములచేతను, మరియు దివ్యమానుషాది భేదములచేతను, ప్రకృతులు భిన్నభిన్నములై యున్నవి. కాన నాయాయి ప్రకృత్యౌచిత్యము ననుసరించి నాయాయిస్థాయిభావములను వర్ణింపవలయునుగాని కేవలమానుషప్రకృతుల నాశ్రయించి స్వర్గలోకగమన సప్తార్ణవలంఘనాది రూపములగు నుత్సాహములనుగాని, యుత్తమప్రకృతులయందధమ ప్రకృతులయందు వర్ణించినట్లు గ్రామ్యశృంగారమునుగాని వర్ణింపరాదు. ఇట్లే యనుభావాద్యనౌచిత్యముగూడ నూహింపనగును. ఇక నీకావ్యములయందలి రసములను గూర్చి కొంచెము విమర్శింతము. కావ్యములు యథాసంభవముగ నవరసభరితములై యుండవలయును. కాని యాయారసముల నేదైన నొకరసమును ప్రధానముగను, మిగిలినరసముల నారసమున కంగభూతములుగను వర్ణింపవలయును. ప్రధానరసముకంటె నెక్కుడు పరిపోషమునుగాని, లేక దానితోతుల్యమగు పరిపుష్టినిగాని యంగభూతములగు రసముల కెప్పుడును చేయరాదు. శృంగారాది నవరసములలో, వీరశృంగారములును,

శృంగారహాస్యములును, శృంగారాద్భుతములును, వీరాద్భుతములును, రౌద్రవీరములును, రౌద్రకరుణములును పరస్పరావిరుద్ధములై యున్నవి. శాన్తశృంగారములును, శృంగారబీభత్సములును, వీరభయానకములును, శాన్తరౌద్రములును, పరస్పరవిరుద్ధములై యున్నవి. ఏదైన నొకరసమును వర్ణించునపుడు తద్విరోధిరసముల విభావములనుగాని, స్థాయిభావములనుగాని, అనుభావములనుగాని గ్రహింపరాదు. అదియెట్లనగ నొకనాయకుని నాశ్రయించి వీరరసమును వర్ణించి వెనువెంటనే తన్నాయకాశ్రయముగనే వీరరసవిరుద్ధమగు భయానకమును వర్ణించుట మిక్కిలి యనుచితమైయుండును. అట్లే శాంతిరసవిభావాశ్రయముగ తద్విరుద్ధమగు శృంగారమును వర్ణింపరాదు. ఇట్లే యేదైననొకరసమును వర్ణించునపుడు తద్విరోధిరసముల స్థాయిభావములనుగూడ గ్రహింపరాదు. ఎట్లన ప్రణయకలహకుపితయగు నాయికను వర్ణించుచు వైరాగ్యకథలచే నాయకుని యనునయమును వర్ణింపరాదు. వైరాగ్యము శృంగారరసవిరోధియగు శాంతరసమునకు స్థాయిభావమైయున్నది. ఇట్లే విరోధి విరోధిరసానుభావములనుగూడ గ్రహింపరాదు. ఈవిధముగనే యేదైననొకరసమును నిరూపించునపుడు తన్మధ్యమున ప్రసక్తములగు పట్టణాదివర్ణనలను చేసినను, ప్రస్తుతమునుమరచి యత్యధికముగచేయరాదు. అట్లుచేసినచో సహృదయుల కవిచ్ఛిన్నముగ రసాస్వాదము కానేరదు. ఇట్లేరసముల కకాండమున విచ్ఛేదముగాని, ప్రకాశముగాని చేయరాదు. వర్ణ్యములగురసములు తత్తద్విభావాది సామగ్రులచే మిక్కిలి పరిపోషమును చెందినపిదప తిరుగా నారసముల కసకృద్దీపనము చేయరాదు. ఇట్లే ప్రస్తుతరసముల కనుచితములగు నాయికానాయకుల వ్యవహారముల నెంతమాత్రమును వర్ణింపరాదు. ఎట్లన నాయికనాయకునియందలి యభిలాషమును తదీయచేష్టాదులచే సూచించినట్లుగాక వాచ్యవృత్తిచే ప్రకటించినట్లు వర్ణింపరాదు. అట్లయినచో నాశృంగారమహమప్రకృత్యాశ్రయమగు గ్రామ్యశృంగారమువలె రసికజనగర్హితమైయుండునని చెప్పుటకు సందియము లేదు. మరియు ప్రస్తుతరసము తత్తత్సామగ్రీవశమున మిక్కిలి పరిపుష్టిని చెందినపిదప కారణాంతరముచే నయ్యది విచ్ఛిన్నమైనను తిరుగా నాయాయిసమయములయందారసమున కనుసంధానముమాత్రము ముఖ్యముగ చేయుచునే యుండవలయును. పైనిచెప్పినరీతుల ననుసరించి కావ్యము లున్నయెడల నయ్యవి మిక్కిలి రమణీయములును, రసికజన విగర్హితములును నైయుండునని యెల్లరకును తెలిసియేయుండును, గాన నీవిషయము నింతతో ముగించి ప్రకృతము ననుసరించుచున్నాడను. దృశ్యకావ్యములనియును, శ్రవ్యకావ్యములనియును కావ్యములు రెండువిధములుగనున్నవి. దృశ్యకావ్యములన దర్శనమువలన సహృదయులగు సామాజికుల కానందమునుగలుగచేయునవి యని యర్థము. వీని కభినేయార్థములనికూడ నామాంతర మకలదు—సాత్వికాంగిక వాచికాహార్యము లనెడు నాల్గువిధముల అభినయములచే నభినయింపదగినవి యని యర్థము. శ్రవ్యకావ్యములన శ్రవణమాత్రమున సహృదయుల కానందమును కలుగజేయునవి యని తాత్పర్యము. ఈయవి రంగప్రదర్శనానర్హములు. ఇందు మొదటి దృశ్యకావ్యములు నాటకప్రకరణాదిభేదములచే పది విధములుగ నున్నవి. కవిశిఖామణియగు కాళిదాసు కొన్ని శ్రవ్యకావ్యములను, కొన్ని దృశ్యకావ్యములను రచియించియున్నాడు. అందభిజ్ఞానశాకుంతలము మిక్కిలి రమణీయమైనదై యున్నది. ఈకావ్యము సంస్కృతభాషయందలి కావ్యములన్నిటికంటెను మిక్కిలి రసవత్తరమైనదని ప్రసిద్ధిని పొందియున్నది. కవి ప్రపంచమున రసనిరూపణమున మిక్కిలి వైదగ్ధ్యముగల మహాకవి తన వైదగ్ధ్యమును పూర్తిగ నీరూపకమున నుపయోగించెనని చెప్పుట కెంతయును సందియములేదు. ఇందు నాయకుడు పురువంశపుంగవు డగు దుష్యంతుడు. నాయిక యుత్తమక్షత్రియ కులోత్పన్నయు నప్సరస్సంభవయు నగు శకుంతల. అంగిరసము శృంగారము. ఇందలి యితివృత్తము సుప్రసిద్ధమగు మహాభారతమునుండి గ్రహింపబడినది. కాని యిందలి యితివృత్తము మహాభారతమునందలి యితివృత్తముకంటె చాలవిషయములలో మార్పుచేయబడియున్నది.

మహాభారతమున—నొకనాడు దుష్యంతుడు సైనికామాత్యవర్గముతో నరణ్యమునకు వేటకుబోయెను. సింహవ్యాఘ్రాది దుష్టసత్వసంకులమగు నా యరణ్యమున మాలినీనదీతీరమున మునిపుంగవు డగు కణ్వునియాశ్రమము నుజూచి యాతపోధనుని ఆరాధించుటకు సైనికవర్గము నమాత్యవర్గము నాయాశ్రమమునకు కొంతదూరమున

నుంచి పురోహితద్వితీయుడై వినీతవేషమున నాయాశ్రమమును బ్రవేశించెను అచ్చట నాతపోధనునిగాని మరి యెవ్వరినిగాని కానక బిగ్గరగ నాయాశ్రమవాసిజనము నాహ్వానించెను. మానవరూపధారిణి యగు పద్మాలయవలె నొకతాపసకన్యకవచ్చి అర్ఘ్యపాద్యాదులచే నాతని సత్కరించి స్మేరవదనయై యాతనియాగమనకారణము నడిగెను. పిమ్మట నారాజు కణ్వుని నారాధించుటకు వచ్చితినని చెప్పి యామెవలన నాతాపసి ఫలాహరణార్థము బోయెనని తెలిసికొని ముహూర్తకాల మాతని రాకకై నిరీక్షించి యూర్ధ్వరేతస్కుడగు నా తాపసోత్తమునకు నీవెట్లు జనియించితివనియు నీ వృత్తాంతము నా కెరింగింపుమనియు నడుగగా నామెతొల్లి యాఋషిపుంగవుని వలన వినిన తన జన్మవృత్తాంతము నామూలాగ్రముగ నెరింగించెను. ఆవృత్తాంతము విని దుష్యంతుడు:

"సువ్యక్తం రాజపుత్రీ త్వం
యథా కల్యాణి! భాషసే;
భార్యా మే భవ సుశ్రోణి!
బ్రూహి కింకరవాణి తే.

సర్వం రాజ్యం త వాద్యాస్తు
భార్యా మే భవ శోభనే!
గాంధర్వేణచ మాం భీరు!
వివాహేనైవ సుందరి;
ఆత్మనై వాత్మనో దానం
కర్తు మర్హాసి ధర్మతః."

అని యీవిధముగ నామెను తన్ను వివాహముచేసికొన వలయునని యడుగగా నామె

"సత్యం మే ప్రతిజానీహి
యథా వక్ష్యా మ్యహం రహః;
మయి జాయేత యః పుత్ర
స్సభవే త్త్వ దనన్తరః;
య ద్యేత దేవం దుష్యన్త!
అస్తు మే సంగమ స్త్వయా."

అని ప్రత్యుత్తరమిచ్చెను. అనంతర మాత డాకన్యకామణి కోరినకోరిక నంగీకరించి యామెను గాంధర్వవివాహము గావించికొని, కొలదికాలములో నామెను తనపురికి దీసికొనిపోవుటకు చతురంగబలమును బంపెదనని చెప్పి, తాను జేసిన సాహసకృత్యమున కాతాపసి క్రుద్ధుడై యేమిచేయునోయని వితర్కించుచు తనపురికి బోయెను. ఆమహారా జాయాశ్రమమును విడిచిపోయిన కొంతసేపటికి నాతాపసి యాశ్రమమునకువచ్చెను. వెనుకటివలె శకుంతల ప్రవాసప్రతినివృత్తు డగు తనజనకుని సిగ్గుచే నెదుర్కొనలేదు. అంత నాతడు జ్ఞానదృష్టిచే నామూలాగ్రముగా నావృత్తాంతమును దెలిసికొని తనపుత్త్రిక కనుకూలవర లాభముకలిగెనని మిక్కిలి సంతసించి శకుంతలను బిలిచి, "అమ్మా; నీవివాహము శాస్త్రసమ్మతము. నీభర్తను నేననుగ్రహించితిని. నీకు గొప్ప బలశాలియగు కొమరుడు కలుగగలడు. నీవేమియును జింతింపకు"మని చెప్పెను. కొన్ని నెలలు గతించినపిదప శకుంతల మహాతేజస్వియగు నొకపుత్రుని గనెను. ఆతనికి కణ్వతాపసి తనయాశ్రమముననే జాతకర్మాదిసంస్కారములను జేయించెను. ఆరవవత్సరమున నాత డాయాశ్రమమునందుగల సింగములను బట్టికొని యాడుకొనుచుండుటచే నాయాశ్రమవాసు లాతని సింహదమనుడని పిలువదొడంగిరి. కణ్వమహామునియు నాబాలకు నియమానుష కృత్యములజూచి యౌవరాజ్యాభిషేకమున కీత డర్హుడనియెంచి యాతని తల్లియగు శకుంతలతోగూడ నాతని దుష్యంతునికడకు బంపెను. శకుంతల మునికుమారులతోగూడ నారాజు కొలువునకు జని తన్ను గాంధర్వవివాహము చేసికొనినసమయమున జేసిన ప్రతిజ్ఞానుసారముగ తన పుత్రునకు యౌవరాజ్యాభిషేకము గావింపవలయునని దుష్యంతుని కోరెను. ఆత డావృత్తాంతము గుర్తెరింగియు నెరుగనివాని వలె నే నెప్పుడును నిన్ను వివాహము చేసికొనలేదు. ఈతడు నాపుత్రుడు కానేరడు. నీ విటనుండిన నుండుము పోయిన పొమ్మని ప్రత్యుత్తర మిచ్చెను. ఆమాటలు విని శకుంతల మిక్కిలి క్రోధపరవశయై కఠినోక్తులు పలికినను నాతడు నిరాకరింప నామె యేమియు చేయునది లేక దుఃఖాక్రాంతచిత్తయై

"త్వా మృతేపిహి దుష్యన్త!
శైలరాజావతంసకామ్,
చతురన్తా మిమా ముర్వీం
పుత్రో మే పాలయిష్యతి."

అనిపలికి మరలిపోవుచుండ నంతరిక్షమున

"భరస్వ పుత్రం దుష్యన్త!
మానసమంస్థా శ్శకున్తలామ్,
త్వంచాస్య ధాతా గర్భస్య
సత్యమాహ శకున్తలా."

అని యశరీరవాక్కు వినబడెను. అంత నారాజు నా సభాస్థలియందలి యమాత్యవర్గమును, పురోహితులను నాపలుకు వినుండనిపలికి వారివలన యనుజ్ఞపడసి పుత్రసహితయగు నామెను పరిగ్రహించెను. తాను పూర్వవృత్తమునుగుర్తెఱింగియు శకుంతలాపారిశుద్ధ్యమును లోకమునకు తెలియజేయుట కిట్లుచేసితినని పలికి సాంత్వనవచనములచే నామె నోదార్చి తాను పూర్వము చేసిన ప్రతిజ్ఞానుసారముగ నాశకుంతలాతనయునకు భరతుడను పేరుపెట్టి యౌవరాజ్యాభిషేకము చేసెనని యున్నది.

ఇక ప్రకృతనాటకీయేతివృత్తమునుగూర్చి కొంచెము విమర్శింతము. ఇందలియితివృత్తము పైనిజూపిన భారతీయేతివృత్తముకంటె చాలవిషయములలో భిన్నమై యున్నదని చదువరు లందరకును తెలిసియే యున్నది. రసికాగ్రణియగు మహాకవి శృంగారరసమును బూర్ణముగ నిరూపించుటకు ముఖ్యముగ నీరూపకమును రచియించి యున్నాడు. అంతియేకాని యితివృత్తమును దెల్పుటకుగాదు. అట్లయినచో నితివృత్తమను సుస్పష్టముగ దెలియజేయు మహాభారత ముండగా నియ్యది నిరర్థకమే యగును. ఈరూపకమునకేకాక కావ్యము లన్నిటికిని రసనిరూపణమే ముఖ్యప్రయోజనమై యున్నది. ఈవిషయమును ధ్వన్యాలోకతృతీయోద్యోతమునం దానందవర్ధనుడు:

"కవినా ప్రబంధ ముపనిబధ్నతా సర్వథా రసపరతన్త్రేణ భవితవ్యం, నహి కవే రితివృత్తమాత్రనిర్వహణేన కించిత్ప్రయోజనం ఇతిహాసాదేరేవ తత్సిద్ధేః."

అను గ్రంథముచే స్పష్టపరచియున్నాడు. కాన కవిసార్వభౌముడగు కాళిదాసు తాను నిరూపింపబోవు శృంగారరసమున కపకర్షాధాయకములగు విషయములను విడచి తద్రసపోషకములగు మరికొన్ని విషయములను స్వయముగ నూహించి చేర్చియున్నాడు. ఇట్లే ప్రకృతరసమున కంతగా నుపకారకములు గాకపోయినను నాయకోపకారార్థమును, నితివృత్తోపకారార్థమునుకూడ మరికొన్ని విషయములు చేర్చబడియున్నవి.

ప్రకృతనాటకప్రథమాంకమున దుష్యంతుడు సారంగమును సంహరింపబోవుచుండ వైఖానసు లడ్డుపడిరనియును వారిని జూచినతోడనే యాతడాశరమును ప్రతిసంహరించెననియును పిమ్మట వారు

"జన్మ యస్య పురోర్వంశే
యుక్తరూప మిదం తవ,
పుత్ర మేవంగుణోపేతం
చక్రవర్తిన మాప్నుహి."

అని యాశీర్వదించి యనన్యకార్యాతిపాతము లేనిచో మాలినీతీరమున కనబడుచున్న కణ్వాశ్రమమునకుబోయి యాతిథిసత్కారము గైకొనుడని చెప్పిరనియు, వారివలన కులపతియాశ్రమ మనతిదూరమున నున్నదని తెలిసికొని యటకా నృపపుంగవు డరిగెననియును వర్ణింపబడియున్నది. ఈవృత్తాంతము వర్ణ్యమగు శృంగారమున స్థాయిభావమగు రతి కెంతయు పరిపోషకమైయున్నది. ఎట్లన నుత్తమనాయికానాయకులరతిని సాధ్యమైనంతవరకు పుత్రప్రాప్తిసాధనముగను, తత్ఫలకముగను వర్ణింపవలయునే కాని మఱియొకరీతిని వర్ణించుట సమంజసము కానేరదు. ఉత్తమనాయికానాయకుల రతిని పైనచెప్పినరీతి ననుసరించియే వర్ణింపవలయు నను సంగతిని మహాకవి తనరఘువంశకావ్యమున,

"త్యాగాయ సంభృతార్థానాం
సత్యాయ మితభాషిణామ్,

యశసే విజిగీషూణాం
ప్రజాయై గృహమేధినామ్."

అనుశ్లోకమున

"ప్రజాయై గృహమేధినాం"

అనువాక్యముచే నిగూఢముగ సూచించియున్నాడు. కానప్రకృతమున యదృచ్ఛాసమాగతులగు వైఖానసుల వలన ప్రకృతరతికి పుత్రప్రాప్తిసాధనత్వమును గూఢముగ సూచించి యీ వృత్తాంతానంతరమున

"శాన్త మిద మాశ్రమపదం
స్ఫురతిచ బాహుః కుతః ఫల మిహాస్య,
అథవా భవితవ్యానాం
ద్వారాణి భవన్తి సర్వత్ర."

అని శృంగారరస బీజోపక్షేపమును చేసియున్నాడు. నిర్వహణమున గూడ పుత్రప్రాప్తితో ప్రకృతరసము నుపసంహరించి యున్నాడు.

ప్రథమాంకమునదుష్యంతుడుఅనసూయాప్రియంవదలవలన శకుంతలావృత్తాంతమును దెలిసికొని ఆమెయందనురక్తుడై యామెకు తనయందుగల యనురాగాతిశయమునుగూడ దృఢముగ దెలిసికొని పిమ్మట నాకన్నియను గాంధర్వమున వివాహమయ్యెననియున్నది. భారతమున వారిరువురిపరస్పరసంభాషణప్రకారమును వెనుకవ్రాసియేయుంటినిగదా. ఈమార్పు ప్రకృతనాటకీయ రసోపకారకమై యున్నది. శృంగారరసము సర్వజనానుభవవిషయమైనదగుటచే నన్నిరసములకంటెను రమణీయమైనదియు, ప్రధానమైనదియునై యున్నది. కాన నారసమును నిరూపించునపు డెంతమాత్రమును ప్రమాదము కూడదు.

"విరోధ మవిరోధంచ
సర్వత్రేత్థం నిరూపయేత్,
విశేషతస్తు శృంగారే
సుకుమారతరోహ్యసౌ.

అవధానాతిశయవాన్
రసేతత్రైవ సత్కవిః,
భవేత్తస్మిన్ ప్రమాదోహి
ఝడిత్యే వోపలక్ష్యతే."

అని యానందవర్ధను డీవిషయమును స్పష్టముగ చెప్పియున్నాడు. కావుననే రసికాగ్రణియగు మహాకవి భారతమునందువలె పరస్పరసంభాషణమునువర్ణించినచో మిక్కిలి సుకుమారమును నుత్తమ ప్రకృత్యాశ్రయమును నగు నాశృంగార మధమప్రకృత్యాశ్రయ శృంగారమువలె రసికజనవిగర్హితమై యుండునని యెంచి ఈమార్పును చేసియున్నాడు. నాయికానాయకుల యనుచితవ్యవహారము రసవిరోధి యని యిదివరకు వ్రాసియే యుంటిని.

ప్రథమాంకాంతమున వర్ణింపబడినవనగజవృత్తాంతమంగియగు శృంగారరసమునకు మిక్కిలి పరిపోషకమై యున్నది. ఎట్లన శృంగారరసము సంభోగశృంగార మనియు విప్రలంభశృంగార మనియు రెండువిధములుగ నున్నది. సంభోగశృంగారము పరస్పరదర్శనసంభాషణాది భేదములచే పలువిధములై యున్నది. రెండవదియగు విప్రలంభశృంగార మభిలాష విరహేర్ష్యాప్రవాస శాపకృత భేదములచే నైదువిధములై యున్నది. మరియు నీరెండువిధములగు శృంగారమును నాయికారబ్ధమనియు, నాయకారబ్ధమనియు రెండువిధములుగ నున్నది. విప్రలంభశృంగారము మిక్కిలి సుకుమారమైనదియు రసికజనహృదయావర్జకమైనదియును గావున రసికశిఖామణియగు మహాకవి ప్రథమాంకమున సంభోగశృంగారమును కొంతవరకు నిరూపించి సుకుమారతమమగు నభిలాషకృతవిప్రలంభమునుగూడ నిరూపించుటకు వనగజ వృత్తాంతమును వర్ణించియున్నాడని యూహింప వచ్చును.

ద్వితీయాంకమున తాపసాగమన వృత్తాంతము. ఇతివృత్తోపకారకమును నాయకోపకారకమునునై యున్నది. అవృత్తాంతములేనిచో దుష్యంతుడు మరలనాశ్రమమునకు వెళ్లుట కవకాశములేదు. ధీరోదాత్తు డగు దుష్యంతుడు అనాహూతుడై వేరొకపని లేక తిరిగి యాశ్రమమునకు వెళ్లినచో దనకు మిక్కిలి యపకర్షము

సంభవించును. కావున తిరిగి యాశ్రమమునకు బోవునుపాయ మెద్దియని నర్మసచివునితో నాలోచించు సందర్భమున మహాకవి తాపసాగమన వృత్తాంతమును జేర్చెను.

ద్వితీయాంకాంతమున కరభకాగమన వృత్తాంతముగూడ నితివృత్తోపకారకమేకాక నాయకోపకారకముకూడ నైయున్నది. ఆవృత్తాంతమే లేనియెడల విదూషకుడు పురమున కేగుట సంభవింపదు. అతడుకూడ నుపవనముననే యుండినచో శకుంతలావృత్తాంత మాతనికి పూర్తిగ దెలిసియేయుండును. శాపవశమున దుష్యంతునకు శకుంతలావృత్తాంతము విస్మృతమైన నాతని కత్యంతప్రియమిత్రుడగు విదూషకునకుగూడ విస్మృతి కలిగెనని చెప్పుట కవకాశముండదు. కావున మూడు దినములలో తనపురికి తీసికొనిపోయెదనని శకుంతలతో చెప్పి మూడుమాసములకైన తద్విషయక ప్రసంగమే చేయని యాతనితో రహస్యముగ నెప్పుడైన విదూషకుడు ప్రసంగముచేయడని చెప్పుట కాధారములేదు. కాన నట్లు విదూషకుడు శకుంతలా ప్రసంగమును స్మృతికిదెచ్చినను దుష్యంతు డూరకుండినచో నాతని కులమునకును,స్వభావమునకును కలంకము వాటిల్లకుండునా! కరభకవృత్తాంతమువలన విదూషకుని నింటికి బంపవలసివచ్చెను. ఇంటికడ నాత డవరోధజనమున కీసంగతి దెల్పునేమో యను శంకచే దుష్యంతుడు శకుంతలావృత్తాంతమును విదూషకునకు పూర్తిగ దెల్పినను తుట్టతుదను

"పరిహాసవిజల్పితం సఖే పరమార్థేన నగృహ్యతాం వచః."

ఇదియంతయును పరిహాసమునకు చెప్పినదియే కాని సత్యము కాదుసుమీయని యతనితో చెప్పవలసివచ్చెను. కాన నాయసత్యమునే సత్యమనినమ్మి విదూషకు డూరకుండెనని చెప్పుట సమంజసముగ నుండును. అప్పుడు నాయకస్వభావమున కెట్టి కలంకమును వాటిల్లదు. కరభక వృత్తాంతమున కిదియేఫలమని షష్ఠాంకమున కవి

"సఖే! సర్వ మిదానీంస్మరామి శకున్తలాయాః ప్రథమవృత్తాన్తమ్; కథితవానస్మి భవతేచ; సభవాన్ ప్రత్యాదేశవేలాయాం మత్సమీపగతో నాసీత్; పూర్వమపి నత్వయా కదాచిత్సంకీర్తితం తత్ర భవత్యానామ. కచ్చిద హమివ విస్మృతవానసి త్వమ్"

అని యడిగిన రాజుమాటలకు

"నవిస్మరామి; కింతు సర్వం కథయిత్వా అవసానే పునః త్వయా పరిహాస విజల్పఏష న భూతార్థ ఇత్యాఖ్యాతమ్; మయాపి మృత్పిండబుద్ధినా తథైవ గృహీతమ్ అథవా భవితవ్యతా బలవతీ."

అని ప్రత్యుత్తర మిచ్చిన విదూషకుని వాక్యములచే వ్యక్తపరచియున్నాడు. కావున పైకారణములచే కరభకవృత్తాంతము కథాశరీరమున కెంతయు నుపకారకమై యున్నదని చెప్పవచ్చును.

చతుర్థాంకమున . దుర్వాసశాపవృత్తాంతమును మహాకవిప్రోత్తేర్చినాడు. ఈకథాంశము ప్రధానరసోపకారకమును నాయకోపకారకమునునై యున్నది. ఎట్లన మహాకవి శృంగారమును బూర్ణముగ నిరూపించుట కీనాటకమును రచియించియున్నాడుగదా. ఇందుప్రథమద్వితీయ తృతీయాంకములయందు సంభోగశృంగారమును, నభిలాషకృత విప్రలంభశృంగారమును యథోచితముగ నిరూపించియున్నాడు. సమాగమోత్తరకాలిక శాపాదికృతవిప్రలంభమునుగూడ నిరూపించినగాని శృంగారమునకు సమగ్రమగు పరిపుష్టికలుగ నేరదనుకారణముచే దానినిగూడ నిరూపించుటకై శాపవృత్తాంతముజేర్చియున్నాడు ఈవృత్తాంతమే లేనిచో 5-6-7, అంకములు కుదిరియే లేకపోయెడిని. మరియు నీవృత్తాంతమునువిడచి మూలకథానుసారముగనే వర్ణించినచో నాయకునకు మిక్కిలి యపకర్షముకలుగును. ఉత్తమక్షత్రియకులోత్పన్నుడును చక్రవర్తియునగు దుష్యంతుడు తపోవనమున సమయపూర్వకముగ శకుంతలను గాంధర్వమున పరిగ్రహించి తిరుగ నామె యతనిపురికి వచ్చినపిమ్మట నావృత్తాంతమును గుర్తెంగియు నెరుంగననుట మిక్కిలి యనుచితమును, అకలంకమగు తత్కులంబున కెంతయు కలంకాధాయకమునై యుండును. మరియు ననన్యసాధారణ

సౌందర్యవతియగు శకుంతల తనసభాస్థలికి వచ్చి పరిగ్రహింపుమని పలువిధముల వేడికొనినను శాపవశమున దాను పూర్వవృత్తమును మరచినందున పరకళత్రపరిగ్రహరూపమగు నధర్మమువాటిల్లుననుభీతిచే నామెను నిరాకరించెను. ఇయ్యది నాయకచారిత్రమునకెంతయు పరిపోషకమైయున్నది.

పంచమాంకమున వర్ణింపబడిన పురోహితవృత్తాంతమెంతయు నితివృత్తమున కుపకారకమైయున్నది. ఆవృత్తాంతమును విడచినయెడల తాపసకుమారులును దుష్యంతుడును గూడ నామెను నిరాకరించినపు డామె యేదైన నడవికి బోయెననిగాని లేక యవమానమును సహింపనోపక మరణమును జెందెననిగాని చెప్పవలయును గాన శకుంతలాతిరోధాన వృత్తాంతమును వర్ణించుట యంతసరసముగ నుండదని తలంచెదను. పురోహిత వృత్తాంతమున్నయెడల నుత్తమ క్షత్త్రికులోత్పన్నయును, మహారాజపత్నియును, బ్రాహ్మణయాచవయు నగు నామెకు బతిగృహమందునను,జనకగృహమందునుగాక పురోహితగృహనివాసము మిక్కిలి యవమానకరము. ఉత్తమక్షత్త్రియులుగాని, తద్బంధువులుగాని మరణమునైన సహింతురుగాని యవమానము నెంతమాత్రమును సహింపజాలరు. గాన నుత్తమక్షత్త్రి బీజోత్పన్నయగు తన పుత్రిక యవమానమును సహింపజాలక, యెట్లయినను తాను సహించియూరకుండినను నామె సహింపనోపక మరణించునేమో యను భయముచేతను, మేనక యప్సరస్తీర్థ సమీపమున శకుంతలను తనతావునకు దీసికొనిపోయెననిచెప్పుట సరసముగ నుండునని తోచెడిని. పురోహిత వృత్తాంతమును విడచి యాపన్నసత్త్వయగు శకుంతల దుష్యంతునిచే నిరాకరింపబడినను పునస్సమాగమప్రత్యాశచే మరణము నొందక యెచ్చటికైనను బోయెనని చెప్పినను నామె వృత్తాంతము కొంచెమైనను దుష్యంతునకు తెలియుటకవకాశముండదు. కాన తనవలన కలిగిన యవమానమును సహింపజాలక మానవతియగు శకుంతల ప్రాణత్యాగము చేయునుగాని సజీవయై యుండదను నిశ్చయముచే నంగుళీయక దర్శనోత్తరమున లబ్ధస్మృతియగు దుష్యంతుడు గూడ దుఃఖాతిశయముచే మరణమునొందెననియే చెప్పవలసియుండును. అట్లయినచో సప్తమాంకమునకు విలయమే వచ్చును. మరియు నాటకము దుఃఖాంతముగ బరిణమించును. పురోహితవృత్తాంతమును విడిచి దుష్యంతుడు నిరాకరించినపిదప తాపసకుమారు లామెను నిరాకరింపక తమ యాశ్రమమునకే తీసికొనిపోయిరని చెప్పినచో శకుంతల కణ్వాశ్రమమున నున్నదని తెలిసియుండును గాన నంగుళీయక దర్శనానంతరమున లబ్ధస్మృతియగు దుష్యంతుడు తానాయాశ్రమమునకు జని కాశ్యపునికడ తన యపరాధమునకు క్షమార్పణము చేసికొని శకుంతలను బరిగ్రహించెననియే చెప్పవలసి యుండును. అట్లయినచో నాయకోత్కర్షాధాయక మగు నింద్రలోక గమనవృత్తాంతమును సప్తమాంకమున వర్ణించుట నిరర్థకము, నసంగతమునై యుండును. నాయకోత్కర్ష హేతువులైనను నాటకీయేతివృత్తమున కనుపకారకము లగు కథాంశములను వర్ణించుట యనుచితముకదా! కాన పైనిచెప్పినరీతిని నితివృత్తోపకారకమగుటంజేసి పంచమాంకమున పురోహితవృత్తాంతమావశ్యకమై యున్నది. మరియు ప్రకృత నాటకమున పంచమాంకములో, గర్భవతియగు శకుంతలను కణ్వశిష్యులు దుష్యంతసమీపమునకు దోడుకొనివచ్చిరని వర్ణింపబడియుండెను. భారతమున పంచవర్ష దేశీయుడగు పుత్రుని దీసికొని శకుంతల దుష్యంతసమీపమునకు బోయెనని యున్నది. ఈమార్పునుగూడ మహాకవి రసోపకారార్థమును, నితివృత్తోపకారార్థమునుగూడ చేసియుండెనని తోచెడిని. భారతములో నున్నట్లు పుత్రునితోగూడ శకుంతల రాజసమీపమున కరిగెనని చెప్పినచో పురోహితవృత్తాంతనివేశనమునకుగాని, తిరోధాన వృత్తాంతవేశనమునకుగాని యెట్టి యవకాశము నుండదు. పురోహితవృత్తాంతము లేనియెడల సంభవించెడు ననుపపత్తులను నిరూపించియే యుంటినిగదా! మరియు మూలకథానుసారముగనే వర్ణించినచో చక్రవర్తి లక్షణోపేతుడును మహాతేజస్వియును తనకాత్మజుడును నగు భరతుని జూచినను సత్పురుషుడును, దయాంతరంగుడును, ధర్మస్వరూపుడును నగు దుష్యంతునకు కొంచెమైనను హృదయమున వాత్సల్యమంకురించలేదని చెప్పుట నాయకచారిత్రమునకెంతయు నపకర్షాధాయకమైయుండును. షష్ఠాంకమున సానుమతీవృత్తాంతము

మిక్కిలి రసోపకారకమై యున్నది. ఎట్లన పురోహితు డగు సోమరాతు డప్సరస్తీర్థసమీపమున శకుంతల నేదియో యొకతేజస్సు కొనిపోయెనని దుష్యంతునితో చెప్పెను. పిదప దుష్యంతుడు

"భగవన్ ! ప్రాగపినో ఽస్మాభి రర్థః ప్రత్యాదిష్ట ఏవ, కిం వృధాతర్కే ణాన్విష్యతే; విశ్రామ్యతు భవాన్."

అని పలికి వ్యాకులుడైన తానుగూడ విశ్రాంతికై పడక టింటికేగుచు

"కామం ప్రత్యాదిష్టాం
స్మరామి నపరిగ్రహం మునే స్తనయామ్,
బలవత్తు దూయమానం
ప్రత్యాయయతీవ మే హృదయమ్."

అని పలికెను. రసనిరూపణమున మిక్కిలి వైదగ్ధ్యము గల మహాకవి శాపవశమున నాయకుడు నాయికా వృత్తాంతమును మరచి నిరాకరించెనని వర్ణించినను నాయికావిషయకరతి కనుసంధానము లేనియెడల తాను వర్ణింపబోవు రసమునకు పరిపోషాతిశయము సంభవింప దనుకారణముచే స్వనిబద్ధనాయకముఖమున నాయికా విషయకరతి కనుసంధానము నిగూఢముగ చేసెను. ఆరవయంకమున నాయకవిషయకమగు రతినిగూడ

"స్థానే ఖలు ప్రత్యాదేశ విమానితా ప్యస్య కృతే క్లామ్యతీతి."

ఇత్యాదివాక్యములచే సానుమతీముఖమున ననుసంధానము చేయుచున్నాడు. మరియు శకుంతలాంతిరోధానవృత్తాంతమును వర్ణించి మరల తుదివరకును తద్విషయక వృత్తాంతమును కొంచెమైనను దెలుపనియెడల సహృదయులగు సామాజికులు మిక్కిలి యాతురులై యుందురను కారణముచే సానుమతీముఖమున నావృత్తాంతమును కొంచెము కొంచెము దెలుపుటకుగూడ నావృత్తాంతమును కవి చేర్చెనని యూహింపవచ్చును. మరియు దుష్యంతునిచే నిరాకృతయై తల్లియగు మేనకచే కొనిపోబడి హేమకూటమున వసియించియున్న శకుంతలను తనభర్తయగు దుష్యంతుని వృత్తాంతము కొంచెమైనను దెలియనిచో నామె నిరాశచే నాత్మహత్య నొనరించిన నొనరింప వచ్చును. ఎట్లయిన తనప్రియునివృత్తాంతము దెలిసినచో నాశాబంధముచే నామె యట్టి సాహసకార్యము నవలంబింపక యెప్పటికైనను సమాగమ మగునేమో యను ప్రత్యాశచే నుండవచ్చును. కాన నాయక వృత్తాంతమునుగూడ నాయికయగు శకుంతలకు సానుమతీముఖమున దెలుపుట కావృత్తాంతము చేర్చబడెననిగూడ నూహింపవచ్చును. సానుమతీవృత్తాంతమున కిదియును ఫలమని

"యావదనేన ప్రియవృత్తాంతేన ప్రియసఖీం సమాశ్వాసయామి"

అను సానుమతీవాక్యముచే మహాకవి సూచించియున్నాడు. ఈ యారవయంకమున వర్ణింపబడిన సార్థవాహధనమిత్ర వృత్తాంతము నాయకార్థబవిప్రలంభశృంగారమున కెంతయు పరిపోషకమును, నాయకోత్కర్షాధాయకమునునై యున్నది.దుష్యంతుడుత్కటమగు శకుంతలా విప్రయోగ దుఃఖ మనుభవింపుచుండగా సార్థవాహ ధనమిత్ర వ్యవహారము నమాత్యుడు తెలియబంపెను. పిమ్మట దుష్యంతు డమాత్యునకు

"ననుగర్భః పిత్ర్యం రిక్థ మర్హతి."

అని సందేశమంపి దీర్ఘకాలము నిశ్వాసమును విడచి

"ఏవం భో స్సంతతిచ్ఛేద నిరవలంబానాం
కులానాం మూలపురుషావసానే సంపదః
పర ముపతిష్ఠన్తి; మమాప్యన్తే పురువంశ శ్రి
య ఏషఏవ వృత్తాంతః; ధిక్ మాముపస్థిత
శ్రేయోవమానినమ్.

సంరోపితేఽప్యాత్మని ధర్మపత్నీ
త్యక్తా మయా నామ కులప్రతిష్ఠా;
కల్పిష్యమాణా మహతే ఫలాయ
వసుంధరా కాల ఇవోప్తబీజా.
అహోదుష్యన్తస్య సంశయ మారూఢాః

పిండభాజః కుతః

"అస్మాత్పరం బత యథాశ్రుతి సంభృతాని
కోనః కులే నివపనాని నియచ్ఛతీతి;
నూనం ప్రసూతి వికలేన మయా ప్రసిక్తం
ధౌతాశ్రుశేష ముదకం పితరః పిబంతి."

అని పరిణీతపూర్వయు నాపన్నసత్వయు నగు శకుంతల నజ్ఞానాంధకారావృతుడై నిరాకరించినందులకు పూర్వముకంటె వేయిరెట్లు దుఃఖించి శోకావేగముచే మూర్ఛితుండాయెను. దీనివలన విప్రలంభశృంగారమునకు మిక్కిలి పరిపోషము కలిగినదనుట నిశ్చయమేకదా. సార్థవాహ ధనమిత్ర వ్యవహార ప్రసంగమున దుష్యంతుడు ప్రతీహారితో

"కి మనేన సంతతి రస్తినాస్తీతి.

"యేన యేన వియుజ్యన్తే ప్రజాః స్నిగ్ధేన బంధునా,
నస పాపాదృతే తాసాం దుష్యంత ఇతి ఘుష్యతామ్."

అనియాజ్ఞాపించెను. దీనివలన దుష్యంతునకు తన ప్రజలయందుగల ప్రేమాతిశయమును, దయయును, ఔదార్యమును వ్యక్తమగుచున్నది. కాన నీవృత్తాంతము నాయకోత్కర్షాధాయకముకూడ నైయున్నది. షష్ఠాంకమునందలి మాతలికృత విదూషకోపమర్దనవృత్తాంతము మిక్కిలి రసోపకారకమై యున్నది. అంతవరకును విప్రలంభశృంగార మధికముగ పరిపోషింపబడెను. పిమ్మట తదాశ్రయముగనే వీరరసము వర్ణింపవలసియున్నది. వీరశృంగారములు పరస్పరవిరుద్ధము లైనవగుటచే నేకాశ్రయముగ నవ్యవధానముగ నారెంటిని వర్ణింపరాదు. అవిరుద్ధరసాంతరముచే వ్యవహితములైనవు డేకాశ్రయములైనను దోషముండదు. రసవిరోధములను బాగుగ గుర్తెరింగిన కవిశిఖామణి యావృత్తాంతమును చేర్చి యద్భుతరసముచే నారెండు రసములకును వ్యవధానమును గల్పించెను. రసాంతర వ్యవధాన మున్నయెడల విరోధిరససమావేశము దుష్టముకాదని యానందవర్ధనుడు:

"రసాన్తరాన్తరితయో రేకవాక్యస్థయోరపి;
నివర్తతేహి రసయో స్సమావేశే విరోధితా."

అను గ్రంథముచే స్పష్టపరచియున్నాడు. ఇక నీయంకమునందలి యింద్రలోక గమనవృత్తాంత మితివృత్తోపకారకమును, సంగిరసోపకారకమును, నాయకోత్కర్షాధాయకమును నైయున్నది. ఎట్లన దుష్యంతు డింద్రలోకమునకుజని తిరిగివచ్చు సమయమున హేమకూటమును జూచి కాశ్యపసందర్శనమునకు నటకుబోయి యచ్చట తనభార్యయగు శకుంతలను, తనపుత్రుడగు భరతుని గలసికొని యపారమగు సంతోషముచే తిరిగి తనయింటికి వచ్చెను. కావున నింద్రలోక గమనవృత్తాంతము నాయికా నాయక పరస్పరసమాగమ హేతువగుటచే నితివృత్తోపకారకమై యున్నది. మరియు షష్ఠాంకమందలి నాయకారబ్ధ విప్రలంభశృంగారమునకు మిక్కిలి పరిపోషకమై యున్నది. రసమునకు పూర్ణముగ పరిపోషము కలిగినను తిరుగా మాటిమాటికి నారసమున కుద్దీపనము చేయరాదు. అట్లయినచో మిక్కిలి యనౌచిత్యము వాటిల్లును. ఇంద్రలోక గమనవృత్తాంతము పరిపుష్టమగు రసమునకు విచ్ఛేదకమైనదగుటచే రసోపకారకముకూడ నైయున్నది. మరియు నింద్రలోకమునకరిగి మహేంద్రునకుగూడ నజయ్యమగు దానవగణమును సంహరించి మహేంద్రుని యర్ధాసనము నధిష్ఠించెనని చెప్పుటవలన నాయకుడగు దుష్యంతునకు మహోత్కర్షము లభించుచుండుటచే నది నాయకోత్కర్షాధాయకముకూడ నైయున్నది.

ఇక నిందలి రససంవిధానమునుగూర్చి కొంచెము విమర్శింతము. ఇందు ప్రథమాంకమున మృగయాప్రసంగమున నద్భుతమును, కణ్వాశ్రమ ప్రవేశానంతరమున సంభోగశృంగారమును, వనగజయూథ ప్రసంగమున భయానకమును, ద్వితీయాంకమున విదూషకప్రసంగమున కొంచెము హాస్యరసమును, పిమ్మట అభిలాషకృత విప్రలంభశృంగారమును, తృతీయాంకమున విప్రలంభసంభోగ శృంగారములును, చతుర్థాంకమున కొన్ని స్థలములయందు భావమును, కొన్ని ప్రసంగములయందు కరుణమును, పంచమాంకమున శార్ఙ్గరవప్రసంగమున రౌద్రమును, షష్ఠాంకమున శాపకృతవిప్రలంభ వీరములును, సప్తమాంకమున నద్భుతరసమును వర్ణించియున్నాడు. ఇందు శృంగారము ప్రధానమైయున్నది. రసికాగ్రణియగు మహాకవి ప్రధాన

ముగ శృంగారము మిక్కిలి రమణీయముగ పోషించి యున్నాడు. ప్రథమాంకమున నాయికా నాయకారబ్ధ శృంగారములను తగురీతిని బోషించి వనగజవృత్తాంతముచే చమత్కారముగ నారసమునకు విచ్ఛేదముచేసి మరల నారసముల కనుసంధానము లేనిచో మిగుల ననౌచిత్యము కలుగునను నభిప్రాయముచే శకుంతలాగమనసమయమున

"శకుంతలా రాజాన మవలోకయంతీ సవ్యాజం విలంబ్య సహసఖీభ్యాం నిష్క్రాంతా."

అని నాయికారబ్ధ శృంగారమునకును, దుష్యంతగమన సమయమున

"గచ్ఛతి పుర శ్శరీరం
　　ధావతి పశ్చా దసంస్తుతం చేతః"

అని నాయకారబ్ధ శృంగారమునకును ననుసంధానము చేసెను. మరియు ద్వితీయాంకమున దుష్యంత ప్రవేశమైనతోడనే

"కామం ప్రియా నసుల భా
　　మనస్తు తద్భావదర్శనా యాసి;
అకృతార్థేఽపి మనసిజే
　　రతి ముభయప్రార్థనా కురుతే"

అని దుష్యంతవాక్యములచే స్థాయిభావమగు రతికి ననుసంధానము చేయుచున్నాడు. పిమ్మట ద్వితీయాంకమునందును, తృతీయాంకమున కొంతవరకును నాయికానాయకారబ్ధ విప్రలంభ శృంగారములను చాలవరకు పోషించి పిమ్మట పత్రలేఖన కరగ్రహణరూప మగు సంభోగ శృంగారమును సుకుమారముగ నిరూపించి యున్నాడు. నాల్గవయంకమున అనసూయా ప్రియంవదల సంభాషణమున

"సఖి! అతిథీనామివ నివేదితమ్, ననూటజ సన్నిహితా శకుంతలా, అద్యపున ర్హృదయేనాసన్నిహితా"

అనువాక్యములచే నాయికారబ్ధ విప్రలంభ శృంగారమునకును, పంచమాంక ప్రారంభమున దుర్వాసశ్శాపమున దుష్యంతుడు విమోహితుడైనను

"కింనుఖలు గీతార్థ మాకర్ణ్య ఇష్టజనవిరహాదృతేపి బలవ దుత్కంఠి తోఽస్మి; అథవా
"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
　పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జన్తుః;
తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం
　భావస్థిరాణి జననాంతరసౌహృదాని."
　"ఇతి పర్యాకుల స్తిష్ఠతి"

అనియును, తదంకాంతమున

"కామం ప్రత్యాదిష్టాం
స్మరామినపరిగ్రహంమునే స్తనయామ్;
బలవత్తు దూయమానం
ప్రత్యాయయతీవ మే హృదయమ్"

అనియును నాయకారబ్ధ విప్రలంభమునకు నిగూఢముగ ననుసంధానము చేసెనని తోచెడిని. పిదప 6,7 అంకములయందు శృంగారము నెట్లుపోషించినదియు నెల్లరకు విశదమయియే యున్నదికదా! శృంగారరసమును నిరూపించునపుడు నాయికా నాయకారబ్ధ శృంగారము నొక్కరీతిగనే వర్ణింపవలయునుగాని యేకాశ్రయముగ వర్ణింపరాదు. అట్లు వర్ణించిన నది రసాభాసమగును. ఆకారణముచే రసనిరూపణమున మిక్కిలి విదగ్ధుడగు మహాకవి నాయికా నాయకారబ్ధ శృంగారముల నొక్క విధముగనే పరిపోషించును ననుసంధానము చేసెనని యూహింపవచ్చును.

తృతీయాంకమున సురతక్రీడారూపమగు సంభోగశృంగారమునుగూడ

ముహురంగుళి సంవృతాధరోష్ఠం
　ప్రతిషేధాక్షర విక్లబాభిరామమ్;
ముఖ మంసవివర్తిపక్ష్మలాక్ష్యాః
　కథ మప్యున్నమితం నచుంబితం తు."

అను శ్లోకముచే వర్ణింపబడెనని తద్వ్యాఖ్యానమున

"కథమపీ త్యనేన నవవధూ శ్శనైశ్శనై రేవోపభోక్తుం యుజ్యతే, నచుంబితంతు. అత్ర

చుంబనశబ్దేన తదవినాభూతశృంగారస్సూచ్యతే; నచుంబితంత్వితి తుశబ్దః పునశ్శబ్దార్థవాచకః; తు పునర్న చుంబితమిత్యనేన ఏకవారమేవ చుంబితమితి వ్యజ్యతే. చిరప్రార్థిత కృచ్ఛ్రలబ్ధనాయికాయా బహువారసంభోగ సముచితత్వాత్ గౌతమ్యాగమనే నైకవారం సంభోగో జాతఇత్యర్థః. తేనచ మధ్యాహ్నే సంగతయోః స్త్రీపుంసో రాసాయమేకవారసంభోగకథనేన స్వస్య మన్మథకళా ప్రావీణ్యేన దీర్ఘసురతం బహువిధ క్రీడాశ్చ సూచ్యంతే."

అనుగ్రంథముచే వైఖానసకులతిలక శ్రీనివాసాచార్యులవారు వ్యక్తపఱచియున్నారు. కాని యీవ్యాఖ్యానమంత సమంజసముగ లేదని తోచుచున్నది. ఏలయన రంగస్థలమున సురతప్రదర్శనమున కెట్టియవకాశము నుండదు కదా! రంగమున నాలింగనరూప శృంగారమును వర్ణించినను నయ్యది గ్రామ్యశృంగారమువలె ధీరోదాత్తుని విషయమున గర్హ్యమగునను తలంపుచే కరగ్రహణమాత్రమునే వర్ణించి పిమ్మట దుష్యంతుడు చుంబనము చేయుటకు లజ్జావనతమగు శకుంతలాముఖము నెత్తబోగా నామె పరిహరించెననియు నింతలో గౌతమివచ్చుచున్నట్లు ప్రసంగానంతరవ్యాజమున సఖులు తెలిపిరనియును

"ఇతి ముఖమస్యాస్సమున్నమయితు మిచ్ఛతి; శకుంతలా నాట్యేన పరిహరతి. (నేపథ్యే)

చక్రవాకవధూః ఆమన్త్రయస్వ సహచరమ్ ఉపస్థితా రజనీ."

అనువాక్యములచే మిగుల సుకుమారముగ సంభోగశృంగారమును వర్ణించియున్నాడు. ఇట్లే విక్రమోర్వశీయమునగూడ నీమహాకవి కరగ్రహణరూపమగు శృంగారమునే వర్ణించియున్నాడు. కాన నాయికాలింగనచుంబనాదిరూపమగు శృంగారమునుకూడ ధీరోదాత్తునివిషయమున రంగప్రదర్శనానర్హమగుటచే దృశ్యకావ్యములయందు వాటినిగూడ వర్ణింపరాదను నభిప్రాయ మాకవికి గలదని తోచుచున్నది. ఇంత సుకుమారముగ సంభోగశృంగారమును నిరూపించియుండగా నాపద్యమున కట్టి యర్థముచేయుట సమంజసముగ నుండునా? ఆపద్యమునకుగూడ చుంబనమైనను చేయజాలక పోయితిననియే యర్థము కాని మరియొకరీతిగా నర్థముకాదనితోచెడిని. అందలి 'తు' శబ్దము పశ్చాత్తాపద్యోతకము. అందువలన చుంబనమాత్రము లభించినను కొంతవరకు కృతార్థత కలుగును. అదియును లభింపలేదనియే యర్థమని తోచుచున్నది. ఆనందవర్ధనుడుకూడ నీపద్యమున కిట్లే యర్థమని యభిప్రాయపడినట్లు తోచుచున్నది. ధ్వన్యాలోక తృతీయోద్యోతమున నిపాతవ్యంజకత్వమున కీపద్యము నుదాహరించి యిందు 'తు' శబ్దము రసవ్యంజకమని చెప్పియున్నాడు. ఆసందర్భమున ధ్వన్యాలోక వ్యాఖ్యాతయగు నభినవగుప్తపాదుడు కూడ

"'తు' శబ్దః పశ్చాత్తాపసూచకస్సన్ తావన్మాత్రచుంబనలాభే ఽపి కృతకృత్యతాస్యాదితి ధ్వనతి"

అని వ్రాసియున్నాడు. ఆ గ్రంథముచే నాతనికి కూడ నిదియే యాశయమని తోచుచున్నది. కాన గౌతమీవృత్తాంతముచే వారిరువురును వియుక్తులైనపిమ్మట తిరుగ వారికి సమావేశమైనదని యూహింపవలసియున్నది. సురతము ప్రదర్శనాయోగ్యముకాన దానిని విడిచి నాల్గవయంకమున మహాకవి సూచించియున్నాడు. ఆసమయముననే దుష్యంతు డంగుళీయకమునుకూడ శకుంతల వ్రేలనుంచెనని యూహింపవలసియున్నది. ఐదవయంకమున దుష్యంతున కభిజ్ఞానార్థము చెప్పిన దీర్ఘాపాంగమను హరిణశాప వృత్తాంతముకూడ నాసమయముననే జరిగినదని యూహింపవచ్చును. ప్రథమాంకముననే యంగుళీయకము నిచ్చెననిమాత్రము చెప్పుటకవకాశము లేదని తలంచెదను. ప్రథమాంకమున శకుంతలను సఖుల ఋణమునుండి విడిపించుటకు దుష్యంతు డామె సఖులకు నంగుళీయకము నిచ్చెను. పిమ్మట వారు

"నార్హత్యేత దంగులీయక మంగులీవియో
గమార్యస్య. ఆర్యస్యవచనేనైవా నృణా
ఇదానీ మేషా"

అని పలికి తిరుగ నాతని కాయంగులీయక మిచ్చివేసిరి. ఆసమయముననే కాని మఱియెప్పుడును నంగులీయక మియ్యలేదని చెప్పినచో షష్ఠాంకమున

"పశ్చాదిమాం ముద్రాం తదంగులౌ నివేశయ
తామయా ప్రత్యభిహితా.

ఏకైకమత్ర దివసే దివసే మదీయం
నామాక్షరం గణయగచ్ఛతి యావదన్తమ్;
తావత్ప్రియే మదవరోధ గృహప్రవేశం
నేతా జన స్తవసమీప ముపైష్యతి."

అని విదూషకునితో దుష్యంతుడు చెప్పినమాట లసంగతములగును. ఆ మాటలవలన శకుంతలవ్రేలి నుంగర ముంచినట్లును, అప్పుడు తాను తిరుగ నామెను తన యంతఃపురమునకు తీసికొనిపోవుకాలము చెప్పెననియు ను స్పష్టముగ తెలియుచున్నదికదా! ప్రథమాంకమున నుంగరమిచ్చిన సందర్భమున నాప్రసంగమున కవకాశమే లేదుకదా! మఱియు నాచార్యులుగారు మధ్యాహ్నమే నాయికానాయకులకు సమాగమమైనదనియును నప్పటి నుండి యాసాయము సురతక్రీడను సలిపిరని వ్రాసిరి. మధ్యాహ్నము దుష్యంతుడు మాలినీతీరమునకు బోయెను గాని యప్పుడే శకుంతలను గలసికొనలేదు. మాలినీతీరమునకు బోయినపిమ్మట రెండుమూడుగంటల కామె సమీపమునకుబోయి యుండవచ్చునని తోచెడిని. అత డామెను గలసికొనిన సమయ మించుమించుగ సాయంకాలము నాలుగుగంటల సమయమై యుండవచ్చును. పిమ్మట నొకగంట యామెవద్ద తత్కాలోచితములగుమాటలను మాటలాడియుండవచ్చును. పిదప అయిదుగంటల సమయమున దుష్యంతుడు చుంబనాది ప్రయత్నము చేయబోవగా గౌతమి వచ్చియుండెనని తోచుచున్నది.

ఇక నీనాటకమందలి యింద్రలోకగమన వృత్తాంతము ప్రదర్శనమున కశక్యమనియు నట్టివృత్తమును దృశ్యకావ్యములందుచేర్చుట యంతమంచిదికాదనియును కొందఱు విమర్శకు లనుచున్నారు. కాని సముద్రలంఘనాదులును, నింద్రాద్యాగమనములును ప్రదర్శింప బడుచుండ నియ్యది యశక్య మెట్లగును? యంత్రసాధనములచే నిదియును ప్రదర్శింపబడుటకు శక్యమై యున్నదే యని నాయభిప్రాయము. అట్టి యంత్రసాధనములుగూడ నా కవికాలమున యుండెనని యూహింప వచ్చును. ఆసాధనములే లేనిచో నావృత్తాంతము నభినేయార్థమున మహాకవియెట్లుచేర్చును. మహాకవి కంతమాత్ర మాచిత్యము తెలియదనిచెప్పుట యనుచితము.

మరియు నిట్లనేకవిషయము లీ నాటకమునందు విమర్శింపదగియున్నవి. ఐనను గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించితిని. ఇందలి గుణదోషములను గుణగ్రహణపారీణులగు పండితులు విమర్శింతురుగాక!





# వర్ష ఋతువు

నాళము కృష్ణారావు గారు

దీప ముడివోవఁ జీఁకటి, కోప ముడుగ
నిర్మలం బగు శాంతంబు నెలకొనుగతి
దారుణం బగు గ్రీష్మప్రతాప మెడల
కారుకాలంబు చల్లనై కదలుకొనియె.

ప్రాచిదిక్కున వాయువుల్ వీచియాడె
ఉత్తరంబునఁ బ్రతిసూర్యుఁ డుదయ మొందె
పశ్చిమంబున నింద్ర చాపంబు తోఁచె
దక్షిణంబున జలధరతతులు కూడె.

చిమ్మచీఁకటి జగమెల్లఁ గ్రమ్ముకొనఁగ
కలయ మిన్నును మన్ను నేకంబు గాఁగ
బోరుబోరునఁ దోరంపుధార లడర
కుంభవృష్టిగ వర్షంబు కురియుచుండె.

ధగధగంచును మెఱుములు తళుకులొత్తె
పెళపెళంచును నుఱుములు పెటిలి యుఱిమె
పెటపెటంచును బెడిదంపు పిడుగు లడరె
గుప్పుగుప్పన వడగండ్లగుంపు రాలె.

బెకబెకంచును కప్పలు బిట్టుకూసె
తకపికంచును నెమలి తైతక్కలాడె
చాతకంబులు నింగిని సంచరించె
ఇంద్రగోపంబు లొప్పారె నెల్లయెడల.

ఆకసంబున తూనీగ లాడఁజొచ్చె
గుంపులుగఁగూడి చీమలు గ్రుడ్లు మోచె
కొంగ కదుపులు బారులై నింగి కెగసె
త్రాచుపాములు పుట్టల దాఁగియుండె.

మెడలు సారించి తొండలు మిన్ను చూచె
దుమ్ము మైనిండ పిచ్చుకల్ చిమ్ముకొనియె
బురదలో నూరపందులు పొరలియాడె
దున్నపోతులు తిరుగాడె దుండగమున.

మేత చాలించి యావు లంబే యటంచు
మరలి యింటికిఁ జనుచుండె మందగొనుచు,
పొదుగుదూటులు వదలి క్రేపులు తొలంగి
మొదవు కదుపులమాటున నొదిఁగియుండె.

ఒండుపిఱుఁదను వేఱొండు పిండుగట్టి
నీడలను జేరి మేకలు నెమరువెట్టె,
కొట్టకొనకొమ్మ డిగి క్రిందికొమ్మ మీఁద
నిలిచి పులుఁగులు కిలకిల మెలుఁగు లిడియె.

మత్తభృంగములకుఁ దేనె రిత్తయయ్యె
గండుగోయిలకూఁతలు కట్టువడియె
పంకజాతకులంబులపొంక మడఁగె
కాకిమూఁకలరొదలు చీకాకు గొలిపె.

వెల్లువలు తటాకంబులు వెల్లివిరిసె
ఇవురఁబాఱిన మ్రాకులు చివురు తొడిగె
పసరు పచ్చికగుబురులు మిసిమిఁదేఱె
పొదరకులు గొడుగులు ప్రబలమయ్యె.

మంకెనలు పూచె, మాలతి బింకమెక్కె
కడిమి పువ్వులగుత్తులు కడిమిసూపె
మొల్లలును కొండమల్లెలు నుల్లసిల్లె
కన్నెగేదంగిఱేకులు వన్నె మిగిలె.

దారుణం బగు వర్షాంబుధారచేత
సారహీనములైన యబ్జముల వీడి
తుమ్మెదలువ్రాలె గంధబంధురములైన
వికసితకదంబ పుష్పగుచ్ఛకముమీఁద.

ముమ్మరపువానఁ దనపుప్పొటమ్ము లెల్ల
వమ్ములైచన, విరహిగ్రీవమ్ము గోయ
మరుఁడు గైకొన్న పైఁడిరంపమ్మొ యనఁగ
పొలుపు మీఱెను గేదంగిపువ్వుఱేకు.

క్రమ్ముకొనియున్న కారుమేఘమ్ముచేత
కాలమెల్లను నొకతీరె కానఁ బడఁగ,
ప్రకట జలజాత మాలతీ వికసనములు
జనుల కిది పగ, లిదిరేయి యనుచుఁ దెలిపె.

వింతవన్నెలకాంతుల విరులఁ గ్రాలు
నీలిగోరంటమొక్కలచాలు దనరె,
విడువ కెప్పుడు దివినుండ విసుగుఁ జెంది
వసుధ విహరించు నింద్రచాపంబొ యనఁగ.

నీలజీమూతపటలంబు నింగినుండి
ఇంద్రచాపంబుతోఁగూడి యిలకు డిగ్గి
స్వేచ్ఛమీఱ విహారంబు చేసె ననఁగ
నెమలి పురివిచ్చి నృత్యంబు నెఱపుచుండె.

ఒయ్యనొయ్యనఁ దనపుట్టనుండి వెడలి
మిన్ను పేరిటి పెనుగోడమీఁదఁ బ్రాఁకు
వింతవన్నెల యూసరవెల్లి యనఁగ
ఇంద్రచాపంబు కాంతితో నెసక మెసఁగె.

వింతవన్నెల తంతులఁ బేర్చి కూర్చి
లీల నల్లిన మరుని యుయ్యాల యనఁగ
సాంద్రకాంతులఁ జూపట్టె నింద్రధనువు
కనులపండువు సేయుచు గగనవీధి.

చండమారుతకంఠీరవుండు చెలఁగి
మత్తజీమూతకుంభికుంభములఁ జీల్ప
నేలరాలిన మౌక్తికజాల మనఁగ
గుప్పగుప్పున వడగండ్లు గుండ్లు రాలె.

సతతవర్షాంబుధారాభిహతులచేత
కలఁగి తారలు నింగిని నిలువలేక
కుప్పతిప్పలుగా నేలఁగూలె ననఁగ
గుప్పగుప్పున వడగండ్లు గుమ్మరిల్లె.

వానచినుకులు చొరకుండ పాములు తమ
పుట్టబొరియలపై నెత్తిపెట్టు తెల్ల
పట్టుగొడుగులో యనులీల పుట్టగొడుగు
లలరి చూడ్కికి వేడ్కలు గొలుపుచుండె.

ముంపుగొను కారువానల ముసురుచేత
చలికి వడఁకుచు వసుమతీలలన మేనఁ
గప్పుకొన్నట్టి పచ్చనికంబళి యన
పసరు పచ్చిక జొంపముల్ మిసిమిమీఱె.

తలను ప్రతిబింబభానురత్నములఁ దాల్చి
వక్రగతులను జెరలాడు పాము లనఁగ
కొండబిలముల వెలువడి క్రొత్త యేళ్లు
బిరబిరను పాఱె జక్కవల్ బెదరి పఱవ.

బెట్టిదం బగు వేసంగి వెట్టకతన
జగముజవరాలియొడ లెల్లఁ బగులువాఱ
మాన్ప ఘనవైద్యుఁ డంపిన మందునూనె
చిలుపలో యన తొలకరి చినుకు లురలె.

వసుమతిని గూడి వర్షర్తువల్లభుండు
హర్షమొప్పఁగ నిడిన నఖాంకరేఖ
లనఁగ, కర్షకహలరేఖ లలరుచుండ,
పుడమి కన్నులపండువై పొలుపు మీఱె.

సితబలాకదంతంబులఁ జెన్ను మీఱి
ప్రజలవర్షాంబుదానధారలఁ జెలంగి
భూరివిద్యుల్లతాంకుశములకు లేఁగి
గగనవీధిని గర్జించె ఘనగజంబు.

ఘననృపాలుఁడు పాలించు గగనపురిని
ఇంద్రచాపంపుగోపుర మెత్తువేళ
విరసవాక్కుల వర్ణించు భేక నామ
కాకవులకు పంకాభిషేకము లభించె.

కోలుదండము, పచ్చనిమెఱుఁగు గోచి
పుట్టగొడుగు గూని ఘనరవస్ఫూర్తి యొప్ప
నెమిలిపురియాకుపోత్తంబు నెమ్మిఁ దాల్చి
ఘనత్రివిక్రమమూర్తి పైకొనియె దివిని.

శక్రచాపంబు మూళి పింఛంబు గాఁగ
గర్జితధ్వని శంఖనిక్వణము గాఁగ
తళుకు మెఱుఁగులు బంగారువలువ గాఁగ
నీలజీమూత బాలగోపాలుఁ డలరె.

అల త్రివిక్రముగతి దివి నాక్రమించి
శంకరునిఁబోలె జలధివిషంబు గ్రోలి
విధి యనఁగ నాదిసృష్టి గావించి, మించె
ముగురుమూర్తులఁ దలపించి మొగులుఱేఁడు.

జడముకంటె జలంబును, జలముకంటె
వాయు వెక్కుడుఘనమంచు పగలె ననఁగ
ధూళి చెలరేఁగి వానచేఁ దూలిపోయె
గాలి యడరంగ వర్షంబు డీలుపడియె.

---

# గాన మాధురి

వెలువోలు సీతారామయ్య చౌదరి గారు

భవ్యగాంభీర్యమైన భావములతోడ
నవ్యరమణీయ పదగుంఫనములతోడ
విపులమైయొప్పు మధురశబ్దములతోడ
నెటుల గానంబొనర్చితివోయి, యనఘ

పతితపావనుఁడయి పూజ్యుఁడై పావనుఁడయి
యవిరతానందదాయకుఁడై చెలంగు
నుత్తమోత్తము లీలావినోదములను
నెటులు గానంబొనర్చితివోయి, యనఘ!

శుకపికారావ సంజాత సుఖముకంటె
సలలితంబైన ప్రియవధూసల్లపనము
కన్న వేయిమడుంగులు మిన్నయైన
సుఖముగంటిమి .........

గాయకశిరోమణీ? నీదుగానకలన
ధనము నెక్కుడార్జింపఁగాఁ దలఁచినావె
ప్రజల మన్ననఁబొందగాఁ మదిఁ దలఁచితె
ధర నశాశ్వతమైయొప్పు తనువు కేల
ధనము?

శాశ్వతమగు యశోధనము నీవు
పొందితివి కోరకయె, యాదిపూరుషుదయఁ
బొందితివికోరి, భళిరే! నీపుణ్యఫలము!
ధన్యుఁడవనంగ నీవె! కాఁదగుదువయ్య
గాయకోత్తమ! భవదీయగానసుధను
గ్రోలినటువంటివేమును గూర్మిసుతుఁడ
వనుచుఁ బెద్దగఁ బెంచినయంబ, భార
తాంబయును ధన్యతనుగంటి మనఘచరిత!



# యెంకి పాటలు

డి. ఏ. నరసింహము గారు, యమ్. ఏ., యల్. టి.,

(సవిమర్శపఠనము)

కొన్ని నెలల క్రిందట నామిత్రులగు వేమూరి విశ్వనాథశర్మగారున్నూ, యెంకిపాటల కృతిభర్తయగు భావరాజు వెంకటసుబ్బారావుగారున్నూ యీ నూత్నశృంగారకావ్యమును గురించి మద్రాసులో నాతో ప్రసంగించి వాఙ్మయసేవకుడనగు నా యభిప్రాయములను "భారతి"లో తెలియజేయవలసినదని కోరిరి. పలుకారణములవలన అట్లు తెలుపుటకు జాలమైనది. ఈ ఆలస్యము నాకు లాభదాయకమైనది. బసవరాజు అప్పారావుగారు ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచికలో వ్రాసిన మధుల సరసమగు ఆంతరంగికవిమర్శను, ఆంధ్రపత్రికలో పడిన విద్యాశేఖర ఉమాకాంతంగారు నేటికాలపు కవిత్వమునందు దోషములనుగణించుచు యిచ్చిన ఉపన్యాసముల సంగ్రహమును చదువుట తటస్థించినది. వానిసహాయమున యీ చిన్ని కావ్యమును పలురీతుల నవగాహనచేసికొనుటకు నాకు వీలు కలిగినది.

మొదటినుండియు "భారతి"లో నీ పాటలను చూచి ముదమందినవారిలో నేనొకడను. కాని "అతి సర్వత్ర వర్జయేత్" అను పెద్దల మందలింపునకు గురియగుచున్నవా, యీపాటలు! అనుకొంటిని. అట్లే పై పేర్కొనబడిన మిత్రులతో నంటినని జ్ఞాపకము. కాని పైన ఉదాహరించబడిన విమర్శకుల సహాయమున తిరుగ నన్ని పాటలను ఒక్కసారిగా చదువుటవలన నాయభిప్రాయమును మార్చుకొనవలసి వచ్చినదని నేను యిప్పుడు ఒప్పుకొనుచున్నాను. అందుననే దీనిని నూత్నశృంగారకావ్యమని చెప్పుచున్నాను. ఆంధ్రసారస్వతమున కిదియొక క్రొత్తమెఱుంగు మణిపూస.

విమర్శయన నిందకాదు. విమర్శలలోని దూషణ లోకసంగ్రహముకొరకు మాత్రమే చేయనగును; వ్యక్తిద్వేషమునకుగాని వ్యక్తిదూషణకుగాని తావీయవగదు. కవియొక్క భావములను గ్రహించి, స్వీకరించి, వాటిని లోకానుభవమున సమన్వయించి, అవి ప్రజలకేటుల నుపయోగపడవలయునో తెలుపుచు, కవియెడలను, కవితయెడలను గౌరవాభిమానముల గలిగించుటయే విమర్శ. ఇదియే విచక్షణ. విమర్శయన కలాతత్త్వాన్వేషణమనియే నాయభిప్రాయము. ఈనాడిట్టి కవిత రుచింపనివారు దానితత్త్వ మితరులవలన దెలిసికొని రేపు దానిని భూషింపవచ్చును. కవియును, కావ్యంబును లోకసమర్పణచేసి, దాత దానముచేసి "నమమ"యన్నట్లు తాటస్థ్యము వహించి, తనకృతిలోని సద్భావములే దానిని వరలజేసెడుమని యుండనోపును. లోకమునకు తానిచ్చిన మహాధనమును సరిగా నుపయోగించుకొనుట లోకముపని. సాధారణముగా మానవకర్మ లన్నిటిలోను ఫలాపేక్ష లేక చేయబడినది కవితయే. కీర్తిఫలము నపేక్షించునుగాని అది వెంటనే లభించునన్న యాశ అరుదు.

నూతనోత్సాహపూరితమగు ఆంధ్రపాఠక ప్రపంచమున ఈయెంకిపాటలకు కీర్తి వెంటనే లభించినది. పత్రికలప్రాబల్యము నూతగొని యీచిన్న గీతములు వెలువడినవి; చదువరుల యాదరణచే జంకువీడి స్థిరమైన చిన్నకావ్యరూపమును దాల్చినవి. కొందరికి వాటిజానపదవైఖరియందును, మరికొందరికి వాటికి గూర్చబడిన విపులరాగ తాళప్రస్తారమందును, కొందరికి వాటి నిర్మలానురాగరీతులయందును, ధ్వనియందును, మరికొందరికి వాటియందలిగూఢ వేదాంతార్థభ్రాంతిచేతను మక్కువ కలుగుచున్నది. ఈయంశములే యిక కొందరికి తలనొప్పిని గలిగించుచు రూక్షవిమర్శలకు చోటిచ్చుచున్నవి. కాని, నేను చదివినంతవరకు వ్యక్తిదూషణలు పత్రి

కలో బడలేదు. ఆంధ్రపాఠక లోకము సారస్వతాభిరుచిని యెక్కువగా గలిగియున్నందున విమర్శలు మెండుగాను, వ్యక్తిదూషణరహితములుగను వెలువడుచున్నవి. ఇది దేశమునకును, పత్రికలకును, చదువరులకును గౌరవకారణము.

ఈ విమర్శలన్నియుగూడ "యెంకిపాటల"లో అందముగలదని యొప్పుకొనుచున్నవని నాకు దోచుచున్నది. నాయభిప్రాయముగూడ నదియే. నిర్మలశృంగార రసమునందును, దానిని ప్రకృతి కనువగు పవిత్రప్రేమ గీతముల ద్వారా వ్యక్తీకరించుచు పాత్రపోషణ, కథాపోషణచేయుటయందును ఇది నూతన శృంగార కావ్యమనియు, దీనికి మన సారస్వతమున ఇంగ్లీషు కవితయందు స్పెన్సరు (Spenser) అనుకవియొక్క "గోపపంచాంగము" అనుకృతికి లభించిన ఉన్నతస్థానమును యివ్వవలసియున్నదనియు దలతును. చప్పనై సన్నగిలి యున్న ఆంగ్లకవితకు ఆతడు క్రొత్తత్రోవను చూపి, క్రొత్తవన్నెను కలిగించెను.

ఈపాటలలోని కవిత్వరీతిని, పాత్రలను,రసమును గురించియు, వీనికి సమకూర్పబడిన సంగీతవిధానమును గురించియు నాయభిప్రాయములను వరుసగా వివరింతును. వాటిని సూక్ష్మముగా ముందిచట పొందుపరచెదను:—

(1) 1. వీటికవిత్వరీతి నాటకరీతి. వీనిని నాటకకర్తృగీతములు( Dramatic lyrics) అనవచ్చును.

2. ఈ కావ్యమందు నాయిక లిద్దరు లేరు. ఒక్కతెయే.

3. ఇందలి శృంగారము చిల్లరశృంగారము గాదు. ఇందు అశ్లీలము లేమియును గానరావు.

(2) వీనియందలి భావ పాత్రోచితము.

(3) ఈపాటలను నాగరకసంగీతాలాపము లనువుగావు. ఇందు మొదటిభాగమున రెండు, మూడుసంఖ్యగల యభిప్రాయములు వరుసగా పై నుదాహరించిన ప్రబలవిమర్శకు లిద్దరి యభిప్రాయములకు వ్యతిరేకముగానున్నవి. నాకుదోచినకారణములతో నాయభిప్రాయభేదములు సాదరముగా గమనింపబడి తత్త్వాన్వేషణకు సహాయము చేయుననుకొందును.

౧

ఈ పాటలన్నియు నాయకోనాయకుల వాక్యములుగా వెలువడుచున్నవి. కవియొక్కవ్యక్తి వీరిలో లీనమైయున్నది. వారియొక్క భావలాలిత్యమును ప్రేమాశయములను యిందు ప్రతిఫలించుచున్నవి. కాని కవి తనచరితను యిందుఎక్కడను తెలుపుకొనుచున్నట్టు గనుపడదు. నాయుకుడు తనతమ్ముని తనకు మరల నిమ్మని వేంకటేశ్వరుల నడుగుట యీశృంగారకథలో తగియుండలేదనియు, అది స్వీయచరిత్రాంశమనియు ఒకరియభిప్రాయము చదివినట్టుజ్ఞాపకము. అంతరంగికవిమర్శకులగు బసవరాజు అప్పారావుగారు ఇందునుగురించి వ్రాయలేదు. కనుక పైయభిప్రాయము సరిగానుండదనుకొందును. ఈప్రార్థన పాత్రానుచితముగాదు. యెంకిగూడా తనమరదిని చూడవలెనంటున్నదిగనుక తనతమ్ముని దయచేయుమని ప్రార్థించుచున్నాడు. ఆపాటయందు నాయకుని హృదయము పలువిధములగు మృదుభావములకు ఆకరమని తెలిచుయున్నది.

ఇంక "సాటేలా? మాటేలా?" "పడవ", "ఉత్తమాటలు" అనుపాటలలో తనగ్రంథముయొక్క భావిగతిని గురించి కవి సూచించుచున్నాడను ఉమాకాంతంగారి యభిప్రాయముతో నేనేకీభవించుచున్నాను. అయితే యిట్టి గూఢార్థము ఆపాటలయొక్క పాత్రౌచిత్యమును పోగొట్టలేదు. "యెంత్రినాయెంకి" యనుపాటలో హిందూజనసామాన్యమైన ముందువెనక జన్మల చింతగలదు. తిరుపతికొండ నెక్కుట మనస్సుకు జ్ఞాపకముర్యాగా స్వర్గారోహణమునకుగూడ యెంకియే తనకు మార్గదర్శిని యను నాయకుని భావమును వెలిబుచ్చు "ముందుగతి" యనుపాట పైపాటలోని జన్మచింతవలన ప్రేరేపింపబడినదనుకొందును. "పంటసేలకేపయనం" అనుపాటలో యెంకిని యిట్లు మార్గదర్శినిగా భావించుటకు కారణము గనుపడుచున్నది. దేవతాభక్తిగలయెంకి తనను బోలియుండమని తనప్రియుని హెచ్చరించినటులు చెప్పబడినది. ఇంతకన్న వేదాంతముగాని గూఢార్థముగాని యెక్కడను యీపాటలలో నాకు గనుపడదు.

ఈ గ్రంథములోని పాటలన్నియు "నాటకకర్తృ గీతములు" (Dramatic Lyrics) అనదగును.

ఇందలి కథాంశము నాటకములోవలెను, ఆయాపాత్రల వాక్యములవల్ల నూహించి తెలుసుకొనవలసియున్నది. కవి యేమియు మనకు స్వయముగా చెప్పడు. వానివాక్యములవలననే నాయకుడు గోదావరీతీరమున నొకపల్లెలోనుండు కాపు అనియును, ఆపల్లెకు దగ్గరలో రెండుచిన్నయేళ్లును రెండుకొండలును గలవనియు, సేద్యమునకుతోడు పుష్పజాతులు, ఫలవృక్షములుగల తోటయొకటి యాకాపుకు గలిగియున్నట్లును, అతని కొకపడవగూడా యున్నట్లుగాని, లేదా, పడవనడుపుట బాగా తెలిసియున్నట్లును తెలియుచున్నది. అతనితల్లి బ్రదికియున్నట్లు తెలియుచున్నది. తమ్ముడు చిన్ననాడే తిరుపతిలో తప్పిపోయినట్లున్నది. చనిపోయినట్లు తోచదు. అందుకే మళ్లీతమ్మునియిమ్మని తిరుపతిస్వామి నడుగుచున్నాడు. ఈ అడుగుట పట్టి బ్రతుకయని నాకు తోచకున్నది.

ఎంకికిగూడా తోటయందు, సేద్యమందు, గోసంరక్షణయందును సరదా ఉన్నట్లగపడును. యిందులకే నాయికానాయకులమనస్సులు త్వరగా ఏకమైనవి. ఈమెకు పడవనుకాకాణిపట్టు సమర్థతకూడా ఉన్నట్లు పడవపాటలో తెలియుచున్నది. కాని నిజముగా ఆ భద్రాద్రిప్రయాణము సాగించినట్లు కనుపడదు. మనోరథవీథినే జరిగియుండును. కనుక నాయికకు పడవ నడుపుశక్తి యున్నదనుట నాయకుని ఊహామాత్రమే యయియుండనోపును.

నాయుడికిను, ఎంకికిని సమానమగు అభిరుచులుండుటవలననే అన్యోన్యాకర్షణము అని తోచును. ఇద్దరికిని కథలుచెప్పుటయందు, పాటలు పాడుటయందు, వినుటయందు కుతూహలమున్నది. నాయుడుయందు మిగుల ఆకర్షకమగు గుణమేమన యాతని సుకుమారబుద్ధిప్రతిభయును, లలితకవనమున్నూ. ఆతడు ఎంకిని

"మెఱుపల్లె పాటెత్తిమురిపించినాడు."

ఈశక్తి యాయువకునియెడ నందరకును గౌరవమును ప్రేమను గలిగించెను. అందులో స్త్రీలను రంజించెను. తనకు ఎంకియందు గాఢమగు ననురాగముగలిగినతరువాత తననిర్మలమును, సుస్థిరమునునగు ప్రేమ తనమనోహరినిగురించియు, ఆమెయందమును ప్రేమస్ఫురితములగు చేష్టలనుగురించియు ఉత్సాహముతో పాడునట్లుచేసెను. చుట్టుప్రక్కలవారందరికిని కుతూహలము ఎక్కువాయెను. ఎంకినిచూచుటకు రాసాగిరి. పలుమాటల ననసాగిరి. ఇట్టిప్రకటనవలన నాయికమనస్సు చీకాకునందగా,

"ఉత్తమా యిల్లాలనోయి
నన్ను సురుపెడితే దోసమోయి"

అని నాయకుని మందలించినది. దీనిపై "సాటేలా? మాటేలా? మనకు రహస్యమేలా? మనదిపవిత్రప్రేమ. జనులకు ఆదర్శముగా నుండగలదు. నీపేరు అందరిచే గౌరవించబడును." అనిబదులుచెప్పి యామెనునాయకుడు ఓదార్చినాడు. ధ్వనిగా యిందు కవి తనగ్రంథమును ప్రకటించుటకు వెనుదీయ నవసరములేదనియు, సహృదయులును తదితరులునుగూడ క్రమముగ దానిని గౌరవింతురనియు తన దృఢమగు నమ్మకమును దెలుపుచున్నాడు.

ఎంకి హీనజాతిస్త్రీయనియు, కాపుయువకునితో సంబంధము వివాహమువంటిదిగాదనియు ఒకరియభిప్రాయమును వింటిని. ఈయూహకు ఆధారము నాకెక్కడను గనుపడదు. ఎంకీఅనునది పేరుయొక్కముద్దురూపము. అది హీనజాతిని సూచింపదు. నాయికను గురించి మనకు యీపాటలు తెలుపునదేమంటే: ఈమెకు సొంత ఆవులు, దూడలు ఉన్నట్టున్నూ, యీమెకు అత్తవారు ఉన్నట్టున్నూ తెలియుచున్నది. యౌవనవతి. తనయీడు యువతులతో స్నేహము గలిగి ఆటపాటల వినోదించుచుండును. దీనికొకచెల్లెలో లేక చెల్లెలువలె ప్రేమగల సఖియో యున్నట్లు "సుక్క" పాటవలన తెలియనగును. నాయుడుబావను చూచునప్పటికి దీనికి మగ డున్నట్లు కనుపడదు. అందుచే ఆమెయొక్కప్రేమ ధర్మముతప్పకుండగనే నాయుడుప్రతోవను ప్రవహించెను. మగనిమోసముచేసి వారిరువురును కలసికొనిన దెక్కడను గానరాదు. పెండ్లియాడుటకిచ్చయున్నను తనమునుపటి యత్తవారికి తెలియకుండా కొన్నాళ్లుంచవలయునని యామెకోరిక యైయుండినట్లు కనుపడును. తిరుపతియాత్రకు వెళ్లువరకు ఈరహస్యవివాహము గుప్తముగానే యుంచబడెను. పెండ్లి రహ

స్యముగా జరిగినట్లే భావించవలెను. ఈపెండ్లి చంద్రుని యెదుటను, పంచభూతములయెదుటను, పంచభూతములకు మూలాధారునియెదుటను జరిగిన ట్లూహించవలెను. "ఆనాటినావోడు"అనుపాట యీయూహకు ఆధారము. స్వామియెదుట యెంకికూడా మరదనిచూడవలెనని యుం టున్నదని నాయుడు ప్రార్థించినాడు. పెనిమిటియొక్క తమ్ముని స్త్రీలు యిట్లు'మరది'యనిపిలుతురు. నాయుడు యెంకిని

"ఆవుల్ని దూడల్ని
అత్తోరికాడుంచి
మునిలోళ్లతో చెప్పి"

తనతో తిరుపతి రమ్మన్నాడు. అంతవరకు రహస్యసమా వేశములు నాయుడు తోటలోనే జరిగినవి. మునుపటి య త్తవారియెడల యిట్టి సాధ్వస ముండుట వింతగాదు.

"వొనలచ్చిమి" యను అభిసారికాగమన వర్ణన పాటలో "మంచెకిందాకల్లి" యనుచరణము అశ్లీల ముగా భావింపబడతగదు. నాయికయొక్క నవ్వులాలు విలాసములలో నిదియొకటి.

ప్రేమధర్మబంధము మనస్సులకెప్పుడు గలిగినను, వివాహబంధము తిరుపతిలో స్వామియెదుట జరిగినదను కొనవచ్చును. అటుతరువాత రహస్యము మాని యిద్దరూ తోటలోనే నివసించుచుండిరని యూహించవలెను. యెంకికి వేరుగా ఆవులు, దూడలు ఉన్న ప్రశంస అటు తరువాత గానబడదు. వివాహమైనను ప్రేమతరగలేదు. పుట్టినింటికో బంధువులయింటికో వెళ్లుటకు నాయకుని అనుమతి నడిగి, తిరిగివచ్చుకాలముచెప్పి నాయిక వెళ్లగా తన్మయతచే నాయకుడు తోటకార్యముల నుడిగి, ప్రబం ధములలోని నాయకులయొక్క విరహావస్థల ననుకరించు చున్నాడు. కాని వర్ణన ప్రకృతి సహజముగానున్నది. ఉత్ప్రేక్షలు స్వల్పము.

నాయికయొక్క విరహావస్థ 'యేటిదరి నాయెంకి' యనుపాటలో సూచింపబడినది. "నాయెంకి" అనుట వల్ల యిది నాయకుడు మేఘసందేశములోని యక్షుని వలె తనప్రియురాలియొక్క విరహావస్థను, చేష్టలనుగురిం చిపాడుచున్నాడా? యను సందియమున కెడముగలుగు చున్నది. "సుక్క" యనుపాటలో నిట్టిసందియము లేదు. అదియును నాయికయొక్క విరహోత్కంఠితావ స్థను తెలియచేయుచున్నది.

ఈ "సుక్క" పాట బ్రౌనింగ్ (Browning) అను ఇంగ్లీషుకవియొక్క భావనిరూపకశక్తిని గలిగియు న్నది. ప్రేమతన్మయతచే తీక్ష్ణములైన యింద్రియవ్యా పారములుగలిగి నాయిక తనచెల్లెలితో తనయవస్థ చెప్పు కొనుచు నాయకునిరాకయే ప్రతిశబ్దమునకును, తోట వెలపల గలగలకును, ఆవుమెళ్లో మువ్వలమ్రోతకును కారణమైయుండునని ఊహించుచు నౌత్సుక్యమును జూపును "ఆనాడునావోడు" యనుపాటలోని విరహా మింకను మామూలు ప్రబంధములరీతినే ఉన్నది.

"కన్నీరునీకేలసెందురూడా?
కనికారమే శాన సెందురూడా!"

చంద్రుడు తనపట్ల సానుభూతిని గనుపర్చుచు న్నాడను భ్రాంత్యుత్ప్రేక్ష అందముగానున్నను ప్రబం ధరీతి ననుకరించుచున్నది. "సుక్క" పాటలోని

"ఆవుమెళ్లోమువ్వలట్టె మోగినవేటి?
సుక్కొక్కడున్నాడోనూడవేసెల్లీ!"

అనుచరణమన్నచో ఉత్ప్రేక్షగాదు. హృదయమును అర్చి వేయుచున్న ఆందోళనముయొక్క విసురుకేక వినువారి హృదయమును, ముఖమును శోషింపజాలును.

నాయకుని విరహమును దెలుపు పాటలలో తన్మ యతగలదు. ఊహాతరగలుమెండు. కానినాయికయొక్క తన్మయ తీవ్రము గానరాదు. నాయకుడు పొరుగమ్మ తో "వోరసలాడుట" నీతిబాహ్యమని నిందింపబడినది గాని బావమరదులు, ఒదినె మరదండ్రు అను వరసలు సంఘజీవితములో హాస్యవినోదములకు చోటిచ్చునుగాని దుర్నీతికి గాదు. "యెర్రిసరదాల్లు" అనుపాటలో తన ప్రియురాలింకా రాలేదనియును, కోపము వచ్చి వెళ్లి పోయినదనియు, "ముందుపుటక" యను పాటలో ము న్ముందు మృత్యువువలన నిట్టి విరహమే తటస్థించినచో తనకు యెంకిపాటలే మనఃశాంతిని గలిగింపనోపుననియు పాడినాడు. నిజమైన యెంకికన్న తన మనోవీథిని నెల కొన్న "యెంకి" యనుసరససుందరప్రేమనిధియే వాని

## ప్రాచీన చిత్రములు



3. పాటకత్తెల చిత్రములతో నిర్మితమైన ఏనుగుపై శ్రీకృష్ణుని వాహ్యాళి



౪. పాటకత్తెల చిత్రములతో నిర్మితమైన గుఱ్ఱముపై శ్రీకృష్ణుని వాహ్యాళి

తన్మయతకు కారణము. "పంటసేలకేపయనం", "యెక్కవే, కొండనెక్కవే", "ఆరిపేయవె దీపము" అనుపాటలలో యిదియే కానబడును. నిజమైన యెంకియెడల తన యందు పూర్ణానురాగము ఆమెకు గలదో లేదో యని అనుమానముతోనే యుండును. పరీక్ష సేయుమనే యుండును.

వలపు ప్రారంభమున తనకు మందో మాకో పెట్టినదని భ్రమపడినాడు. తన యనుమతిని బంధువులయింటికి వెళ్లి కొంచె మాలస్యము చేసినందున వెర్రివెర్రి ఊహలకు తావిచ్చును. పొరుగమ్మలతో ఆటలాడుచూ తనను మరచిపోయినదని భ్రమపడును ఆమె నిదురించుచున్నపుడు కలగని కలవరించితే కలలోనుగూడా తనను గురించియే తలచుచున్నదో లేదోయనినీ, కళ్లువిప్పగానే ఆరహస్యము తెలియుననినీ నిరీక్షించును. ఈ నిరీక్షణములోని భావమునకున్నూ, బెదిరి మోహనిద్ర జెందియున్న ఊర్వసి యెప్పుడు కన్నుతెరచునా యని నిరీక్షించు పురూరవసుని ఉదార శృంగారభావమునకున్నూ వ్యత్యాసము గమనింపదగును. రెండును ప్రకృతి సహజములే. రెండును ప్రేమాశ్రయములే. రెండిటియందును చక్కని కవితాప్రతిభగలదు. ఆఖరు పాటలో నాయకుడు యింకా తనప్రియురాలి అనురాగముతో తృప్తి చెందక మారువేషమువేసికొని వచ్చి ఆమె భావములను పరీక్షచేసెను. అంతటితో నామె ముగ్ధత్వమును తెలిసికొని తృప్తిచెందెనని యనుకొందము.

వారి కింకా పిల్లవాడు కలుగనేలేదు. చివరపాటలోగాని కలుగుసూచనలుగూడ తెలియవు. కాని "భద్రాద్రికి" వెళదామా యనుపాటలోను, "పిల్లోడు" అనుపాటలోను కవియగు యీనాయకుడు ప్రియురాలితో గూడి పిల్లవాని నెత్తుకొని, కథలు వినుచూ, వాదులాడుచూ, పిల్లవానిని జూచి మురియుచూ, తీర్థముల స్నానమాడుచూ, దేశముచూచుటకొరకు ఉవ్విళ్లూరుచున్నట్లు పాడును. ఇది రమ్యముగా నున్నది. కాని "యెంకి" యందలి ప్రేమతో ప్రకృతియందలి అనురాగము దేశాటనాభిలాష, కవితయందలి లోలత్వము, యివన్నియు కలిసియున్నవి. నాయికయొక్క అనురాగ మన్ననో అద్వితీయాశ్రయము. "ఆనాటి నా వోడు" అనుపాటలో నామెయును "ఆకాలపు నాయెంకి" యనుపాటలో నాతడును మొదటి ప్రణయావస్థలను స్మరించి అన్యోన్యభావములు మారినవా యని విరహిజన సామాన్యసందేహములకు చోటిచ్చిరి. 'సుక్క' పాటలో నాయిక నాయకునియొక్క విలంబమునకు కారణముల కల్పించి సమర్థించుకొనబూనుట ఆమెయొక్క అనురాగమందు నైర్మల్యమును, అచంచలత్వమును తెలుపుచున్నది. మారుమనువు మగడైనను తనహృదయపీఠమున నిలుపుకొన్నది.

ప్రణయప్రారంభదశయందలి కొన్ని వన్నెలు చిన్నెలు యీమె ప్రేమను "చిల్లరశృంగార"మను నిందకు గురిచేసినవి. యీనిందను బాపుటకు వగలాడి యెంకి వేరు, పతివ్రత యెంకి వేరు అని అప్పారావుగారు అభిప్రాయపడిరి. కాని యీచిన్నకావ్యమం దంతటను యెంకి ఒక్కతెయే అని నాకు బోధపడుచున్నది. ఆ మొదటి విలాసములూ వగలూ, చిన్నపిల్లల యాటలవలె మాగ్ధ్యమునే సూచించుచున్నవి. మొదటిపాటలో చెప్పబడిన కనుగిలుపులు మురిపింతలున్నూ దుర్నీతిసూచకములు గావు. చివరపాటలో మారువేషము వేసుకొని వచ్చినవాని కిచ్చిన జవాబులు అబద్ధములును గావు. వీటి రెండింటి కారణము అబలలకు సాధారణముగా నుండు సాధ్వసమే. నాయకునిప్రాపున ధైర్యోత్సాహములను జూపు నబలలు తమంత వ్యవహరించవలసివచ్చినప్పుడు ముందువెనుకలకు నూగులాడుటయు, అసత్యములనుగాని పరుషములనుగాని ఆతొందరపాటులో పలుకుట సీత, డెస్డెమోనా, యను మహావాఙ్మయవీథిని రాజిల్లు సాధ్వీరత్నములయందును గనుపడును; 'మందోమాకో' పెట్టినదని నాయకు డనుమానపడినను, "యెంకి" యొక్క నిర్మలప్రేమ, ముగ్ధశృంగారచేష్టలు, అవ్యాజసౌందర్యము, ఆమెయొక్కమూర్తిని నాయకుని హృదయమున స్థిరముగ నాటివేసి అంటోకయపురూపమైన ప్రేమసుందరనిధి యనదగు భావచిత్రము నుద్భవింపజేసెను.

ఈకావ్య శృంగారరసమందు నూత్నత ఏమి? అనుప్రశ్న జనింపవచ్చును. మామూలుప్రబంధములలో వలె ఇందలి శృంగారమందు అతిశయవర్ణనలు లేవు. దూతలను, సందేశములను బంపుట, చంద్రమన్మథోపా

లంభనలును లేవు. సుఖానుభవమందు త్వరితగతిని గురించి చంద్రుని, సూర్యుని నాయిక తిట్టినదిగాని విరహావస్థయందు చంద్రుని తమ ప్రణయ వివాహమున కొక సాక్షిగాను, తనయందు సానుభూతిని జూపుచున్నట్టుగాను భావించినది. ఇందు నాయిక యొక్క ప్రత్యంగవర్ణనాతిశయములును లేవు. మామిడి పండ్లకాలమని; 'యేటి మొగ'యని, ఋతువులు సందర్భ మనుసారముగ సూచింపబడి కథకు అందమిచ్చుచున్నవి గాని ప్రత్యేకముగా పనిబట్టి వర్ణింపబడలేదు. తోటయే వారి పడకటిల్లు. మంచెయే వారిశయ్య. ఇవి ఊరక సూచింపబడినవిగాని ప్రబంధకవిత యందువలె యీకావ్యశృంగారమునకు ముఖ్యమైనపట్టుగా చేయబడలేదు. నాయికానాయకులు తోటకాపులు, వారివినోదములు తోటకు నీరెత్తుట, పాటలుపాడుకొనుట, కథలు చెప్పుకొనుట ఆవులను దూడలను సంరక్షించుకొనుట, యెప్పుడైనను యాత్రలకుబోవుట: ఇవి ప్రబంధపద్ధతికితగిన ఔన్నత్యము గలవిగావు. అయినను కవియొక్క ప్రతిభయు, పామరజనజీవితము నెడల సానుభూతియు, ఇట్టి జానపదపాత్రముల నాశ్రయించుకున్న యీచిన్నకావ్యమునకు గౌరవము నిచ్చినవని నేను దలంచుచున్నాను.

౨

కావ్యరూపమును విమర్శించుసందర్భమున కథను, పాత్రలయొక్క భావములను నాకందినవరకు సంగ్రహించితిని. నాటకములో వలె ఇందలి కథయును, పాత్రలయొక్క నడవడియును ఆవ్యక్తులయొక్క భావగర్భితములను పాటలవల్లనే తెలుసుకొనవలసియున్నది. కనుక వీనిని "రూపకగీతముల"నిగాని "నాటకకత్తుగీతముల"నిగాని వ్యవహరింపనోపును.

ఇవి యింగ్లీషు "బేలడ్సు" (Ballads)కు పోల్చవచ్చునాయని విశ్వనాథశర్మగారు నన్నడిగిరి. "బేలడ్సు" అనగా సామాన్యప్రజలయందుద్భవించి అనేకతరముల నుండిపాడబడుచున్న జనహృదయరంజకములగు కథానకగీతములు. అందులో నాటకరీతిని చురుకగు సంభాషణలుండును. గాని కవిచే కథకూడ చెప్పబడియుండును. వీటిలో కథాక్రమము (Narrative)ఉండునుగాన కేవలము వ్యక్తివాక్యములనుంచి ఊహింపబడవలసిన కథగలిగిన యెంకిపాటలను వీటితో పోల్చరాదు. పెద్దవియైనను 'బొబ్బిలికథను', 'దేశింగురాజుకథను' బేలడ్సు అనవలెను. ఈబేలడ్సుకు కవి యెవరో తెలియదు. జనవాడుకలో తరతరములబట్టి వచ్చుచు ప్రీతినిగొల్పుచుండును. "అయ్యోకొయ్యోడా!", "చనపలమ్మినాయా" యను పాటలలో యీబేలడ్ రీతి యున్నది. చిన్నచిన్న భూస్వాములగు రెడ్లు, నాయుళ్లు, వీరల అన్యోన్యవైరములను, ప్రహారకృత్యములను ఆధారముచేసికొని ఎన్నో బేలడ్సు విశాఖపట్నం జిల్లాలో పుట్టినవి. నేను వినియున్నాను, కాని పేర్లన్నీ జ్ఞాపకము రాకున్నవి. కొంచెము సంస్కరించి యిట్టివానిని పత్రికలలో ప్రకటింపనగును. విశాఖపట్నంజిల్లాలో పోలిపిల్లి సంస్థానమందు ముదిగంటి సీతారామకవిగారిచే రచింపబడినట్టి ప్రఖ్యాతినొందిన "ఆమ! యీమను వేమని త్రీవే?" (అమ్మ యీమనువు ఏమని యిస్తివే?) యనుపాట అపహాస్యోద్దేశకమైనను నాటకకత్తుగీతమే. అందలి నాయికమొగ్రవలనే ఆమెమగని అప్రయోజకత్వమును, దుండగములను యెట్లు మనసువిరిచి మనువు విరగదీసుకొనుటకు ఆమెను పురికొల్పినవో తెలియుచున్నది.

ఇట్టి పాటరూపము మనకు క్రొత్తగాదు. జానపదుల వాడుకలోనున్నది. ఉన్నతవాఙ్మయమున గానరాదు. మేఘసందేశమున మొదటి నాలుగు పద్యములలో యక్షునికథ సూక్ష్మముగాచెప్పబడియున్నది. అంతియకాక యక్షుని భాషణములు తన సందేశముచెప్పుటయందుకన్న దేశవర్ణనయందు ఎక్కువగా వినియోగింపబడియున్నవి. అదియొక్క "పద్యకథ", లేదా "చిన్నకావ్యము" అని చెప్పవలసియున్నది. యెవరిచే రచింపబడెనో తెలియక ప్రజలచే పలుతరములనుండి పాడుకొనబడుచు, క్లిష్టవర్ణనలు, క్లిష్టరచనలు, క్లిష్టకథాసందర్భములు లేక సాధారణజనులకు సహజమగుమాటలు, భావములతో నిండియుండు పద్యకథానకములను "బేలడ్సు" అందురు. వీటిలో వీరరసమే ముఖ్యముగాదు.

ఈ "రూపకగీత" పద్ధతి మనకు క్రొత్తగాకున్నను, యిట్టినాటకకత్తుగీతములతో నొకచక్కని చిన్న శృంగారకావ్యమును అల్లుట నండూరి సుబ్బారా

శృంగారికల్పన. కొంతవరకు మన ప్రబంధవాడుకల ననుసరించి ప్రేమబంధఫలముగ పుత్రప్రాప్తిగలుగు శుభసూచనతో కావ్యమును ముగించినారు. పవిత్రప్రేమ పామర జనములలో గనుపించినను సర్వజనసమాదరణీయమే. ఈ కావ్యమం దదిచంద్రమండలమువలె రంగులకళలతో * బయలుదేరినను త్వరలో రంగులుబాసి నిర్మలకాంతి నిచ్చుచు చదువరులకు పరిశుద్ధమైన ఆధ్యాత్మికానందమును కలుగజేయుచున్నది.

## 3

గ్రంథకర్తగాని వారిఆంతరంగిక మిత్రులగు అప్పారావుగాని యీకావ్యమున కొకచిన్ననిఘంటువును సమకూర్చవలసియున్నది. "పద్దాక" "యేరాపు" అను పదములు నాకును తెలియవు. దత్తమండల కళాశాలా విద్యార్థులు "ఈపాటలను వినోదముకొరకు చదివితిమి; దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు పాడగా వింటిమికాని మాకేమీబోధపడలేదని" చెప్పిరి.

ఈ యెంకిపాటలలోని భాషలో అన్నితెలుగు జిల్లాలలోగల గ్రామ్యపదరూపములును గనబడును. ఇందును గురించి అనేక విమర్శకులు వ్రాసియున్నారు. నేను విశేషముగా చర్చింపను. "సగురుకోవాలి" యను నది నిజాంప్రాంతపురూపము. 'ఆడ','ఈడ, 'యేడ', 'అడిలిపోతుండాయి', 'ఉంటావో' యను పదరూపములు దత్తమండలమందే వినబడును. 'నిదరల్లె''పోకల్లె' అనునవి గోదావరీ కృష్ణామండలములలో వినబడును. అట్లుగాదని కొందరు నాకు తెలిపిరి. నిజముగా వాడుకలో "నిద్దరకుమల్లె" యని తరుచుగావిందుము. తక్కిన భాష చాలాభాగము విశాఖపట్నంజిల్లా శూద్రజనముల వాడుకలోనిది. ఈజిల్లానుండి పాటకజనములలోగోదావరీ కృష్ణలకు వలసవెళ్లినవారిలో మిశ్రభాష యుండవచ్చును. అయినను కవి యిందలి భాషాపదరూపములను గురించి కొంచె మేమరియున్నట్లు తోచును. అంతేకాక, అక్కడక్కడ గ్రాంథికరూపములునూ ఉత్తమదేశ్య రూపములునూ గనబడును.

"పొడలేనే యెంకి పదము లీరాదలో"

"ఆరిపేయవె దీపమూ"

"ఆడినామమూర్తి"

"జేటికురికేపాట" యనుటలో "జేటికి" అనుట కంటె "బైటికి" అనురూపమే సాధారణ గ్రామ్యమందు వినియున్నాను. "సంతనపిల్లా" యను మాటలో సంతనులను ఒకజాతిఉన్నట్టు కవిగారు తనతో చెప్పిరని విశ్వనాథశర్మగా రనిరి. మత్స్యపరగణాల "సంతాలు" లా యంటిని. కాదనిరి. సంతనజాతి ఏదైనను, ఉత్తరసర్కారులలోని కాపుజాతికి సంబంధించదు. ఈ కావ్యములోని నాయికానాయకులు కాపుతెగ వారు. "సంతన" యనుశబ్దము "శిలసంతన" యను బంగారు పని వారి వాడుకలో వినబడును. "నగసంతనగ జేయబడిన ది"నుటలో తీరుగాను, యుక్తరచనగాను చేయబడిన దనునర్థమున్నది. గనుక "సంతనపిల్లా" యనుట వల్ల సర్వాంగసుందరి, సమవిభక్తాంగి యని నా కర్థమగుచున్నది. ఇట్లని నేను విశ్వనాథ శర్మగారికి బదులు చెప్పితిని. దీనికి నిదర్శన మా పాటలోనే వాడబడిన "యెల్తురుపిల్లా" అంటే "కాంతిమతి" యను నర్థముగల మాటను చూపించితిని. ఇంగ్లీషుభాషలో 'Symmetrical,'Handsome, అను పదములు "సంతన" యను నర్థము గలిగియున్నవి. మొత్తముమీద కవి గ్రామ్యవాసనమాత్రమే ఆదర్శముగానుంచుకొని పూర్తిగా జానపదరూపములను, యాసలనుఅనుకరించదలచుకొనలేదేమో నని నాకు తోచుచున్నది. అందువలననే యీకావ్యమందలి రసపోషణయు పాత్రపోషణయు ప్రహసన సుడిగుండమునుండి తప్పుకొనినవి.

ఇందలిభాష నాయికా నాయకుల జాతికిని, పదవికిని భావములకును, ఆవస్థలకును అనురూపముగనున్నది. నాయకుడు కవి. కొంచెము దేశముతిరిగినాడు. కథలువిన్నాడు. పెద్దలతో భాషించియుండును. కనుక వానిపాటలలో అన్యమండలములయందు వాడుకలోనున్న రూపములుగాని ఉత్తమదేశ్య గ్రాంథికరూపములుగాని వింతగా గనుపడ నక్కరలేదు. భాషాసాంకర్యదో

* "రక్తభావ మపహాయ చంద్రమా జాతఏవ పరిశుద్ధమండలః"—(కుమారసంభవము)

షముగాని, అనౌచిత్యదోషముగాని యీకావ్యమునకు ఆపాదింప నక్కఱలేదని నాయభిప్రాయము. గ్రాంథిక భాష నుపయోగింప నిష్టములేక యీగ్రామ్యభాషను కవి ప్రయోగించలేదు. కథా పాత్రోచిత మగుననియే.

గ్రామ్యము భక్తికీర్తనలలో సమ్మిశ్రముగా నుండును. ఇవి పండితులనుండి గ్రహించిన సంగతులను శూద్రులలో ఎడ్లరామదాసువంటి మహాభక్తులు పాడుకొన్నవి. బొబ్బిలిపాటవంటి వీరకథలలోను గ్రామ్య భాషయే. యిది పటిష్ఠముగా నుండును. వీటిని రచించిన కవి శూద్రజాతులలోనివాడే అయియుండును. వీటిని శూద్రజనమేకాక అందరునూ ఆదరించగా నేను జూచియున్నాను కవియొక్క ప్రతిభ కొంతవరకు భాష ననుసరించినదిగాని, గ్రంథమును వాఙ్మయమున జేర్చగలిగినది గాదు. ఆధునికవిద్యాదర్శములు యిప్పుడాపనిని జేయగలవు.

ఉన్నతజాతులవారు యిట్టి గ్రామ్యమును గ్రంథ రచనకు ఉపయోగింపరు. వాడినచో అపహాస్యము కొరకుగాని, వినోదముకొరకుగాని వాడుదురు. జాతి వివక్షతలేక భావరంగమున పవిత్రభావములు ఉన్నతాదర్శములు మాత్రమే పవిత్రతను ఆధిక్యమును యిచ్చునని చాటుటకు యీ 'యెంకిపాట'లను సాధుశృంగార కావ్యము రచింపబడినది అని ఊహించెదను. యీ "సాధుశృంగారకావ్యము"నకును "స్వాదుశృంగారకావ్య"మని వ్రాయబడిన పుష్పబాణవిలాసమునకున్నూ వ్యత్యాసము సారస్వతధర్మవిచక్షణులు గమనింపకపోరు. ఈ రెండిటిలో నేది చిల్లరశృంగారమో? గొప్పకవులు పచ్చి వర్ణనలకు సంస్కృత సమాసముల నుపయోగించినట్టు చాటువుల వినుచుందుము. ఏది నిరంకుశకవనమో విచక్షణులు నిర్ణయింతురుగాక !

యింగ్లీషులోని పేస్టోరల్ (Pastoral) అనునొకరీతి కృతకజానపదకవితకు దీనిని పోల్చవచ్చునాయని ఎవరైనను అడుగవచ్చును. నేనీకవిని స్పెన్సర్ (Spencer)కు పోల్చినందున ఈప్రశ్న ఉదయించవచ్చును. స్పెన్సరీ గ్రామ్యమును వాడలేదు. ప్రాతగ్రంథముల సహాయమున నొకకృతకభాషయల్లి తనకృతక గోపాలురకు తగిలించెను. ఈపేస్టోరల్ కవనమందు జానపదులను, గొల్లలను పాత్రలుగాచేసి, వారియలవాటులను, వారిభాషను మిషగాగైకొని సారస్వతరాజకీయాది పలువిషయములను ముచ్చటించుచు, పలుచర్చల సాగించు వాడుక గలదు. దానిలోని ప్రకృతి వర్ణనలును కృతకములే. నిజముగా నాయాదేశముల నుండు శైలాదులనుగాక ఏవో కవిమనోవీథిని రూపునొందు తరుశైలాదులు చిత్రింపబడును. ఈయెంకిపాటలలోని ప్రకృతివర్ణనలు నిజమైనవి. తోటకాపులు, వారిఆవులు దూడలప్రశంస, వారితోటకు నీరెత్తుట మొదలగుపనులు, వారి ముగ్ధోత్సాహములు, సంభాషణలు గలిగిన యీకావ్యము ఇంగ్లీషువాఙ్మయమున ఐడిల్ (Idyll) అను చిన్నకావ్యరూపములను బోలియున్నది. ఈకావ్యనాయకుడు తనజాతికి మించని బుద్ధి సూక్ష్మత, ప్రతిభ, కవనకౌశలము గలిగియున్నాడు. ఈతని పత్నీవర్ణనము, ప్రేమప్రకటనము, గీతారచనము మూలముగ కాపులజీవితము కొంతవరకు లలిత రీతిని చిత్రించబడినది.

ఒక మిథునముయొక్క పరస్పరానురాగమును ప్రారంభమునుండి ఫలావాప్తివరకు ప్రదర్శించుచు ఏకభావాశ్రయములగు నీముప్పదియైదు గీతికలను ఇంగ్లీషు వాఙ్మయమున కొందరుకవులచే రచింపబడిన సానెట్-సీక్వెన్సు (Sonnet-Sequence)కు పోల్చనగును. ఇప్పుడు సానెట్సు ధ్యానప్రధానమైన చాటురూపములైనను, మొట్టమొదట పాటలుగానే పరిగణింపబడి శృంగారానురాగముల కాశ్రయమై యుండెను. అట్లయినను యీ 'సానెట్' కావ్యరూపము కవియొక్క స్వకీయభావ ప్రకటనకొరకే ఉపయోగపరుపబడెను. ఇది యీసానెట్టుకున్నూ రూపకగీతమునకున్నూ భేదము. ఈ యెంకిపాటలను రూపకగీతికలమాలిక (Dramatic-Lyric-Sequnce) అనవచ్చుననుకొందును.

## ౪

ఇక నీపాటలయం దుపయోగించిన శైలిని పరిశీలింతును. అంతటను సరళమై అల్లిక జిగిబిగిలేక పాత్రముల యాచారముల కనువగుశైలియే వాడబడియున్నది. వర్ణనలు, ఉపమానములు, అనుప్రాసములు పోలము

కాపరుల జీవితమందు సహజముగా వచ్చునవియే కన బడును." ఆకాలపు నాయెంకి" అనుపాటలో

తులిసెమ్మ వొరిగింది
తొలిపూస పెరిగింది
మనసులో నాబొమ్మ మసకమసకేశింది.

అనేచరణము 'యెంకి' ప్రాణము మించినదని నాయభిప్రాయము. ఈకాపునాయిక ఎంత "ఉత్తమయిల్లాలై"నను, తులసిపూజ బ్రాహ్మణుల యిండ్లలోనేకాని ఉండదు. "మనసులో నాబొమ్మ" యనగా తనప్రియుని బొమ్మ, తన మనోవీథిని ఎప్పుడు నాడుచుండునది యని యర్థము. నిత్యము కాంతిగలిగి యుండునది నేడు మబ్బుగా నున్నదట. అందుచే తనప్రియున కేమి ఆపద వచ్చెనోయని బెంగగొనినది. ఇట్టి ఉన్నతోత్ప్రేక్ష విద్యాధికుగాలినోట నుతగి యుండును. కవియైన నాయుడునోటనైనను సహజముగానుండును. అయితే పదములుపాడుట, కథలు చెప్పుట యీామెకు కూడా ప్రియమైనట్లు "నమిలిమింగిన నాయెంకి" అను పాటలో నాయుడు చెప్పుచున్నాడు. అంతేకాక కవియైన నాయుడుతో సహవాసము ఈపాటలను గురించియే. వానియందా మెకుమక్కువ. నాయుడు ఇతరుల వద్ద యెంకినిగురించి పాడినట్లే యెంకియు తనసెయ్యిరాండ్రవద్ద తనవలపు, తనప్రేమ, తనవిరహమును గురించి ముచ్చటించుట కలవాటుపడినది. "ముత్యాలపేరు" పాటలో నాయికానాయకులు యిద్దరును తరుచుగా యిట్టి ఊహలతోను ఉత్ప్రేక్షలతోను వినోదించి మురియుచుండునట్లు తెలియుచున్నది.

"నమిలిమింగిననాయెంకి" యను పాటలోని శైలి ఆదిభట్ల నారాయణదాసుగారి "లేజవ్వనంపుపసందు" అనుపాటనునాకు జ్ఞాపకము తెచ్చినది. ఈక్రింద నుదహరించిన చరణములశైలిని సరిపోల్చిచూడనగును:—

మెళ్లొపూసలపేరు
తల్లోపూవులసేరు
కళ్లెత్తితే సాలు
కనకాబిసేకాలు—
సెక్కిటసిన్నిమచ్చ
సిసితేసాలదు లచ్చ
వొక్కొనవ్వేయేలు
వొజ్జిర వొయిడూరాలు—

(యెంకిపాటలు)

తొగరువాతెరదొండ
నగవదిరేయెండ
పల్కొగానెరాలువరాలు
పసిముద్దరాలు
లేజవ్వనంపుపసందు

(నారాయణదాసు)

"రాసోరింటికైన రంగుదెచ్చేపిల్ల"— ఈ యుపమానము క్షత్త్రియకుటుంబముల నెరిగిన కాపుకు సహజము. ఉత్తరసర్కారులలో మంచి క్షత్త్రియకుటుంబములు అనేకములున్నవి. "నాగుండె నమిలిమింగినపిల్ల" యను నతిశయోక్తి నిత్యమును తనభావములను పరీక్షించుకొనుచుండు యీకాపుయువకునికి సహజముకాదనుటకుసాహసింపను. "గోవుమాలచ్చిమి"లో మనిసికైనా లేని మంచి గుణములుగలవని కనిపెట్టిన నాయుడికిన్నీ, చంద్రునిలో సానుభూతియుతమగు కన్నీరు కనిపెట్టగలిగిన యెంకికిన్నీ ఉత్ప్రేక్షలు అసహజములుగావు. యింతకూ నాగరజనులవాడుకలోకన్న భావనిగ్రహణమున కలవాటుపడని ప్రాకృతజనముల వాడుకలోనే రూపకోపమోత్ప్రేక్షాతిశయోక్తులు తరుచుగా వినబడుచుండును.

ఈసందర్భమున పాటలపేర్లనుగురించి ఒకటిరెండుమాటలు చెప్పవలసియున్నది. "ముద్దులనాయెంకి" యను మొదటిపాటలో ముద్దులమాటయే కానరాదు; విసుగుదలయేకాని. విశేషణమువిడిచిపెట్టిన బాగుండునేమో? "యేటిదరినాయెంకి," "నాయెంకి", (18-వ పుట) "ఆకాలపునాయెంకి" అను నీమూడుపాటలు నాయికావాక్యములు. 'నా' యను సర్వనామము విడిచిపెట్టినయడల బాగుండును. "సుక్క" పాటలోయిది లేదు. 'నా' యనిఉంటే, తనప్రియురాలి భావములను తాను తెలుసుకొని నాయకుడేపాటనుగూర్చినట్లనుకొనవలెను. అట్లయిన 'నా' యనుపదము నాయికవాక్యముగనున్న పాటలన్నిటికి జేర్చవలెను. "నాయెంకి"యను

పాటలో "నీతైనవోడె నారాజు" అని యెంకి అనుచున్నది. ఇది ఆమెవాక్యముగా నుంచిననే యొప్పును. "ఆనాటి సావోడు" అనుపాటలో 'నా' యనునది యెంకికి సంబంధించును. ఇందులోను, సుక్కపాటలోను వాక్యములు నాయకునినోటనుండు పాటరూపమున పునర్జన్మమొందిన వనుకొనుట బహునిరుపయోగమైన క్లిష్టసమన్వయము. అందుచేత పైనపేర్కొనబడిన మూడుపాటలలోని 'నా' యను సర్వనామము తీసివేయుటయే మంచిదని నాయభిప్రాయము. అట్లు చేసినయెడల ఆపాటలు సహజముగా నాయికావాక్యములుగానేయుండును.

'పంటసేలకేపయనం' అనుపాటలో నాయికయొక్క మనోజ్ఞత, దేవతాభక్తి, పతిప్రేమ, అమాయికత్వము బహుమనోహరముగా తెలుపబడుచున్నవి. గాని పయనము ఊహించుకోవలసియున్నది. ఆటలాడి, పాలుపితికి, యేరుదాటి, పువ్వులుపుణికి, కొండలోయలోని గుడికిబోయి, దేవతనుపూజించి, యాప్రసాదము తెచ్చి తనప్రియునకిచ్చి "దేవతాప్రసాదమువలన మనము సుఖముగానుంటేచాలును. నీవును నావలె భక్తిగలిగి యుండుము. అధికభాగ్యములు ఆభరణములు అక్కరలేదు." అని నాయకునితో ననుచున్నది. ఆమెయొక్క అందమునకలరి అమాయికత్వమునకు జాలినొందినాడు నాయకుడు. పయనము ముందు గుడికి, తరువాత పంటచేలకును. ఇట్టిగూఢ సమన్వయములు వేదాంతార్థములు గల జానపదపుపాటలలో కలవు. సామాన్యపు పాటలలో అరుదు. ఒక్కసారియే విన్నాను. యెవడో జానపదరసుడు ఊరివెలుపల చెరువుప్రక్కను చెట్టుక్రిందనున్న మేదరవానిగుడిసెవద్ద తానువలచిన యువిద గనబడెనని చెప్పుటకు "ఆహా పచ్చానరా" "నీరూ చల్లానరా" యని తనపాట నారభించినట్లు జ్ఞాపకము.

౫

ఈ యెంకిపాటలకు రాగతాళప్రస్తారము గూర్చబడియున్నది. ఈరీతినే గ్రంథకర్త తానును పాటలను పాడుదురట. మొన్న మార్చినెలలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు దత్తమండల కళాశాలను దర్శించినప్పుడు, ఆపాటలను యింకననేక ఆధునికుల పద్యములను యిట్టి రాగవరసలతోనే పాడిరి. అన్నిటికీ ఒక్కటేవిధము. అర్థములేని శబ్దములనుకూడా యిట్లే పాడవచ్చును. గాయకులు న, ర, అ, ఇకారములతో యిట్లే రాగప్రస్తారము చేయుచుండుట విందుము. తిల్లానలు కూడా యిందుకు నిదర్శనము. గాని అదియే యీపాటలు పాడేవిధమగుచో యీజానపదభాషయును, యీజానపదవరసలును అనవసరము. మామూలుగా కవిమాట్లాడుభాషయే ఉపయోగించియుండిన నెంతో ఒప్పియుండును. జానపదకృతులు, జానపదకథానకములు, గీతములును జానపదులు పాడుకొనురీతినే పాడుట సమంజసము. ఒక యింగ్లీషు విద్యావతి 1911 సం||రం దర్బారు వేడుకలసందర్భమున రాజమండ్రిలో నొకసభలో నో జాన్ నో (No, John, No) యను చిన్న బేలడ్‌ను జానపదవరుసతోనే పాడెను. అది యింపుగా నుండెను. అందునుగురించి నేను శాస్త్రిదొరగారితో ముచ్చటించగా అదియే సరియైనరీతియని వారు సెలవిచ్చినట్లు నాకు జ్ఞాపకము. నాగరసంగీతరీతుల నుపయోగించుటవలన యీ జానపదగీతాసుమములు వాడి, వన్నెచెడును. అనౌచిత్యదోషమువలన వానియందలి రసము నీరసించును.

జానపదగీతములకు తాళముండునని యెల్లరకు విదితమే. వాని రాగములను నాగరసంగీతములోని రాగనామముల క్రిందకు దీసికొనవచ్చును. కాని వానిని పాడే వరసలువేరు. తాళము ముఖ్యము. కొన్ని నృత్యము నపేక్షించును. ఆవరసలు వానికే ఉచితము. వనములోని శుకము యొక్క రావములోని మాధుర్యము వేరు. పంజరములోనిచిలుక పలుకుల వినోదము వేరు.

౬

ఈ పై విమర్శభాగములలో నాయభిప్రాయములను దెలియబరచితిని. వానినన్నిటిని కవిగారును, కృతిభర్తయగు భావరాజు సుబ్బారావుగారును, మామిత్రులగు విశ్వనాథశర్మగారును, పలువిధముల ఈకావ్యమును విమర్శించిన పండితవరులును సమగ్రాంధ్ర విద్వ

ల్లోకమును సాదరముగ నవలోకించి నాకీకావ్యమున అవగాహనకాని విషయములను భారతిలో వ్యక్తీకరించియు, పొరబాటులకు సవరణలను సూచించియు ధన్యుని జేయుదురని నమ్ముచున్నాను. ఈ "యెంకిపాటలు" అను చిన్నినవ్య శృంగారకావ్యము పండిత పామరజనములకందరికిని వినోదమును గూర్చుటయేగాక లాలిత్యనిర్మలానురాగాతిశయములను పెంపొందించుచు వర్ధిల్లునుగాక !



# ఆహా! ఏమి స్వభావము!

చిదంబర శాస్త్రి గారు (శతావధాని)

ఉన్నది నీకు గొప్పగని యున్నది నీకు మహాస్పదంబు నీ
కున్నది దొడ్డపేరు పడియున్నది నీకడ భాగ్యలక్ష్మి నీ
కున్నది భూరిపార్శ్వజన మున్నది నీకధికారమెల్ల నీ
కున్నది నాకులేనిదియు నొక్కటియే సుమి లోభికాష్ఠమా!

ఉ. ఉన్నది నీకుఁ బండితులనుంచి మహోన్నతపాఠశాలలో
నెన్నికఁగన్న విద్దియల నేర్పడఁజేసి సమస్త భారతా
భ్యున్నతిఁ గూర్పఁగావలయు నుండిన దానికటన్న కాంక్ష నీ
కున్నది నాకు లేనిదియు నొక్కటియేసుమి లోభికాష్ఠమా!

ఉ. ఉన్నది నీకు సాధుజను లుండఁగ సత్రముఁగట్టి దానిలో
నన్నము వెట్టి యాఁకలియటన్న మనుష్యులకెల్ల, భూమిపై
నెన్నికఁగాంచి యూర్ధ్వమున నెన్నికగాంచెదనన్న కోర్కె నీ
కున్నది నాకులేనిదియు నొక్కటియేసుమి లోభికాష్ఠమా!

ఉ. ఉన్నది నీకు లోకమున నుత్తమమైన యశంబుగల్గఁగా
వన్నెయు వాసియుంగల ప్రబంధములన్ రచియింపఁజేసి పే
రెన్నికఁగన్న సత్కవుల కిచ్చెదఁ జచ్చెదనన్న కోర్కె నీ
కున్నది నాకులేనిదియు నొక్కటియే సుమి లోభికాష్ఠమా!

ఉ. ఉన్నదినీకు నర్చకుల నుత్తముల న్నియమించి భూములన్
మన్ననతో నొసంగి పదిమంది నుతింపఁగ దేవతాలయా

భ్యున్నతిఁ గల్గఁజేయుటకుఁ బూనెదనన్న మనోరథంబు నీ
కున్నది నాకు లేనిదియు నొక్కటియే సుమి లోభికాగ్రమా!

ఉ. ఉన్నది నీకు ధర్మముల నొక్కమొగిం బొనరించి ఖ్యాతిసం
పన్నములైన వృత్తి పరిపాటులలోఁ దలయెత్తి గొప్పవాఁ
డన్నయశంబుఁ గాంచవలదా కలదాని కటన్న కోర్కె నీ
కున్నది నాకు లేనిదియు నొక్కటియేసుమి లోభికాగ్రమా!

ఉ. ఉన్నది నీకు సామజము లుష్ట్రము లశ్వములుఁ రథంబు లె
న్నెన్నియొ వాహనాదులను నెక్కిజనంబులు విస్మయంబుతో
నన్నియుఁ జూచుచుండఁగ విహారముఁజేతునటన్న కోర్కె నీ
కున్నది నాకు లేనిదియు నొక్కటియే సుమి లోభికాగ్రమా!

ఉ. ఉన్నది నీకు మంచిగృహ మొక్కటిగట్టి స్వతంత్రవృత్తిచే
కన్నెరికంబువెట్టి వెలకాంతకు నూతనమన్మథుండు నా
నన్నులమిన్నలెల్లఁ గొనియాడ వసించెదనన్న కోర్కె నీ
కున్నది నాకు లేనిదియు నొక్కటియే సుమి లోభికాగ్రమా!

ఉ. ఉన్నది నీకు దేశమునకుండిన బాధలు డుల్లిపోవ నా
కున్నధనంబునెల్లను మహోద్ధతిమై వెదచల్లి సౌఖ్యసం
పన్నతఁ గల్గఁజేయుటకుఁ బాల్పడఁగావలె నన్న కోర్కె నీ
కున్నది నాకు లేనిదియు నొక్కటియేసుమి లోభికాగ్రమా!

ఉ. ఉన్నది నీకు యజ్ఞము లనూనవిధానముతో నొనర్చి సం
పన్నములైన వర్ణమహిమంబుల నన్నియు నుద్ధరించి రా
నున్న యనర్థముఁ గెడప మూకొనఁగావలె నన్న కోర్కె నీ
కున్నది నాకు లేనిదియు నొక్కటియేసుమి లోభికాగ్రమా!

సంపూర్ణము



# రామాయణమునందలి వానరులెవరు?

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు

(వెనుకటిసంచిక తరువాయి)

కిష్కింధంగూర్చి

కిష్కింధః - పుం. (కిం కిం దధాతిధా + కః-పారస్కరాదిత్వాత్, పూర్వస్య కిమోమలోపః సుట్ చ త్వంచని పాతనాత్. —శబ్దకల్పద్రుమ.

(కావలసినవాని) అన్నిటిని ధరించునదికాబట్టి కిష్కింధ పేరువచ్చినదని మనపెద్దలు తెలిపియున్నారు. అయినను మనరామదాసుగారొక క్రొత్తవ్యుత్పత్తిని శబరభాషనుండి కల్పింప నీక్రిందిరీతి నుద్యమించిరి.

"కిండాన్, అనగా సవరభాషలో 'వెనుక' 'కిష్ + కిండాన్' అనగా 'కిష్'కు వెనుకప్రక్క, అతికష్ట సాధ్యమైనదిగాన 'కిష్' అని చెప్పియుండవచ్చును. సవర భాషలో 'కియాన్' అనగా 'చావు'—యెక్కుటకు దుర్లభమైనది. ఒక్కరాత్రి దానిపైన పరుండిన జనులు చచ్చిపోవుదురు. (అర-73-36.) కావున ఇట్టికష్టసాధ్యమైనదానిని 'చావును గలుగజేసేది' అనిన తప్పేమున్నది! కియాన్ + కిండాణ్ (కష్టసాధ్యమైనదాని + వెనుకనున్నది) అనునది ఆర్యులవాక్కులో 'కిష్ + కింధ=కిష్కింధ' అని అయినది."

ఇది వీరిచ్చిన వ్యుత్పత్తి. "కియాన్" అనగా శబరభాషలో చావఁట. ఆ 'కియాన్' అనుపదమునుండియే 'కిష్' అనుపదము పుట్టినదఁట. కాన కష్టసాధ్యమైనదని వీ రర్థము చేయుదురఁట. దీనిని ఋశ్యమూకముగా గ్రహింతురఁట! ఇదియంతయు నసంగతము. చావను నర్థముగల 'కియాన్' శబ్దమునుండి ఋశ్యమూక పర్వతమను నర్థము లాగట యధర్మము. ఆ యర్థమును దీయుటకై ఋశ్యమూకముపై నొకరాత్రి జనులు పరుండిన చచ్చిపోదురని రామాయణము చెప్పుచున్నట్లుగా రామదాసుగారు లిఖించిరి. రామాయణ మట్లు చెప్పుట లేదు. పాపాత్ములెవరైన దానిపై శయనించిన రాక్షసులచేఁ జంపివేయఁబడుదురని యది చెప్పుచున్నది. కావున 'కియాన్' శబ్దమునుండి 'కిష్' పుట్టినదనియు నయ్యది ఋశ్యమూకపర్వతమును బోధించు పదమనియు అట్టి దానికి వెనుకనున్నది యనుటకై 'కిష్కింధ' పదము వాడఁబడినదనియు చెప్పుట యెట్లయిన శబరభాషతో నీపదమును సంబంధింపఁజేయుట కగు విపరీత ప్రయత్నమునుగాని మఱియొకటి కానేరదు. కియాన్ (కిష్) కలిగించునది అను సమస్తపదమున్నయెడల దానింబట్టి మనరామదాసుగారు చెప్పునర్థము దీయ నించుకయైనఁ బ్రయత్నము చేయవచ్చునేమో కాని 'కియాన్' శబ్దము నుండియే చావును కలిగించునది యను నర్థము చెప్పుట యసంగతము. ఇది మనపెద్దలుచెప్పిన వ్యుత్పత్తి కంటె నేవిధమునజూచినను నెక్కుడు సరసముగ లేదు. విపరీతముగాఁ దీయఁబడినభావములతో నిండియున్నది. కావున నగ్రాహ్యము.

ఇఁక ఋశ్యమూకముం గూర్చి ముచ్చటించుకొందము. ఋశ్యములనగా లేళ్లు. ఆలేళ్లమూకలతోఁ గూడినదిగాన ఋశ్యమూకమను పేరువచ్చినదని మనపెద్దలు వ్రాసియున్నారు. ఈవిషయమైరామదాసుగారేఇటులు వ్రాసిరి: "జటాధరుఁడను వ్యాఖ్యాత 'ఋశ్యో మృగో మూకో యత్ర' యని యర్థము చెప్పినాఁడు."

పెద్దలిట్టి వ్యుత్పత్తినిచ్చియుండగా లేళ్లాకొండయందున్నట్లెచ్చటను జెప్పఁబడియుండలేదఁట. ఆపే

తువుచే నాయర్థమును మనరామదాసుగారంగీకరింప రట. ఋశ్యమూకమున లేళ్లున్నట్లెచ్చటను జెప్పఁబడ లేదుగాని అవి యందు లేవట్లెచ్చటను జెప్పఁబడలేదు గదా! కాన లేళ్లుకలవని యర్థము చెప్పుకొనుటకు హాని యేమున్నది? మనవారు చెప్పునర్థము నమ్మ నర్హము కానిదిగా లేకున్నను దానిఁద్రోసివేసి శబరభాషనుండి దీనికి వ్యుత్పత్తినిబుట్టింప మనరామదాసుగారీ క్రింది రీతిని లిఖించిరి:—

"సవరలు ఏనుగకు 'రా' అందురు. దీనికి బహువచనము 'రాజీ' దీనికి షష్ఠీప్రత్యయమైన 'ఆ' చేర్చిన రాజ్య + మూక, (ఏనుగులగుంపు) అని అగును. ఇదియే ఋశ్యమూక అయినదని తోఁచును.''

ఇది అంతగా సరసముగాఁ గాన్పించుటలేదు. గ్రామాదినామములఁ దెలుపు సందర్భములో షష్ఠీవిభక్తి ప్రత్యయముగా 'ఆ' వచ్చుట యసంగతము. 'రాజీ + ఆ రాజ్య' అగుట సంస్కృతసంధిగాని దేశభాషాసంధి గాదు. అదిగాక వీరుచెప్పు నర్థమందును సంబర్భ మంతగా లేదు. ఋశ్యమూకము ఏనుఁగులకు ప్రసిద్ధి కెక్కినట్లుగా నెచ్చటను దెల్పఁబడి యుండలేదు. 'శిశునాగాభిరక్షితః' అని రామాయణము చెప్పుచున్నది గాని యీ 'శిశునాగ' శబ్దమునకు రామదాసుగారివంటి నవీన భాషావిదులు 'శిశునాగు' లన నొకజాతి మానవులని యర్థము చెప్పుచున్నారు. రామాయణవ్యాఖ్యాతలు 'కలభము' లని యర్థము చెప్పుచున్నారు. మన రామదాసుగారు చెప్పునర్థము గ్రహించినవా రెవరును గానరారు. కావున సవరలుమాత్రము ఈపర్వతమును రాజ్యమూక, ఏనుఁగులమూఁకలు కలదియని యెట్లు పిలువఁగలరు? కావున ఋశ్యమూకశబ్దమునకు మనపెద్దలిచ్చిన యర్థమే సరసముగ నున్నది.

## లంకాశబ్దార్థవిచారము

ఇక లంకాశబ్దముంగూర్చి ముచ్చటించుకొందము. ఈశబ్దవ్యుత్పత్తిఁగూర్చి శబ్దకల్పద్రుమమునం దిట్లున్నది.

"**లంకా**—స్త్రీ—(రమన్తే అస్యామితి—రమ్ + బా**హులకాత్** కః రస్యలత్వం ఇత్యుజ్జ్వలః, 3-4 రక్షఃపురీ"

"లంకా—స్త్రీ—లక్ అచ్ సుమ్ చ—స్వనామ ఖ్యాతాయాం పుర్యాం"—వాచస్పత్యము.

"లాక్యతే సుఖ మస్యామితి,లంకా. లక్—ఆస్వాదనే; చురాదిః. యద్వా, మంతే—అస్యామితి లంకా. బాహులకాత్కః లత్వంచ"—భానోజీదీక్షితీయము.

సుఖము నిచ్చునది గావునను భోగవము గావునను 'లంక' యనుపేరు వచ్చినదని మనపెద్దలు చెప్పుచున్నారు. ఆ వ్యుత్పత్తుల నన్నిటిని నిష్కారణముగాఁ ద్రోసివేసి మనరామదాసుగారీక్రింది వింతవ్రాఁతను వ్రాసిరి.

"'లంకా' యనుపదముయొక్క అర్థమును నిఘంటువులలో జూచిన, 'రావణుని ముఖ్యపట్టణ'మని యే యున్నదిగాని మరియేమియు లేదు."

ఇదితప్పువ్రాఁత 'లంకా' శబ్దమునకు సంస్కృతములో బహ్వర్థములుకలవు. వాని నన్నిటిని మేదిన్యాది నిఘంటువులు పేర్కొనుచునే యున్నవి. మేదినియం దిట్లున్నది:—

"లంకా రక్షఃపురీ శాఖా శాకినీ కులటాసుచ."

(1. రావణునిపురము, 2. కొమ్మ, 3. ఒకశాకిని, 4. లంజ)

లంకాశబ్దమున కిన్నియర్థములుండగా రావణపురి యను నర్థ మొక్కటియే కలదనుట యసంగతము.

## 'లంకా' శబ్ద మెట్లేర్పడినది?

'లంకాన్' అను శబరశబ్దమున కొంతలోపము (నకారపొల్లు యొక్కలోపము) రాగా 'లంకా' శబ్దమైనదనియు నీయంశమును నామలింగానుశాసనము తెలుపుచున్నదనియు రామదాసుగారిటులువ్రాసిరి:—

"లంకాన్" శబ్దములో తుదినకారపొల్లుపోయిన 'లంకా' యని ఆకారాంతశబ్దమగును. కాన నిది స్త్రీలింగశబ్దముగా సంస్కృతమున వాడఁబడును. ఇది నామలింగానుశాసనము 3-వ కాండ 5-వ సర్గ 5-వ శ్లోకములో చెప్పఁబడినది.

"స్త్రీస్యాత్ కాచి న్మృణాళ్యాది
ర్వివక్షాపచయేయది,
లంకా శేఫాలికా టీకా
ధాతకీ పంచికాఢకీ.

వివక్షకొఱకు చెప్పినప్పుడు మృణాల్యాది శబ్దములున్ను అంత్యలోపము గలిగినప్పుడు కొన్నిశబ్దములు స్త్రీలింగములగుచున్నవి. 'లంకా' అను శబ్దము వివక్షకొఱకైనదిగాదు కాని అపచయమును బొందినపదముగాన స్త్రీలింగమైనది. కాన ఈశబ్దమునకేదో లోపముగలిగినదని స్పష్టపడుచున్నది. ఏమి లోపించినదో పైనజూచితిమిగదా! ఇందువలన నసరనామము సంస్కృతమునందు గొంతలోపమును బొంది 'లంకా' అయినదని స్పష్టమైనది."

ఇదియంతయును దప్పువ్రాఁత. నామలింగానుశాసనము సంస్కృతపదములంగూర్చి ముచ్చటించునది. సంస్కృతభాషలో తద్భాషాపదము లెట్లు నామలింగాదులను పొందునో చెప్పునది కాని శాబరాది దేశభాషాపదములు వికారమునందిసంస్కృతపదము లెట్లైనవో తెలుపునది కాదు.

"స్త్రీస్యాత్కాచి న్మృణాళ్యాది ర్వివక్షాపచయేయది."

అను నమరవాక్యము మృణాళ్యాదిశబ్దములంగూర్చి ముచ్చటించునదికాని లంకాది శబ్దములనుగూర్చి ముచ్చటించునదికాదు. 'వివక్షాపచయే యది' అల్పార్థమందు వివక్ష కలిగినపుడు మృణాళశబ్దము మొదలు కొన్ని శబ్దములు స్త్రీలింగములు. (కాచిత్) కొన్ని యనుటచే 'అల్పో వృక్షో వృక్షకః' మున్నగునవి గ్రహింపవలెను. మృణాళ్యాది అని ఆదిశబ్దము ప్రయోగించుటచే కుంభీ, ప్రణాళీ, ఛత్రీ, పటీ, తటీ, మఠీ, వటీ మున్నగునవి గ్రహింపవలెను అని దీనిభావము. అల్పార్థమందు స్త్రీలింగములగు శబ్దములంగూర్చి యిందుఁ దెల్పఁబడినది. లంకాదిశబ్దము లిందులోనివి కావు. లంకాదిశబ్దము లంత్యాక్షరలోపముచే స్త్రీలింగము లైనవని అమరసింహుఁడు చెప్పియుండలేదు. అమరసింహుఁడు చెప్పిన లంకాదిగణమున బహుశబ్దములు కలవు. అవియన్నియు తుదియక్షరము లోపించుటచే నైనవనుట కెవ్వరికిని శక్యముకాదు. 'లంకాణ్' అను శబరశబ్దమునుండి 'లంకా' శబ్దము పుట్టిన శేఫాలికా, టీకా, ఆఢకీ మున్నగుశబ్దము లేభాషలోని యే యంత్యాక్షరలోపముచే వచ్చినవి? అవి శబరభాషలోనివే యైయుండునా? అనిన ఈనిరూపణమెవరు చేయఁగలరు? రామదాసుగారికి సాధ్యమగునా? అది యటులుండ, లంకాశబ్దమునకే వేశ్యఅనియు, లంజయనియు, కొమ్మయనియు, నొకరాక్షసియనియు వేఱువేఱర్థములు కలవుకదా! కులటాద్యర్థ సందర్భమునఁగూడ పాడవనునర్థముగల 'లంకాన్' అను శబరభాషాపదమునుండియే లంకాశబ్దము పుట్టినదనవచ్చునా? అట్లు చెప్పుట కవకాశము లేదుకదా. కావున 'లంకాన్' అను శబరభాషాపదమునుండి తుదియక్షరము లోపింపగా లంకాయను సంస్కృతపదము పుట్టినదనుట యసంగతము. అమరసింహుఁడాయాశబ్దములు అంత్యాక్షరలోపముచే లంకాదిశబ్దములు కలిగినవని చెప్పియే యుండలేదు.

ఇంక 'లంకాన్' అను శబరభాషాపదమునకును, రావణపురియగు లంకకును మన రామదాసుగారు కలుపు సందర్భమునుగూర్చి ముచ్చటించుకొందము. ఇందులకై మన రామదాసుగారు రామాయణము లంకనుగూర్చి యేమిచెప్పుచున్నదో యాయంశమును సువ్యక్తము చేసిరి. రామాయణము లంకాపురము పర్వతాగ్రమున నున్నట్లు చెప్పుచున్నదని ప్రతివాదు లుదాహరించిన యుదాహరణములంబట్టియే తేలుచున్నది. చదువరుల యుపయోగార్థమై వాని నీక్రింద నిచ్చుచున్నాను.

"హనుమంతుఁడు దానినిజూచినవారలలో మొదటివాఁడు. ఆయనతిరిగివచ్చి రామునితో దాని నిట్లు వర్ణించెను.

"శైలాగ్రే రచితా దుర్గా సాపూ ర్దేవపురోపమా"

—యుద్ధ: 3. 3.

అనియున్నదని రామదాసుగారు వ్రాసిరి. దీనింబట్టి యయ్యది పర్వతముమీద నున్నట్లు తేలుచున్నది.

"రెండవవాఁడురాముఁడు. సముద్రమును దాటినవెంటనే రావణునిపట్టణమును జూచి లక్ష్మణునితో నిట్లు సెలవిచ్చినారు.

"ఆలిఖంతీ మివాకాశ ముదితామ్........
మనసేవకృతాం లంకాం నగాగ్రేవిశ్వకర్మణా."

—యుద్ధ 24. 9.

దీనింబట్టికూడ లంకయొక్క ప్రధానలక్షణము పర్వతముమీఁద నుండుటయని తేలుచున్నది.

దానిరాజైన రావణుడు సీతతోఁ దనస్థానము విషయమై చెప్పినప్పుడుగూడ తనపట్టణము పర్వతశిఖరముపై నున్నదనే చెప్పెను."

అని రామదాసుగారు వ్రాసిరి. కావున లంకయొక్క ప్రధానలక్షణముబట్టి దానికిఁ బేరిచ్చుచోఁ బర్వతము మీఁద నున్నదనుభావము వచ్చునదిగావలెను. (1) కూనవరము (కోనవరము) "పర్వతములం దున్నది." వేమగిరి, శ్రీశైలము, చంద్రగిరిదుర్గము మున్నగురీతిగాఁ బేరుండవలెను. కాని ఔన్నత్యమును దెల్పునదిగా నుండుటలో సారస్యము లేదు. లంకాపుర మున్నతమైన గిరిమీఁద నున్నదని వర్ణింపఁబడినది కాని తా నున్నతముగా నున్నట్లుగా వర్ణింపఁబడియుండలేదు. కాన ఔన్నత్యమును దెల్పు 'లంకాఙ్' అను శబరశబ్దమునుండి 'లంక' పుట్టినదనుటలో సారస్యము లేదు. ఉన్నతమైన గిరిశిఖరముననున్న చీమను నున్నతమైనదానినిగాఁ జెప్పుదురా? చెప్పరు. కాన నున్నతగిరియందున్న రావణపురి లంక యనుటలో సారస్య మెట్లుండఁగలదు? అదియటులుండ, 'లంకాఙ్' అను శబరశబ్దమునకు రామదాసుగా రిచ్చిన యుదాహరణములం బట్టిచూడ 'పొడవను నర్థ మున్నట్లు తోచుచున్నది. పొడవైన మిరపకాయను లంకామిర్చ్యెయందురనియు, పొడవైన మనుష్యుని లంకామంద్రాయందురనియు, నింకను పొడవైన కట్టను లంకాతాంగు అందురనియు రామదాసుగారు వ్రాసిరి. కావున శబరభాషయందున లంకాఙ్ శబ్దము పొడవును తెల్పవలెను కాని ఉన్నతమైన ప్రదేశమునం దున్నదను భావముఁ దెలుపునదికాదు. కావునఁ బర్వతాగ్రమునందున్న లంకాపురమునకుఁ బొడవను నర్థముగల 'లంకాఙ్' శబ్దముతో సంబంధము కలుగుటలో సారస్య మింతయును లేదు. 'ఉన్నతమైన' అనియర్థము చెప్పుకొనినను బూర్వోదాహృత లంకాలక్షణములకు సరిగ సరిపోదని యిదివఱకే వ్రాసియున్నాను.

కాబట్టి రాక్షసపురముయొక్క లంకయనునామము శబరభాషలోని లంకాఙ్ శబ్దమునుండి పుట్టినదని చెప్పుట యుక్తియుక్తముగా లేదు. మనపెద్ద లిచ్చిన లక్షణమే సరిగనున్నది.

దేశభాషాపదములతోడనే లంకాశబ్దమునుకలుపునెడలఁ దెలుఁగునందలి లంకయను శబ్దముతోఁ గలుపుట మంచిదని తోఁచుచున్నది. ఆంధ్రభాషయందు లంకయనిన ద్వీపమని యర్థము. రామాయణమునందు లంక సముద్రమధ్యమందున్న ద్వీపమైనట్లు వర్ణింపఁబడియున్న సంగతి లోకవిదితము. 'లంకాద్వీపస్య గోప్తారం కర్తారం భీమకర్మణామ్"ఇత్యాదికమును జూచుకొనవలసినది కాబట్టి యొకవిధమునఁ జూచినఁ దెలుఁగుభాషలోని "లంక"తో రావణుని 'లంక' సంబంధించియున్న దనవచ్చును. కాని శబరభాషలోని 'లంకాఙ్' శబ్దముతో సంబంధించియున్న దనరాదు.

## జనస్థానముంగూర్చి

ఇంక జనస్థానశబ్దముంగూర్చి ముచ్చటింపుకొందము. దండకారణ్యము జనులు లేని స్థానము. దానియందుల జనులుండుస్థానము కలదు. కావున దీనికి జనస్థానమని పేరువచ్చినదని రామాయణమే తెలుపుచున్నది. ఇందునకు వ్యతిరేకముగా మనరామదాసుగారు జనస్థానముంగూర్చి యీక్రింది రీతిని క్రొత్త వ్యుత్పత్తిని గల్పించిరి.

"'లంకా'యనుపదమువచ్చినభాషలో'జైతాఙ్' అనగా 'దిగువ' సంస్కృతములో 'జనస్థాఙ్' అని సులభముగా నగును."

జనులు లేనిస్థానమునకు నత్యంత సమీపమున నున్నస్థానము జనులతోఁ గూడియున్నది, కావునను రామాయణము జనస్థానమనగా జనులుగలస్థానమనిచెప్పుచున్నది కావునను, సంస్కృత రామాయణమున నిది యున్నది యగుటచే సంస్కృతపదమనుకొనుటయేయుచితము కావునను, సంస్కృతపదములనుండి సరసముగను సులభముగను నామ మున్నదియున్నట్లు గ్రహించుట కవకాశము కలదు కావునను, ఈశబ్ద మున్నది యున్నట్లుగా గ్రహింపక శబరభాషయందలి 'జైతాఙ్' పదమునుండి యిది పుట్టినదనుటలో సారస్యమింతయును గాన్పించుట లేదు. "జైతాఙ్" అనగా దిగువయని యర్థమఁట. తిర

పతికి దిగువ తిరుపతి యనునట్లుగా లంక కిది దిగువగా నుండుటచే దీనికి జైతాన్ (సంస్కృతమున జనస్థానము) అని పేరు వచ్చినదఁట. ఇది యసంగతము. లంకకు దీనిని దిగువ యనుటకు లంక యెచ్చట నున్నదో నిరూపింప వలెను. అది యెచటనున్నదో వీరు చెప్పలేదు. ఇప్పుడు మనవారు చెప్పునట్లుగా సింహళద్వీపమే యగుచో జనస్థానము దాని దిగువగా జెప్పుట కవకాశ మంతగాఁ గాన్పింపదు. లంకకును, జనస్థానమునకును నడుమ ననేకములగు పల్లపుదేశములు కలవు. వాని నన్నిటిని దాటి లంకకు మిక్కిలి దూరమున నున్న దండకారణ్యప్రాంతమును లంకను దిగువయనుట సందర్భశూన్యము. రామాయణమున రావణుఁడు తన బలమును నిల్పుటకుఁ బూర్వము నందుఁగూడ దీనికి జనస్థానము అని పేరున్నట్లు తేలుచున్నది. కాఁబట్టి జనస్థానపదము శబరభాషలోని "జైతాన్" పదమునుండి పుట్టినదని యెంచుటకంటె రామాయణము చెప్పినట్లుగా సంస్కృతమునుండి పుట్టినదనుటయే యుచితము.

## శృంగబేర పదముం గూర్చి

శృంగబేరపురముంగూర్చి మన రామదాసుగారీ క్రిందిరీతిని వ్రాసిరి.

"ఇందు 'శృంగి', 'బేరము' అని రెండుపదము లున్నవి. 'శృంగి', 'శింగి' అనుమాటలు కొండయొద్దున యున్న గ్రామముల కుండును. 'శింగిపురం' 'రామ్‌శింగి' మొదలైనవి కొండతలములం దున్నవి. ఆలాగున 'శృంగిబేరము'గూడ కొండయొద్దయుండవలెను. 'బేర' అనగా 'కొండ' సవరభాషలో. కాన 'శృంగి' అనునది 'బేర' అనుపదమునకు సంస్కృతము. ఆర్యులకూ అనార్యులకూ గూడ దీని నైసర్గికము దెలియుటకై 'శృంగిబేర' మని పిలువబడియె."

ఇది వింతవ్రాఁత. శృంగిబేరము కొండయొద్ద నున్నట్లుగా రామాయణాదులు చెప్పియుండలేదు. అది పల్లపుభూమియందున్నదిగాని పర్వతప్రాంతము లందు లేదు. గంగయొద్దున నున్నదిగాని కొండయొద్దున లేదు. కావున రామదాసుగారు చెప్పిన వ్యుత్పత్తి సరిపడదు. అది శృంగబేరముకాని శృంగిబేరముకాదు. శృంగబేరమనునది సంస్కృత పదము. అల్లమును శృంగబేరమందురు. వరుసగలేని శాఖలుగలిగి శృంగబేరము వలెనుండు పురమగుటచే దీనికి శృంగబేరమను పేరు వచ్చినదని పెద్దలు వ్రాసియున్నారు.

"శృంగ ఇవబేరః. అనయవః యస్యసః=శృంగబేరః" అని వాచస్పత్యము చెప్పుచున్నది. ఈవిధముగా బరిశీలించి చూడగా రామాయణమునం దీఁబడిన దక్షిణదేశస్థ స్థలనామములు శబరభాషతో సంబంధించినవనుట యనుచితముగ నున్నది. బలాత్కారముసఁ దెచ్చిపెట్టిన వ్యుత్పత్తులుగా గాన్పించుచున్నవి. కావున రామదాసుగారు వ్రాసినది సందర్భరహితముగా నున్నదని చెప్పుటయే యుచితము.

## పురుషాది నామములు

ఇంక రామాయణమునందుఁ జెప్పఁబడిన దక్షిణదేశస్థ పురుషాదినామములంగూర్చి రామదాసుగారు వ్రాసినవ్రాఁతను చర్చించి చూచుకొందము.

## త్రిశిరనామముంగూర్చి

రామాయణమునందు త్రిశిరుఁడను రాక్షసుఁ డున్నట్లును, వానికి మూఁడుతల లున్నట్లును, మూఁడు తలలను రాముఁడుఖండించివైచినట్లును దెలుపఁబడియున్నది. దీనింబట్టి మూఁడుతలలు కలవాఁడు కావున నారాక్షసునకు త్రిశిరుఁడను పేరువచ్చినదని— తేలుచున్నది. ఇట్లుండ నారాక్షసునకు మూఁడుతలలు లేవనియు, త్రిశిరుఁడను పదము సంస్కృతపదము కాదనియు, శబరభాషనుండి పుట్టినదనియు రామదాసుగారు వ్రాసిరి.

"'త్రిశిరుడ'ను రాక్షసుఁడు రెండుచోట్ల చెప్పఁబడియున్నాడు. మొదటివాడు ఖరుని సైన్యమునకు మొనగాడు. వీడు రామునిపైకి వెళ్లగా, సారథినిన్ని, గుఱ్ఱములనున్ను గొట్టివేసెనట. అందుపైన వాడు ఖడ్గము తీసుకొని ఎగిరివెళ్లుచుండగా రాముడు కొట్టినబాణము బొమ్మలో తగిలి నేలబడిపోయినాడట.

'తతో హతరథా త్తస్మా దుత్పతంతం నిశాచరమ్,
బిభేద రామ స్తం బాణైః హృదయే సోఽభవ జ్జడః.,
—అరణ్య. ౨౩. ౧౬.

అప్పుడు రాముడు మూడుబాణములచే వాని మూడు తలలను నరకినాడట.

'సాయకై శ్చాప్రమేయాత్మా సామర్షస్తస్య రక్షసః,
శిరాంస్యపాతయద్రామో వేగవద్భి స్త్రిభి శ్శరైః.'

తెలివితప్పి పడిపోయిన వానితలలు నఱుకుట యోధునికి ఖ్యాతియా? ఇట్లు చెప్పుట రాముని పరాక్రమమునకు లోపముగాదా? ఇట్లు వాల్మీకి వ్రాయునా? ఈసర్గలో 18, 19 సంఖ్యగల శ్లోకములు వదలివేసినను, కథాసందర్భము చెడదు. కాన 'త్రిశిర' అనునామమునకు 'మూడు తలలు' అనుఅర్థము స్థాపించుటకు ఎవరో, ఈశ్లోకములను మధ్య దూర్చినట్లు కనబడుచున్నది."

మూఁడుబాణములచేఁ ద్రిశిరుని మూఁడుతలలను శ్రీరాముఁడు ఖండించినట్లు శ్రీమద్రామాయణమే చెప్పుచున్నదని మనరామదాసుగారు రుదహరించిన పైశ్లోకములవలన స్పష్టమగుచున్నది. ఇది యిట్లుండఁ, ద్రిశిరునికి మూఁడుతలలు లేవను వింతవాదమును జేయ యత్నించు రామదాసుగారు తమకాతంకమును గలిగించు పై శ్లోకములు వాల్మీకికృతములు కావనియు, నెవరో యితరుల వానిని దెచ్చిపెట్టి రనియు వ్రాయఁదొడంగిరి! ప్రక్షిప్తమని మనరామదాసుగారు సాహసించిచెప్పు పై శ్లోకద్వయము ప్రక్షిప్త మని మనపూర్వు లెవ్వరును చెప్పియుండలేదు. విశేషించి పూర్వవ్యాఖ్యాత లెల్లరును ప్రక్షిప్తము లనకపోవుటయేకాక వానికి వ్యాఖ్యానములు వ్రాసి గౌరవించియుండిరి. పూర్వకాలమునందు బయలువెడలిన భాషాంతరీకర్తలును, వానికి సరియగు పద్యములను దమతమభాషలలోఁ గావించిరి. కావునఁ బైశ్లోకములు వాల్మీకి చేయలేదనియు, నితరుల వారు చేసి యందుఁ జేర్చిరనియుఁ జెప్పుట తగదు.

పై శ్లోకద్వయము వాల్మీకికృతము కాదనుటకై రామదాసుగారు రెండు కారణాభాసములం చెప్పిరి. వాని బలాబలముల విచారించుకొందము. పై ౧౮, ౧౯ సంఖ్యగల శ్లోకములను దీసివేసినను సందర్భము చెడదని రామదాసుగారు వ్రాసిరి. కాని యిది సరికాదు. ఆ శ్లోకములం దీసివేసినఁ గథాసందర్భమంతయును జెడును. ఎట్లన, "అష్టభి స్సాయకై స్సూతమ్" అను శ్లోకముచే శ్రీరాముఁడు తనమీఁదికివచ్చిన ఖరాసురుని సారథిని, ధ్వజమును గొట్టివేసెనని తెలుచున్నది. "తతో హతరథాత్తస్మాత్" అనుశ్లోకముచే విరథుఁడైన త్రిశిరుఁడు మీఁదికి దూకుచుండ వాఁడు జడత్వమును బొందులాగున స్తంభీభూతుఁ డగునట్లుగ (ముందునకురాక నిలిచిపోవులాగున) తీవ్రమైనబాణములచే హృదయమును భేదించెనని రూఢిపడు చున్నది. "సాయకైశ్చాప్రమేయాత్మా" అనుశ్లోకముచే ముందుకు రాలేక జడీభూతుఁడైయుండు నారాక్షసుని మూఁడుశిరస్సులను మూఁడుబాణములచేఁ ద్రుంచెనని తెలుచున్నది.

'సభూమౌ' అనుశ్లోకముచే రాముఁ డారాక్షసుని నేలంగూలునట్లు చేసెనని బోధపడుచున్నది. "హతశేషాస్తతో భగ్నాః"అనుశ్లోకముచే ఖరుని సేనలో మిగిలిపోయిన వారలెల్లరును పారిపోయిరని తెలుచున్నది. ఇట్లుండ, రామదాసుగారు చెప్పినరీతిగా 'సాయకైశ్చాప్రమేయాత్మా' అనుశ్లోకమును, 'సభూమౌ రుధిరోద్గారీ'అనుశ్లోకమునుమూలమునుండితీసివేసినచోఁదనమీఁదకువచ్చిన త్రిశిరుని రాముఁడు చంపెనని తేలదు. కావున కథాసందర్భము చెడిన దనక తప్పదు. త్రిశిరుఁడు ఖరుని సేనలో నొకఁడని రామదాసుగారే అంగీకరించిరి. ఇట్టివాఁడిప్పుడు చావకుండిన మరల లంకలో జరిగిన రావణయుద్ధమునకు రావలసినది. అట్లు వచ్చినట్లు గ్రంథము చెప్పలేదు. కావున జనస్థానమున జరిగిన యుద్ధములోనే యాతఁడు చచ్చెననుసంగతి సత్యము. కాన త్రిశిరునిచావునుగూర్చిన శ్లోకములు అరణ్యకాండమునందు ముఖ్యముగా నుండఁదగినవే.

2. "తెలివితప్పి పడిపోయియున్నవాని తలలు నఱుకుట యోధునికి ఖ్యాతియా?" యోధునకు ఖ్యాతి కాదు కావున జడీభూతుఁడగు త్రిశిరుని రాముఁడు తలలు నఱికి చంపెననుశ్లోక మంగీకరింపరాదని రామదాసుగారు రీతి నొకయుక్తినివ్రాసిరి. త్రిశిరుఁడు మూర్ఛితుఁడై నేలపైఁబడియుండినయెడల వీరుఁడగు రాముఁడాతని తలల ఛేదింపఁదగదు. కాని యిచట నట్టిసందర్భము లేదు. సారథిని గుఱ్ఱములను నఱికి విరథునిఁగావించి మీఁదకు రాఁబోవుచున్న రాక్షసుని హృదయములో వాడికోలలనాటి యేదిచేయుటకును తెలియకొని స్థితిలోనికిఁ

దెచ్చి వెంటనే యాతని శిరస్సుల శ్రీరాముడు ఖండించి వైచెను. తలలు నఱికిన తరువాత నాతడు నేలంగూలెను గాని యొమ్ములో బాణముల నాటినపుడు నేలం గూల లేదు. కావున యొమ్మున నాట వాడిబాణములచేఁ గొట్టి శత్రువును ఏచేష్టలను జేయలేని స్థితిలోనికిఁ దెచ్చి వెంటనే చంపివేయుట యుద్ధధర్మవిరుద్ధము గ పనిగాదు "సోఽభవత్ జడః" అని మూలము దెలుపుచున్నది ఆతఁడు నేలపైఁ బడినటులు దెలుపుటలేదు. 'సోఽభవ జ్జడః' అనగా వాడి కోల తగలఁగనే యాక్షణమందు నిశ్చేష్టుఁడైనాఁడని భావముగాని మూర్ఛితుఁడై నేలం గూలెనని భావము గాదు. 'జడః=నిశ్చేష్టః' అని వ్యాఖ్యాతలు గోవింద రాజులవారును తీర్థులవారునుగూడ వ్రాసిరి. కాఁబట్టి మన రామదాసుగారు మూలశ్లోకమును సరిగఁ దెలిసి కొనఁజాలక ప్రమాదములకు లోనైరని తెలుప వలసివచ్చినందులకుఁ జింతగనున్నది. నిరాయుధుఁడైయుండు శత్రువును సాయుధుఁడైయుండువీరుఁడు కొట్టి చంపఁగూడదుకదా! కావున యుద్ధమధ్యమందు పరవీరునిచేతులు ఖండించివైచి పిమ్మట శిరస్సుఖండింప రాదా? చంపవచ్చునుకాన యుద్ధమధ్యమందు బాణఘాతముచే జడీభూతుఁడైయున్న శత్రువును శిరస్సునఱికి చంపుట వీరధర్మవిరుద్ధకార్యముగాదు. పాపమునిమిత్తము మూర్ఛితుఁడైపడియున్న త్రిశిరుని రాముఁడు చంపెనని పైశ్లోకము చెప్పుచున్నదనినను నంతమాత్రముచే దానిని వాల్మీకికృతము కాదనరాదు. వాలిసుగ్రీవు లిద్దఱును ద్వంద్వయుద్ధము చేయుచుండఁగా శ్రీరాముఁడు చెట్టు చాటుననుండి బాణములను ప్రయోగించి వాలిని జంపెను. ఇది శూరకార్యమా? కాదుగదా! కాన రామదాసుగారి వాదముంబట్టి రామాయణమందలి వాలివధ ఘట్టము వాల్మీకికృతము కాదనవలసివచ్చుచున్నది. కాని వారట్లనలేదు. అట్టివానికి సహించినవారు దీనికిని సహింపవలెనుగాని యిదిమాత్రమే ప్రక్షిప్తమనరాదు.

కాఁబట్టి, యేవిధమునఁ జూచినను పైశ్లోకద్వయము వాల్మీకికృతమై రామాయణమున నున్నదనియు, ఖరుని సేనానియగు త్రిశిరుఁడు మూఁడుతలలు గలవాఁడని తేలుచున్న దనియు మనము తప్పక గ్రహింపవలసియున్నది. ఇంకను నారాక్షసుఁడు మూఁడుతలలు కలవాఁడని చెప్పుశ్లోకములు రామాయణములో మఱికొన్ని కలవు.

"త్రిశిరాశ్చరథేనైవ వాజియుక్తేన భాస్వతా,
అభ్యద్రవ ద్రణే రామం త్రిశృంగ ఇవ పర్వతః."

ఈశ్లోకమువలనఁగూడ త్రిశిరుఁడు మూఁడుతలలు గలవాఁడని తేలుచున్నది. ఇంకను "ఖరస్త్రిశిరసా" అనియు "త్రిశిరాశ్చ" అనియు, "ఆగచ్ఛంతం త్రిశిరసం" అనియు సకారాంతమగు శిరశ్శబ్దమే పలుతావుల వాడఁబడియున్నందున నాత్రిశిరశ్శబ్దములోని శిరశ్శబ్దము శిరస్సనునర్థమిచ్చు పదమేయని రూఢిపడుచున్నది.

కావున త్రిశిరుఁడనుశబ్దము మూఁడుతలలుగలవాఁడనుభావముగలదని రామాయణమువలనఁ దేలుచున్నదని మనము కనుఁగొనియున్నాము. ఇఁక మూలమును ద్రోసివేసి రామదాసుగారు శబరభాషనుండి కల్పించు నూతనార్థమునుగూర్చి చర్చించుకొందము. వారిట్లు వ్రాసిరి:—

"గదబభాషలో 'తీర్' అంటే పొడవని, 'సిరాఇ' అనగా 'దయ్యము'—'తీర్' + 'సిరాఇ' అనగా పొడగైనదయ్యము; క్రూరునకు తగిన నామమేకదా యిది. 'తీర్ + సిరాఇ' యే 'త్రిశిర' అయియుండును."

ఇది వింతవ్రాఁత. త్రిశిరుఁడుశబరజాతివాఁడఁట. నామమును శబరభాషలోనిదియఁట. అనగా శబరులు తమవాఁడగు నితనిని 'తీర్ + సిరాఇ' అనగా పెద్ద దయ్యము అను పేరుతోఁ బిల్చిరఁట. ఇంతవింత యుండఁ గలదా? ఆతనియాప్తు లాతనినట్లు పిలుతురా? "క్రూరునకు తగిననామమే కదాయిది" అని రామదాసుగారు వ్రాసిరి. క్రూరుఁడా? ఎవరికిఁ గ్రూరుఁడు? ఆర్యులని రామదాసుగారు పిలుచు రామాదులవిషయమునఁ గ్రూరుఁడుగాని రావణాదిశబరులవిషయమునఁ గ్రూరుఁడు కాఁడు. ఆతఁడు వారియెడల సౌమ్యుఁడే. కాబట్టి పెద్దదయ్యమను నర్థమిచ్చునామము (తీర్ + సిరాఇ) శబరు లిచ్చి రనఁదగదు. అది శబరశత్రువులగు నార్యులిచ్చి రనఁదగదు. అది శబరశత్రువులగు నార్యులిచ్చిన పేరై యుండవలెనుగాని యనార్యులగు శబరులిచ్చినదై యుండఁజాలదు. ఆర్యులిచ్చిన దార్యభాషయందుండుట సహ

జను. కాబట్టి త్రిశిరశ్శబ్దమునకును శబరభాషాపదమగు 'తీర్ + సిరా ఇ'కిని ముడిపెట్టఁ జూచుట మహాసాహసము కాకతప్పదు. కాన 'త్రిశిరః' అనగా మూఁడు తలలు కలవాఁడు అనిచెప్పు రామాయణార్థమే సరసమును సత్యమైనదిగను గాన్పించుచున్నది.

### కబంధశబ్దముంగూర్చి

శ్రీమద్రామాయణమున కబంధుఁడను రాక్షసుని గూర్చి ముచ్చటకలదు. పొట్టలోనికి దూర్చివేయఁబడిన కాళ్లును, శిరస్సును గలవాఁడుకాన వీఁడు కబంధుఁడను పేరుగలవాఁడైనాఁడని రామాయణమే చెప్పుచున్నది. మెడలేక దేహములోనే శిరస్సుండుటచేతను కాళ్లు లేమింజేసియు వానికిఁ గబంధ మను నామము వచ్చెనను నది శాస్త్రానుగుణముగనే యున్నది. అయినను రామదాసుగారు దాని నంగీకరింపక క్రొత్త విపరీతార్థము నీక్రిందిరీతిగఁ గల్పించిరి :

"క్రౌంచారణ్యముదాఁటి వెళ్లఁగా'కబంధుఁడ'ను రాక్షసుఁడు గనిపించెను వీనికి సహజమైన గుణములేవియుఁ గనుపడవు. కాని ఈపేరు 'బండ' అనుపదముతో సంబంధించినట్లు కనఁబడుచున్నది. తెనుఁగులో 'బండ' అంటె పెద్దరాయి. తెలివిలేని మనుజునకు 'బండముండాకొడు'కని అనుట వాడుకై యున్నది. సవరభాషలోఁగూడ ఈపదము ఉన్నట్టు ప్రస్తుతము దొరకు వాక్యావళీల (Vocabularies)లో నగుపడకపోయినప్పటికి కొన్ని స్థలనామములలో ఈమాట కనిపించుటవల్ల సవరలుగూడ నీపదమును ఈయర్థముతో వాడినట్లు కనిపించుచున్నది. కావున దారిలో నడ్డముగా వీఁడుండుటవల్లనూ, ఆత్రోవనుబోవు వారికిఁ గష్టముగలుగఁజేయువాఁడగుటవల్లను, తుదను గోయిత్రవ్వి తిరుగ ద్రోయఁబడినవాఁడగుటచేతను వీనినామము 'బండ' యనుదానితో సంబంధించినట్లు కనఁబడుచున్నది."

ఈవాద మన్నిటిని మించిన వింతను బట్టించుచున్నది. రామాయణమునందలి 'కబంధ' శబ్దముతో సంబంధించుపదము వీరికి శబరభాషలలో లభింపలేదు. ఆమాటను దామంగీకరించియుగూడ మరల సాహసించి తెలుఁగునందు గల 'బండ' అను శబ్దమునకును 'కబంధ'శబ్దమునకును ముడిపెట్టి పిమ్మట శబరభాషలోఁగూడ, తెనుఁగునందలి 'బండ' శబ్దముంబోలు శబ్దముండి యుండునని యూహింతుమనియు, నీ నిరాధారపు టూహలఁబట్టి 'కబంధ' శబ్దము శబరభాషలోనిదే యని చెప్పుదుమనియు వీరు లిఖించిరి. ఇది దారుణసాహసమని బుద్ధిమంతు లెల్లరును నంగీకరింపక తీరదుకదా! తెనుఁగునందుఁగల 'బండ'శబ్ద మెక్కడ? సంస్కృతరామాయణమందలి 'కబంధ'శబ్ద మెక్కడ? తెనుఁగు 'బండ' నుండి 'కబంధ'శబ్దము పుట్టినదను టెక్కడ? ఈతఁడు త్రోవ కడ్డుగ నుండుటచేతను, చచ్చినపిమ్మట గోయి త్రవ్వి తిరుగఁ ద్రోయఁబడినవాఁ డగుటచేతను, నీతనికి 'కబంధ' (బండ)యను పేరు వచ్చినదని యొకయుపపత్తిని గల్పింప రామదాసుగారు ప్రయత్నించిరి. బండవలె నుండిన "బండః" అనియో "బంధః" అనియో నామము వచ్చినవచ్చుఁగాని "కబంధః" అని యెట్లువచ్చును? అది యటుండ, చచ్చినతరువాత బండను గోతిలోనికిఁద్రోసినట్లుగా నీతనిఁద్రోయుటచే నీతని కీపేరువచ్చిన దను నెడల నియ్యది మృతినొందినపిదపఁగలిగిన పేరవవలెను. బ్రతికియుండఁగనే మొదటినుండియు నీతనికి కబంధనామము వాడుకలో నుండుటచే రామదాసుగారి కల్పనము అపూర్వసత్యముతోఁ గూడినదగును. త్రోవ కడ్డుగ నున్నవాఁడు కావున నీపేరు వచ్చిన దనుటలో మఱియొకనైరస్యముగూడఁ గాన్పించుచున్నది. రాక్షసు లెల్లరును నట్టివారుగనే యుండిరిగాని యొక్కకబంధుఁడు మాత్రమే యట్లుండినవాఁడు కాఁడు కాఁబట్టి యది యితనికి మాత్రమే సహజలక్షణము కాదు. ఏదైన వైలక్షణ్య మున్నప్పుడు గదా యది పేరనుట! రాక్షసు లందఱవలెఁ గాని మానవు లందఱవలెఁ గాని నికాక మెడలేకుండుటయుఁ గాళ్లు లేకుండుటయుఁ గలుగుటచే నీతనికి కబంధుఁడను ప్రత్యేకనామము కలదు. ఏవిధమునఁ జూచినను 'బండ' వాదము సారస్య మింతయును గాన్పించుటలేదు. ఎట్టి కక్కుఱితికైనలోఁబడి రామాయణస్థ రాక్షసాదినామములకు శబరభాషతో సంబంధమును గలుపరామదాసుగారు గాలిమేడలఁ గట్టుచున్నారని దీనివలన బాగుగా రూఢియగుచున్నది.

జటాయుశబ్దమును గూర్చి

ఈశబ్దముంగూర్చి రామదాసుగారిట్లు వ్రాసిరి:

"'సవరభాషలో' 'యువ'అంటే తండ్రి;'జటం' అంటే జట్టు, 'జటాలే' అంటే 'జట్టుగా' యనియర్థము సవరులభాషలో 'ఆ' షష్ఠివిభక్తి ప్రత్యయము. ఇది చేర్చినను 'యువా' యనుపదము మారదు. కాన 'జటా + యువా' అనగా తండ్రికి జట్టు (వాడు); ఇది జటాయు అయినది."

ఇచ్చోట వీరిచ్చినది వింత వ్యుత్పత్తి. వీరు చెప్పినట్లుగా శబరభాషలోని 'జటా + యువా'యనుపదములనుండియే జటాయుశబ్దము పుట్టినయెడల నయ్యదియర్థశూన్యమగు పదమగును. కాని జటాయువుయొక్క లక్షణముం దెల్పుపదము కానేరదు. పరికించిచూడ నిది సమస్తపదమే కాదు. రెండుపదములు విడివిడిగా నుండుటచే నిదియైనది. జట్టుతండ్రియొక్క అని దీనియర్థమట. 'జట్టుతండ్రియొక్క' అనుదానింబట్టి తండ్రి యొక్క జట్టని వీ రర్థము తీయుదురఁట. తండ్రియొక్క జట్టని చెప్పఁదలఁచినవాఁడు 'యువాజటా'యనునుగాని 'జటాయువా' యని యెట్లువ్రాయును? ఒకనామముం దెల్పు పదసంఘాతములందు విభక్తి ప్రత్యయాదు లెట్లుండును? ఇదియెంతయు నసంగతముగా గాన్పించుచున్నది. అదియటులుండ, జటాయువను శబ్దము జటా'యువా'యను శబరభాషాపదములనుండి పుట్టినదేయన్నను దగనయర్థము గాన్పించుటలేదు. తండ్రియొక్క జట్టని మన రామదాసుగా రర్థముచెప్పిరి. ఇదియొకపక్షి పేరఁట. ఒకపక్షి జట్టెట్లుగాఁగలదు. బహుసంఖ్యాకులుగూడినగదా జట్టగును. కాననొకపక్షిని తండ్రియొక్కజట్టని పిలుచువారు లోకములో నుండఁబోరు. అయినను రామదాసుగారి పక్షమవలంబించి ఒకపక్షికే తండ్రియొక్కజట్టని పేరు వచ్చినదందము. అయిన నేమిలాభము? ఇటఁ దండ్రి యెవఁడు? ఎవనితండ్రియుద్దేశింపఁ బడియెనన సమాధానము వచ్చుటలేదు. కానియీశబ్దవ్యుత్పత్తిని దెల్పుటలో రామదాసుగారొక నూతనమార్గము నవలంబించిరి. ఈ పేరునకు శబరభాషలో నేయర్థముగలదో నాయర్థమును వాల్మీకి తీసుకొని రామాయణమున దానిని సంస్కృతభాషలో నుపయోగించెనఁట! వాల్మీకి రామునిపితృసఖునిగాఁ (పితృసఖా) జెప్పెనఁట. కాని తుద కదియును నర్థశూన్యమేయఁట. ఈవిషయమై రామదాసుగారు వ్రాసిన వింత వాక్యముల నీక్రింద నిచ్చుచున్నాను.

"ఈ జనస్థాన సామీప్యములోనే 'జటాయు' వనే యొక వ్యక్తియుండెను. ఇతను 'పితృసఖాఽహం' అని రామునితోఁ జెప్పెను."

'ఉవాచ వత్స! మాం విద్ధి వయస్యం పితు రాత్మనః'

—అర. ౧౪. ౩.

గాని రాముని తండ్రికి తానెట్లు స్నేహితుఁడాయెనో యెచ్చటను జెప్పఁబడలేదు. సీతాన్వేషణముకొఱకై వెళ్లిన వానరులు సీతను గానలేక సముద్రతీరమునఁ గూర్చుండి దుఃఖించుచుండఁగా, సంపాతివిని "నాయనా! జటాయువు దశరథులకెట్లు స్నేహితుఁడాయెను?" అని ప్రశ్నించెను.

తస్యేవచ మమ భ్రాతు స్సఖా దశరథః కథమ్.

—అర. ౫౬. ౨౪.

వానరులు దానికి జవాబు చెప్పక తిరిగి అలాగుననే చెప్పుదురు.

"రామస్యతు పితుర్మిత్రం
జటాయు ర్నామ గృధ్రరాట్."

—అర. ౫౧. ౯.

దశరథునికి జటాయువునకు స్నేహము జరిగిన ట్లెచ్చటను చెప్పలేదు. రామునికే ఇతను విశేషస్నేహితుడు. సీతను రావణునినుండి తప్పించుటకుఁ దన ప్రాణమునుగూడ నిచ్చివేసెను. కాన 'పితృసఖా' అనుదానికి ఏమి సందర్భము గానరాదు."

దీనింబట్టి జటాయువు పితృసఖుఁడనుటలోనే సందర్భమును లేదని రామదాసుగారి వాక్యములవలననే తేలుచున్నది. ఇట్లుండ 'జటాయువా' (తండ్రియొక్కజట్టు) అనునది సార్థకనామమెట్లు కాగలదు? ఇంకను వాల్మీకి తెలివి తక్కువవ్రాఁత వ్రాసెననిగూడ మన రామదాసుగారి వాక్యలవలనఁ దేలుచున్నది. పోనిండు! జటాయువు తండ్రి జట్టెట్లాయెనో వీరును దెలుపఁగలిగియుండలేదు. కాన వీరు చెప్పునర్థము సందర్భశూన్యమును నగ్రాహ్యమును నై యున్నది.

## సరమాశబ్దమునుగూర్చి

విభీషణుని భార్యపేరు సరమ. ఈపదమునుగూర్చి రామదాసుగారీక్రింది విచిత్రవ్రాఁతను వ్రాసిరి:

"ఈమె 'వల్గు + భాషిణీ' అనియు 'మృదుభాషిణీ' అనియు చెప్పబడెను. మృదుమనోహరముగా మాట్లాడునదే 'నోరు'; అట్టిపదముల నుచ్చరించునదే 'నోరు' గాని ఇతరములైనవి నోళ్లుగావని పండితులు చెప్పుదురు. శబరజాతు లందరుగూడ, ఒక్క గదబజాతి తప్ప, నోరని చెప్పుటకు సంస్కృతపదములైన 'ముఖం' గాని 'తుండం'గాని వాడుదురు. గదబలుమాత్రము 'సారోస్త్ర'అని అందురు. ఈపదము పూర్వము అందరూ వాడేవారుగాని ఆర్యసంబంధముచే నామాట మరచిపోయిరి. వీరొక్కరే ఇంకను ఆపదమును వాడుచున్నారు. ఈ 'సారోస్త్ర' సంస్కృతములో, సరమా, అయినట్టు తోఁచుచున్నది."

ఇది యబ్బురవ్రాఁత. విభీషణుని భార్యయగు సరమ 'మృదుభాషిణీ' యని రామాయణము చెప్పుచున్నదఁట. ఆహేతువుచే నామె నోరనునర్థముకల నామము గలదని మనరామదాసుగారు భావింతురఁట! ఈరీతి అర్థమును దీయుచో లోకములో మృదుభాషిణులని వర్ణింపఁబడినవారెల్లరును నోరనునర్థము కలనామము గలవారనియే యెంచవలయునుగదా! అట్లెంచుట యనుచితమని గ్రహింపనివారెవరుందురు? అట్లే సరమ మృదుభాషిణీయని వర్ణింపఁబడినంతన యామె నోరనునర్థమిచ్చునామము గలదనుకొనుటయు ననుచితము. మృదుభాషిణీయన మృదువైనపలుకులు గలస్త్రీయని భావము. సీతచుట్టునుగల రాక్షసస్త్రీలెల్లరును పరుషభాషణంబులచే నామెను వేధించుచుండగా నీసరమ మనోహరములగు వాక్యములు చెప్పి సీత నోదార్చెను. గావున నీమెయొక్క మృదుభాషిణీత్వమును గవి యిచట వర్ణించినాఁడు. ఈసందర్భమునంతను ద్రోసిరాజని మృదుమనోహరముగఁ బలుకునదే నోరు అని పండితులు చెప్పుదురు కావునను నీమెమృదుభాషిణి కావునను నీమె నోరనునర్థమిచ్చుపేరు కలదనుట యుచితమా? మృదుభాషణము చేయునదిమాత్రమే నోరగుచో పరుషభాషణము చేయునది నోరుకాదా? పరుషభాషిణియనిన భాషణముచేయునది నోరుకావున నాపరుషభాషిణియు నోరనునామము కలదనియే చెప్పవచ్చును గదా! లోకములో వీఁడు నోరుచేయుననినను, నోరుకలవాఁడనినను మృదుమధురభాషణము చేయువాఁడను నర్థముకాదు. విశేషించి పరుషభాషణము కలవాఁడనియే యర్థము స్ఫురించును. నోరుపెట్టుకొని బ్రతుకుచున్నాఁడందురు. నోరున్నదిఁకేమియు లేదందురు. ఇవన్నియు నధికప్రసంగమును చేయుటను దెలుపునుగాని మృదుమధురభాషణము చేయుటను దెలుపవు. కావున నోరేపైకివచ్చుపేరే సరమకుండుచో ఆమె యధికప్రసంగము చేయునది యనుభావము తేలునుగాని మృదుభాషిణి యనుభావము తేలదు. 'సారోస్త్ర' యను శబరభాషాపదమునకు నోరను నర్థముమాత్రమే కలదు గాని మృదుభాషణము చేయునోరనికాని,మంచినోరనికాని యర్థము లేదు. కావున సరమమృదుభాషిణి యని వర్ణింపఁబడియున్నంతన యామె నోరను నర్థమిచ్చు పేరు గలదనుట యసంగతము.

## సాలకటంకటశబ్దముఁగూర్చి

సాలకటంకటాశబ్దము రామదాసుగారు సంస్కృతపదము కాదనిరి. కారణము తెలియరాదు. ఇందు సంస్కృతములేని వర్ణోచ్చారణ మెద్దియును లేదు. సంస్కృతభాషచే వ్యుత్పత్తిని దెలుపుటకు వలను కాకయునుండలేదు. ఐనను దమవాదమునకు సరిపోవుటకై యిది సంస్కృతభాషలోనిపదము కాదనిరి. వీరు శబరభాషలోనిదే యని తెలుపుటకు వ్రాసినవ్రాఁత యంతయు బాలునకైన నిస్సారముగాఁగాన్పించు నసంగతవ్రాఁతగా నున్నది. ఇందునుగూర్చి యిచట ప్రత్యేక విమర్శనము వ్రాయ నవసరము లేదు. (సశేషము)






సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

త్రైలోకైక కవిత యెవ్వని [విశిక
పలుకులు వానికె రుచించుఁ, బరులవి చ
ములుకులుగఁ దోఁచు నమృతపు
గుళికలుగానున్న; నెట్టిఘోరమొ కనుఁడీ!

గీ. తనదుపలుకులు క్రొత్తకుందనపుఁ దునుక,
లితరులవి గాజుముక్కలు! ఎల్లతనదు
పద్యములు ద్రాక్షగుత్తులు, పరులవెల్ల
ముసిఁడిపండులుగాఁ దలపోయుచుండు.

గీ. తనదుభావంబు నెఱుఁగలే రనుచు వగచుఁ
దనదు చదువని వప్రయోజనము లనును.
తనదు శూన్యతఁ బరిపూర్ణతనుగ నెంచుఁ
దనదునజ్ఞత రసికతయనుచుఁ దలఁచు.

క. తనదగు కవన రసాయన
మునకై దేశంబు దప్పిఁ బొందిసరీతిఁ
బనిపాటులు లేనట్టులు
ననునిమిషముగిలుకుచుండు నయ్యైకతల్.

గీ. తానొకండె భాషాలతోద్యానమందుఁ
దోఁటమాలిగభావించు; దోహదముల
నూతనములైన ఫలపుష్పజాతిగణము
బెద్దసృజియింతు నని విఱ్ఱవీఁగుచుండు.

గీ. మెఱుఁగుఁబూఁతలుపెట్టి చూపఱకుఁ గనక
మనుచు నిత్తడిఁజూపి వంచనముఁ జేయు
బుధులు నిలఁబెట్టి యడుగఁగా బూకరించి
మీకుఁ దెలియద యని మిఱ్ఱిమిఱ్ఱి చూచు.

గీ. హృదయమున నచ్చుగ్రుద్దిన ట్లెదుట నిలిచి
తాండవించుచున్నట్లు చిత్రఫలకంబు
భావమును బ్రదర్శింపఁగా భాష లేక
యదుకు వెట్టుచునుండు నాయూయుగతులు.

గీ. తలయుఁ దోఁకయులేని మిథ్యామనోజ్ఞ
మయినభావపరంపర యవకతవక
యర్థములు గూర్చి కబ్బంబు లల్లుచుండు
నెందు, కీతంపువ్రాసెరా యోడ్వ ననఁగ?

గీ. వీనికవిత నాస్వాదింపఁగానె కొంత
మంది జన్మించినారు భూమండలమున
వారికోసంబె యింతంపుఁ బ్రభవమొందె
నాయదృష్టంబు వర్ణింప నలవిగాదు.

గీ. ప్రాఁతపుంతనె ప్రాఁకాడవలయు నననుఁ
గ్రొత్తరీతులఁ జొప్పింపఁ గూడదనక
శక్తి నార్జించి వ్రాయఁగాఁ జాలినట్టి
వారి కర్పింతు నెద నమస్కారశతము.

సంపూర్ణము




కర్త—రవీంద్రుఁడు

అనువాదకుడు:—మొక్కపాటి నరసింహశాస్త్రిగారు (సాహితీసమితి)

(సోమకుడను రాజుయొక్క ఆత్మ మార్గమధ్యముననున్న ఇతరప్రేతలనుదాటి స్వర్గమునకు పోవుచుండును. ఆ ప్రేతలలో, పూర్వము తనకు గురువైన ఋత్వికుడుకూడ కలడు.)

ఒక కంఠధ్వని

రాజా! ఎక్కడకు పోవుచున్నారు?

సోమకుడు

ఆ కంఠధ్వని ఎవరిది! ఇక్కడ వాయువేమో అతిమందముగాఉండి కండ్లకు గంతలు కట్టినట్లున్నది. నాకేమి కనబడడములేదు.

కంఠధ్వని

దిగిరమ్ము, రాజా! స్వర్గోన్ముఖమై పోవుచున్న ఆ రథమును దిగిరమ్ము.

సోమకుడు

నీ వెవరవు?

కంఠధ్వని

నేను ఋత్వికుడను; భూలోకములో నీకు ఆచార్యుడను; మీ ఇంటి పురోహితుడను.

సోమకుడు

ఆచార్యా! భూలోకములోని కన్నీరంతా ఆవిరియై ఈ అగమ్యగోచర ప్రదేశముగ మారినట్లున్నదే. తామిక్కడనుంటిరేల?

ఇతర ప్రేతలు

ఈ నరకము స్వర్గమునకు పోవుమార్గము నంటియున్నది. దూరమున సన్నని దీపకాంతులు కనబడుతూఉంటవి. కాని మాకుమాత్రము ఆ ప్రదేశము దుర్గమము. అహోరాత్రము నీ దారినుండి ఆనందమయమైన స్వర్గమునకు, పుణ్యాత్ములను తీసికొని, రథములుబడబడలాడుతూపోతూఉంటవి. ఆధ్వనితో మాకు కంటికి కునుకన్నమాటలేక నిష్ఫలమైన అసూయతో ఆదారిని పోయేవాళ్లను చూస్తూఉంటాము. మాకు క్రిందివైపున భూలోకములో అడవులు గలగలలాడుతూఉంటవి. సముద్రము సృష్ట్యాదిని గానము చేస్తూఉంటుంది. ఇదంతా శూన్యప్రదేశములో వృథాగా సంచరిస్తూ ఉన్న జ్ఞాపకముయొక్క రోదనవలె మాకు వినబడుతూ ఉంటుంది.

ఋత్వికుఁడు

రాజా! క్రిందకు రమ్ము.

ఇతర ప్రేతలు

మాతో కొంచెము సేపుండండి. అప్పుడుకోసిన పూలనంటిఉండే మంచుబిందువుల లాగ భూలోకము లోపలికన్నీరింకా మిమ్ములను అంటి

ఉన్నది. పొలములయొక్క, అడవులయొక్క సువాసనలను మీతో తెచ్చినారు. బంధుమిత్ర కళత్రాదులను జ్ఞప్తికి తెచ్చినారు. అనశ్వరము లయిన ఋతువులగానము కూడా కొంత తెచ్చినారు.

సోమకుడు

ఆచార్యా! దుర్గంధముతో ఊపిరి ఆడని ఈ నరకములో తామేల ఉండవలసివచ్చినది?

ఋత్విజుడు

నేను నీకుమారుని యజ్ఞపశువుగా అగ్నికర్పించినాను. ఆపాపము నాఆత్మను ఈ అగాధములో పడవైచినది.

ఇతర ప్రేతలు

రాజా! మిమ్ములను బ్రతిమాలుతాము; మీరు ఆకథ చెప్పండి. ఇప్పటికికూడా పాపకార్యము గురించి వింటూఉంటే బ్రతికిఉన్నప్పటి ఆవేశము మా మాంద్యమును పారదోలుతుంది.

సోమకుడు

నేను విదేహదేశపురాజు సోమకుడనువాడను; అనేక తీర్థయాత్రలు సేవించినాను; ఎన్నో యాగములను చేసినాను. ఇలా చాలాకాలము గడచినపిమ్మట వార్ధక్యములో నాకొక కుమారుడు కలిగినాడు. వానిపైన కలిగిన మోహావేశము, ఇతరములన్నిటి మీది ఆదరమునూ, అకాలములో హఠాత్తుగావచ్చిన వరదలాగ కొట్టివేసినది. పద్మము తనకాధారమైన కాడను కప్పివేసినట్లు నాపుత్రప్రేమ నన్నుకప్పివేసినది. నిర్లక్ష్యముచే విడువబడిన రాచకార్యములు నాకు సిగ్గగునట్టు పెరుగుతూఉన్నవి. ఇలా ఉండగా ఒకనాడు సభాభవనములో నేను కొలువుతీర్చి ఉన్నప్పుడు పానితల్లిగదిలో పిల్లవాని ఏడుపు వినబడినది. తక్షణము నేను సింహాసనముమీదనుండి లేచి ఆదిక్కునకు పరుగెత్తినాను.

ఋత్విజుడు

నిత్యమువలె ఈతనిని, ఆశీర్వదించడమునకు నేనూ అప్పుడే రావడము సంభవించినది. తన ఆతురతతో కన్నుగానక నన్నొకవైపునకు త్రోసి లోపలికి వెళ్లినాడు. దానితో నాకోపాగ్ని రగులుకొనినది. కొంతసేపటికి సిగ్గుపడి నాదగ్గరకు వచ్చేసరికి నే నిలా అన్నాను:

"ఏమిరాజా! ఈ అవసరసమయములో నీకృత్యములను మరచి, మర్యాదనుకూడా అతిక్రమించి, అంతఃపురమునకు పరుగెత్తవలసినంత ఉపద్రవ మేమివచ్చినది? నీ మిత్రులయిన రాజుల ఆస్థానములనుంచి రాయబారులు వచ్చిఉన్నారు. ఆర్తులు అనేకులు న్యాయరక్షణకై వేచిఉన్నారు. అత్యవసరములైన రాచకార్యములనుగురించి సంప్రతించుటకు నీ మంత్రులు వేచియున్నారు. ఇవన్నీ అటుంచి బ్రాహ్మణాశీర్వాదమునైనను గణనసేయ వైతివేమి ?

సోమకుడు

ఈమాటలు వినుటతోడనే కోపముతో నాకు గుండె భగ్గుమన్నది. కాని పడగ ఎత్తినపాము నణగద్రొక్కినట్లు నాకోపము నణగద్రొక్కి అతివినయముగ "ఏకపుత్ర విషయమగుట నా మనోనిశ్చలము తగ్గిపోయినది. ఈఒక్కమారు

క్షమింపుడు. ఇకముందెన్నడును జనకుని యొక్క మోహావేశము సాంసారికమునకు భంగము తేజాలదని వాగ్దానము చేసెద"నని యంటిని.

ఋత్విజుడు

కాని నాహృదయమును కోపానలము దహించుచుండెను. "రాజా! ఏకపుత్ర విషయమను శాపము పోవుట కొక్క ఉపాయము చెప్పగలనుగాని అది బహుదుర్లభమగుటచేత నీవు ఆచరించవని నాకు తెలియునంటిని. దానితో రాజు తన పౌరుషము నిలుపుకొనుటకు లేచి "నేను క్షత్రియుడనై రాజునే అయినయెడల దైవముసాక్షిగ తాము సెలవిచ్చెడి యాజ్ఞ ఎంతదుర్లభమైనను నే నేమాత్రము వెనుదీయక నిర్వహించెద"నని పలికెను. "అయితే ఆలకింపుము. హోమకుండము నొకదాని నేర్పరచి దానిలో అగ్నిని ఉంచి ఆఅగ్నికి నీ కుమారుని ఆహుతిగా నొనర్పుము. అప్పుడు బయలుదేరినపొగ వలన మేఘములవలన వర్షమువలె నీకు సంతానము కలుగగల"దని చెప్పితిని.

రాజు తలవంచుకొని ఖిన్నుడై మాటాడక నిలువబడెను. సభాసదులందరూ ఒక్కపెట్టున ఘోరమనిరి. బ్రాహ్మణులు హరిహరీ యని చెవులుమూసుకొని ఇట్టిపలుకులు పలికినా, విన్నా మహాపాతకమనిరి. భయ విస్మయములతో స్తబ్ధుడై ఒక్కక్షణ మూరుకొని పిమ్మట 'నామాట నిలుపుకొనెద'నని రాజు శాంతముగా పలికెను.

ఇక యజ్ఞము చేయవలసిన రోజు వచ్చినది. నిప్పు ముట్టింపబడినది. ఊరిలోనుండి జనులందరునూ వెడలగొట్టబడిరి. పిల్లవానికొరకు కబురుపంపిరి. సేవకులు వీరిమాట వినమనిరి. సైనికులు ఆయుధములను పారవైచి తమపనులను విడిచిపెట్టిరి. ఇందరిలో నేనొక్కడనే జ్ఞానిని; మోహపాశములచేతపట్టుబడనివాడను. సుఖదుఃఖములు మిథ్య లని నాకు తెలియును. అందుచేత నేనేస్వయముగా అంతఃపురమునకు పిల్లవానికొరకు పోతిని. కొమ్మలచేత కాపాడబడు పుష్పమువలె పిల్లవాడు స్త్రీల ఆలింగనమున సురక్షితముగానుండెను. బాలుడు తనను బంధించిన ప్రేమపాశములను విముక్తి పొందవలెనను ఆశతో నన్నుజూచి ఆతురతతో చేతులుచాచెను. "నీకు నిజముగ ముక్తినిచ్చుటకేవచ్చితి" నని నిశ్చేష్టులై దాసీజను లేడ్చుచుండ మూర్ఛనొందిన తల్లిహస్తములనుండి బలవంతముగా వానిని తీసికొనివచ్చితిని. మంటలు మిన్నుముట్టుచుండెను. రాజు నిశ్చేష్టుడై, హీనుడై, పిడుగుచేత కూలిన వృక్షరాజమువలె నిలువబడెను. దైవసమానమైన అగ్ని యొక్క తేజస్సునుజూచి, పిల్లవాడు, సంతోషమున కేకలువైచుచు నాచేతులలో త్రుళ్లింత లిడుచుండెను.

క్రొత్తగావచ్చిన దాదివద్దకు పరుగెత్తినట్లు, స్వచ్ఛందమై, దేదీప్యమానమైన మంటల చేతులలో నురుకవలెనని తొందరపడుచుండెను.

సోమకుడు

చాలు! చాలు! ఇంకవలదు.

ఇతరప్రేతలు

ఋత్విజుడా! నీవిక్కడనుండుట నరకమునే అవమానపరచుట.

సారథి

మహాప్రభూ! ఇది తమరు నిలువదగినస్థానము కాదు. నరకమునే భయకంపితమొనర్చిన ఈ గాథను వినవలసినంత అగత్యము తమకులేదు.

సోమకుడు

నీ రథమును తోలుకొనిపొమ్ము. బ్రాహ్మణా! నీతోపాటు నేనూ ఈనరకముననే ఉండెదను. దేవతలు నాపాపమును మరచిన మరతురుగాక! తుదకొక్కక్షణమునతనతండ్రే తననుద్రోహము చేసెనని తెలిసికొనినప్పుడు యమబాధపడుచు ఆశ్చర్యముతో నాకొడుకు నావైపుచూచిన కడసారిచూపు నేనెన్నటికైనను మరువగలనా!

[ప్రవేశము:—యమధర్మరాజు]

యముడు

రాజా! నీరాకకై స్వర్గము నిరీక్షించుచున్నది.

సోమకుడు

కాదు. నాకొరకు కాదు నేను నాకొడుకును జంపినపాపిని.

యముడు

నీవనుభవించిన పశ్చాత్తాపమున నీ పాపము నశించినది.

ఋత్వికుడు

వలదు! రాజా! నీవు నన్నువిడిచి ఒంటరిగ స్వర్గమునకు పోకుము. ఈనరకబాధకు తోడు నీపై నసహ్యముకూడ చేరినదో నేనింకింతటి బాధ ననుభవించుచు, నరకాగ్నితోను, అసూయాగ్నితోను దహించుకుపోదును. నీవిచ్చట నేయుండుము.

సోమకుడు

నే నుండెదను.

ఇతరప్రేతలు

నిరాశాయుతము లజ్జాకరము నగు ఈనరకము ఒక్క ఆత్మయొక్క విజయముతో ప్రకాశింప నిమ్ము.

---

# కవివిపంచి

కె. అన్నమరాజశర్మగారు

భాద్రపద మేఘపంక్తులు ప్రకృతి కెల్లఁ
జలువ పందిరి గట్టెడి సమయమందు
పలుకరాని మనోజ్ఞప్రపంచమునకు
హృదయవల్లకితోఁగూడ నెగిరిపోదు!

హిమకుమారుండు వసరము కింపుగాఁగ
మంచుముత్యంపుఁగాన్క లర్పించువేళ
కుసుమ సంవ్యాప్త తృణశయ్యఁ గూరుచుండి
ప్రకృతి నలరించు పాటలఁ బాడుచుందు.

పరమ సాంధ్యవిలాసిని పశ్చిమాశ
శబలితంబైన తెరచీర జాఱవిడువ
కేతకీనికుంజంబుల కెలన నిల్చి
స్వప్నములఁగూర్తు బాష్పప్రవాహమందు!

చంద్రికాధౌతమోహన శర్వరులను
తరళనక్షత్రకాంత పథంబునందు
జలదపోతంబుపై హాళి సాగుచుందు
సృష్టి యానందగీతాభిషేకమొంద.

మలలనెత్తంబులందుండి మలఁకలగుచు
జాలుసెలయేళ్లు శబ్దించు శ్రావ్యగీతిఁ
గనులహర్షోదయాంబువుల్ కడలుకొనఁగఁ
బ్రణయతంత్రీస్వనంబునఁ బ్రస్తరింతు.

"మల్లెపువ్వులు"




శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు

### నాట్యమందిరము

నాట్యమందిరము పాదములు కల ఒకానొక దివ్యక్షేత్రము. అది యాత్రికులకు వింత గొలిపి సుఖమును గిలకొట్టి వారి మానసమును ఒకానొక యానందధామమునకుఁ గొంపోవును. నీచునికడనుండి జ్ఞానివఱకును, దరిద్రునుండి ధరాపాలుని వఱకును, భోగకాంతనుండి కులకాంతవఱకును గల వర్తనము వేఱువేఱ చూపి హేయోపాదేయములను నిగూఢముగా నిరూపించును. చంద్రోదయమున నుప్పొంగు సముద్రమువలె క్రమక్రమముగా పొంగిపొరలు రసవాహినికి ప్రభవమగు నాట్యమందిరముం దేవ గోలలాడఁ గోరరు ?

### నాట్యము

యువకుఁడగుట, మఱియు నతఁడు సాధువగుట, యింకను చదువు లెఱుఁగుట, పిదప శాసకుఁడు దృఢిష్ఠుఁడు బలిష్ఠుఁడు నగుట యట్టి వానివశమున సిరిసంపదలతోఁ దులతూఁగు నీ నేల యెల్లయు నుండుచో వాని యానంద మొక మానుషానందమని[1] యుపనిషత్తు చెప్పుచున్నది. అట్టి మానుషానందముకూడ రసానందమునకు వాచుకొనును. మానుషానందముకంటె అతీతమగు రసానందమునకు కందరమగు నాట్యమందిరము లున్నయెడల నైనందినము మొదటి టిక్కెట్టు నాదే.

క్షేత్రమున కేఁగిన ప్రతివాఁడును తన్మయుఁడయి పోవుచుండును. ప్రతిరాయియు వానిలోని భక్తి నుద్దీపింపఁజేయును. ప్రతివిగ్రహమును వానికి సజీవముగాఁ గానిపించును. అటులే నాట్యమందిరమున నున్న శ్రీనివాసులు, రాఘవాచార్యులు, నరసింహారావు, సూర్యనారాయణ, సుబ్బారావు, సంజీవరావు సుందరరామయ్య లోనగువారు దుష్యంతుఁడుగా, ఒథెల్లోగా, సత్యభామగా, సత్యవంతుఁడుగా రాధగా సావిత్రిగా నారదుఁడు లోనగువారుగాఁ గానిపింతురు.

అందు ప్రేక్షకుని లౌకికానందమంతయు అలౌకికానందముగా మాఱును. అతఁ డపుడు అన్నమయ ప్రాణమయ కోశముల నతిక్రమించి మనోమయకోశమునందలి యూయెలలో నూఁగుచు పోయిపోయి గుణములలో గుణమై సాధారణత్వమును బొంది ఏదో యొక నిమిషమున తనను కొంచెము సమీపించి హృదయకవాటముల తాళమును తెఱచి వైచును. ఇది సావలంబన సమాధివంటిదని పండిత రాయలు.

---

(౧) తైత్తి-బ్రహ్మానందవల్లి-౨-౮.

నటులును, సహృదయులును కలిసి ఒక అలౌకిక ప్రత్యయప్రవాహమునఁబడి కొట్టుకొని పోవుచుందురు [టిక్కెట్లు కొనలేనివారు వాకిట నల్లాడుచుందురు] ఓహో ఎట్టిమార్పు! ఎట్టి యారోహణము! సుఖశిఖరమునకుఁ గొంపోవు నీనాట్య మందిర మెంత పవిత్రము! పాపము! నటులింకను నాందిని వదలలేదు. అంతియచాలు.

తొల్లి నాట్యమందిర మితరకళాభవనములవలె కేవలరాజపోషితమై కొన్నికొన్ని నియతసమయములందు—తిరునాళ్లలో, రాజోత్సవములలో, పండువులలో— అందఱను పేరంటము పిలుచుచుండెడిది. ఇపు డితరకళామందిరములతోపాటు ఒకరీతిగాసార్వజనీనమై శన్యాదివారములలో, సెలవులలో, లేక వీలయినపుడెల్ల ఒకపావలాకు తలుపుతీయుచున్నది.

ఈ విధాన మొకరీతి నష్టికి కారణము. దీనిచే సహృదయుఁడుకూడ ప్రేక్షకుఁడే యయినాఁడు. [ప్రేక్షకుఁడు సహృదయుఁడయి పోయినాఁడు.] ప్రతిదమ్మిడీకి నటునిపై హక్కు కలదు. అది అయిదునిమిషము లోపిక పట్టనీయదు. సంతసముకలిగెనా యది యెగిరి పడును. కలుగక పోయెనా పదివేలు ఋణమిచ్చినటులు మ్రోఁగును.

ఈ విధానము నటులకుఁగూడ కొన్ని లోపములను దెచ్చిపెట్టినది. అది సతతప్రదర్శనము. సతతప్రదర్శనము ప్రతిపదమందును తారళ్యము,సౌందర్యము,జీవనమునుకల నటుని శక్తిని కుంచీకరించి జడత్వము,మోటుఁదనము, రాపాటు వీనితో సన్నగిలఁజేసి దానికొక విసువు నాపాదించుచున్నది.

నటునకు కొంత విశ్రాంతి యావశ్యకము. అతనిచూపు ఏకాంతములలో, పత్తనములలో దేవాలయములలో, కసాయి దుకాణములలో, వీరునిలో పిఱికిపందలో **విహరింపవలయును.** ఒకప్రదర్శనమునకును మఱియొక ప్రదర్శనమునకును నడుమ సహస్రనూతనభావములు నటునిలో నుదయింపవలయును. నటుఁడు ప్రతిదినమును నాటకచక్రమును లాఁగికొని పోవు ఇంజెను కాఁడు. తగిన విశ్రాంతియే లేని యెడ నటుఁడు కొలఁదికాలముననే మఱుగుజ్జయిపోవును.

సిద్ధులగు నటులైనను ఒకరూపకమును వరుసగా రెణ్ణాళ్లు ప్రదర్శింతురేని మూఁడవ ప్రదర్శనమునకు సహృదయుఁ డెవఁడును పోఁజాలఁడు. తనపై మొదటఁ గలిగిన యభిప్రాయమునుపలచఁబడకుండఁ జేసికొనుటకును, మరల నభినవరూప మెత్తుటకును నటునకు అవకాశ మనునది చింతామణి.

### ప్రసాధనామందిరము

ప్రసాధనామందిరము(Greenroom)కాని నాట్యమందిరముకాని, అంగడిగాని, వేశ్యావీధిగాని కాదు. ప్రసాధనామందిరమందు ప్రసాధకులును, నటులును మాత్రమే సత్వసంపన్నమగు మానసములతో తల్లిబిడ్డలవలె సోదరులవలె నుండుట విధి. దీనిలోనికి ప్రేక్షకుఁడు చొఱఁడు. ఒకవేళ వెళ్లెనా గ్రుడ్డు నవియించి నటు లగును. ప్రసాధనా మందిరాంతరమును

ప్రవేశించిన నటుల మిత్రులు కొందఱు నటుల యెడ సేవము పొందుటయు, మఱికొందఱు వికారములకుఁ బాల్పడుటయు, దాన నటులు గూడ చెడుటయు మనము విననిమాటలా? స్త్రీ తాగ్నులు కల గృహ మెంత పవిత్రమో నటులుకల ప్రసాధనామందిర మంత పవిత్రము కాదా? ఇచట సామాన్యముగా నటులకుఁ గల దురభ్యాసము ధూమపానము. నటునకు సామాన్యముగా చుట్టయే చుట్టము. నటుఁడు చుట్ట త్రావుచో చుట్ట యతని నేవళమును ముఖ శక్తిని త్రావును. నే నొక నాటకమందిరమున లోపలిగోడమీఁద 'చుట్టలు సిగరెట్టులు బీడీలు తాగకూడదు' అను శాసనమును చూచి సంత సించితిని. నన్ను ప్రసాధనామందిరమునకుఁ గొంపోయిరి. ప్రసాధన 'మందిరమంతయు అగరుధూపముచేతను, పూలచేతను వాసితమగు టకుబదులు చుట్టపీకెలతోనిండి వానిపొగచే వెల్లవేయఁబడియుండెను. అనుఘదమున నే గిరీశము హవానాచుట్ట నోట నిడికొని రంగమున కాఁడి యుమియుచు మందిరమంతయు దాని పొగచే చిఱుమబ్బులు క్రమ్మించెను. పిదప రామప్పంతులు దానిని ధూమపానశాలగానే మార్చెను. అసలు స్థలము మధురవాణి పడకటిల్లు. రంగము—ఓహో! నీ నీత్యనీతులకు నే నావల నున్నానని నాటకతత్త్వమును వెల్లడించుచుకొంబోలు. నేను నీతిదృష్టితో మాటలాడుటలేదు. దానివలన నటునకుఁ గలుగు ప్రత్యేకాపాయమును వివరించు చున్నాను. ప్రతినటుఁడును విరామముతో సత్వసంపన్నుఁడై ఆనందముతో విశ్రాంతి ననుభవించుటకును ఆకృతి మార్చుకొనుటకును తావైన ఆ ప్రసాధనామందిరము గర్భనరకము కాదు సుఖాపవరకము! నూతనముగా సృష్టికి సిద్ధపడిన ప్రకృతి యెంత తదేకతానమయి యుండునో ప్రసాధనామందిరమును అంత తదేకతానమయి యుండనగును. దానినొక చిత్రకళాశాల చేయుట లెస్స.

నటుఁడు

నాటకశాల యజ్ఞశాల. నాటక మొక చాక్షుషయజ్ఞము. 'కాంతః క్రతు శ్చాక్షుషః' నటు లధ్వర్యులు. ఇందు సహృదయులు చెవులతోడను, కనులతోడను సోమరసము గ్రోలుదురు.

నాటకమునందు కవి నిర్మించిన ఒకానొక చిన్మయమైన పాత్రమునకు నటుఁడు చతురస్రము, సజీవమునగు చిత్రకళను, అనురూపమగు గానమును,[౧] దివ్య మగు శరీరమును

౧. నాటకమున గాన మక్కఱలేదను వాద మొకటి కలదు. కేవల సాంఘిక నాటకములలో గానముతో ఆట్టే పని లేదు, అక్కఱలేదు కూడను.

శాకుంతలమున స్వల్పముగను విక్రమోర్వశీయమున విపులముగను కాళిదాసు గానమును ప్రవేశపెట్టినాఁడు. లాక్షణికులు గానమునుగూడ నాట్యమునకు సహాయకళగా నిరూపించిరి. పద్యమున నున్న సహజగానమునకు గానము నెచ్చెలి. అది రసవ్యంజకమగు నెడల దాని విడనాడవలయునని వాదించుట సమంజసము కానేరదుకదా!

గానము భావము నుద్దీపింపజేయునదిగా నుండవలయునుగాని దానిని మ్రింగివైవఁగూడదు. ఇపుడు నాటకముల లోపాడబడుగానమున భావము తద్దినము పెట్టువాని తమ్ముని వలెనున్నది. భావసింహాసనమున గానమే యేలుచున్నది.

ఒసఁగుచున్నాఁడు. కవి పురుషుఁడగునెడల నటుఁడు ప్రకృతి. కవి తండ్రియగుచో నటుఁడు కుమారుఁడు.

నటుఁడు తనతండ్రికడనుండి సంక్రమించిన రసధనమున సహృదయు లందఱకు పంచియిచ్చు మహాత్యాగి. తనకు విహితమగు కర్మమును కాయక్లేశ భయమువలన విసర్జింపక సమగ్రముగా ననుష్ఠించి ఫలమును గోరని కర్మయోగి.

అతఁడు కవినిర్మితమగు పాత్రకు తన జీవితమును కృతి యిచ్చి కాలికముగా తన అస్తిత్వమును దాన మిచ్చు మహాదాత. అట్టి సమయములలో పరిచ్ఛిన్నమయిన యతని మానసము వికాసము నొంది కొంతసేపు ఒకానొక ఉన్నత భూమిలో నిలువఁబడును. అతఁడు వాచకుని ( Prompter ) వాక్యము వినినంతనే ఇతరుల సుఖదుఃఖములు మోసి క్రమక్రమముగా తనవిచేసికొని నవ్వి నవ్వించి, యేడిచి యేడిపించి జనహృదయులను తన అదుపాజ్ఞలలో నుంచుకొనును. ఆహా! ఇదెట్టి సృష్టి! కవి తరువాత నటునిదే మకుటము!

నటుఁడు కవిని సంపూర్ణముగా మ్రింగివైచుటలో రాహువు; లేక వివరించుటలో భాష్యము; పాత్రకు వన్నె పెట్టు ప్రతిబింబము; మనుజుల వివిధప్రకృతులకు ప్రతినిధి. అతఁడు నాటక దేవత. ప్రదర్శనమునందు నాటకకర్తగాని, పాత్రముగాని స్వయముగా వచ్చి కూర్చుండుఁగాక అట నటునిదే సామ్రాజ్యాధిపత్యము. సమస్తము నటునిలో ఉత్పన్నమయి నటునిలో లయమగును. నటుఁడు కవి సత్యాంతము నంతసపఱిచి యతని పేరునందు తన పేరును స్థాపించుకొనఁగా కవి యెంత యానందించునో కదా! 'పుత్రా దిచ్ఛే త్పరాజయమ్.' తా మొనరించిన సృష్టికి—'ఈసృష్టి యంతయునేమి? ఎందుల కీదుఃఖము? ఏల యీాకర్మము? ఎటులు సమన్వయము?' అను నీమొదలగు ప్రశ్నపరంపర లేకుండ ఆనంద ముత్పత్తిఁ జేయునవి యీరెండాత్మలే! ఈవీరిసృష్టిలో దుఃఖముకూడ నానందమే! సీతతోపాటు దుఃఖింప నెంతమంది రారు? హరిశ్చంద్రుని దుఃఖపరంపరలో ఆనంద బాష్పపరంపర నెంతమంది విడువరు? చారుదత్తుని దుఃఖము నెంతమంది పంచుకొన నూవిళ్లూరరు? అదెట్టిసుఖము!

నటుఁడు కేవలము కవి పోసిన పోతవిగ్రహము కాఁడు. అతఁడు తన నిశిత పరిశీలనముచే లోకము నలౌకికముగా ననుకరించును. లోకముయొక్క వేషభాషలలో, నడవడిలో సర్వములో తన కుపయోగించు నంశమును నీరక్షీరములలో క్షీరమును హంసవలెఁ గ్రోలి దానిని తన ప్రత్యేకోపాధిచే ప్రత్యేకించి అలౌకికము చేయును. అపుడా వేషభాషలకును, అన్నిటికిని అద్భుత మావహించును. ఎపుడు నటుని వేషభాషాదులను మఱల లోక మను

స్థానం నరసింహారావుగారు యడవల్లి సూర్యనారాయణగారును చేయు గానము భావమునకు దోహదముగా నుండును. వారిగానము వినినచో అభావవాదబల ముపక్షీణమగును.

పద్య మన్నమాత్రమున గానము వలయునని కాదు. కొచ్చెర్లకోట రంగారావుగారి శకారపాత్రము గానమును బహిష్కరించి పద్యములు చదువగా మిగుల నింపుగా నుండెను.

కరించునో అపు డాచిత్రకళ,ఆగానము, ఆనట నము ఆకాలమున ఆసంఘమున కాష్ఠకుఁ బరుగిడినదని మనము తలంపవచ్చును. స్థానం నరసింహారావుగారి యాహార్యాభినయమును (వస్త్రధారణము అలంకారము మొ.) ఎంత మంది స్త్రీ లనుకరించుట మనము వినలేదు? ఆయన 'అబ్బా'యను దీనాలాపమును ఎంత మంది రామస్మరణముగా మార్చికొనలేదు? రాఘవాచార్యుల వారి ఆంగికాభినయమును, నేత్రవ్యాపారమును ఏకాంతమున ఎంతమంది అనుకరించి నిట్టూర్వలేదు? ఎంతమంది పారుపల్లి సుబ్బారావుగారి రాధలుగా మాఱలేదు?

నటుఁ డొకగారడీఁడు. ప్రసిద్ధనటునిపేరు విన్నంతనే లోకులచెవులు నిక్కఁబొడుచుకొనును. కరుణమునఁగాని, భావశబలతయందుఁగాని, విఫలప్రేమయందుఁగాని, వియోగమునందుఁ గాని, భక్తియందుఁగాని రసించిన లోకము మఱల వాని దర్శించుటకు ఎన్ని జాగరణములయినఁ జేయును. మానసమను లక్కపై నటుఁ డొత్తిన ముద్రలను తుడిచికొనలేక కొన్ని నెలలు, కొన్ని సంవత్సరములు గూడ ఆసుఖదుఃఖములలో అలౌకికసుఖమును స్మరించుకొనుచుండును. గిరీశమును చూచి గిరీశము లయిపోవువారు కలరు; సత్యభామను జూచి సత్యభామలగువారు కలరు; రుక్మిణులుగా మాఱువారు కలరు. నారదునిభక్తిలోఁ బడి భక్తులగు వా రెంతమంది? సారంగధరుని పాదచ్ఛేదము చూచి నాబాల్యమున నేను రెండునెలలు లేవలేదు.

కవి నిఱుపేద; [1]నటుఁడు మహాధనికుఁ డన్న మాట నిక్కువము. కవియగు షేక్స్పియరు పది రూకలీయఁజాలఁడు. నీనటుఁడగు షేక్స్పియరు పదివేలు పంచియీయఁగలఁడు. రాఘవాచార్యులుగారిలోని నటుని సంపాదనము రాఘవాచార్యులుగారిలోనిలాయరునకుఁగలదా? నటరాఘవాచార్యులుగారి వితరణము లాయరురాఘవాచార్యులుగారే చేయలేరనిన ఏరాజుచేయఁగలఁడు?

నటుఁ డెంతధనికుఁడో అంతదులాబీనాఁడు. అతని చాకిజీతముతో ద్రౌపదికి వస్త్రము లీయవచ్చును. అతని క్షౌరదుర్వ్యయముతో కొన్నికుటుంబములు క్షౌరము కావించుకొనవచ్చును. అతని ప్రయాణవ్యయముతో భూప్రదక్షిణము చేయవచ్చును. కేవల నటనమే జీవికగాఁగలవారు ఇటులు దుర్వ్యయము చేయుదురో తుదకు బికారులయిపోవుదురు. యువకులే బికారులైనవా రెందఱులేరు ? వారినటనము వారికపుడు గుఱుతు వచ్చును. ఒకనాఁడు బిచ్చకాఁడు, ఒకనాఁడు చక్రవర్తియైన నటుఁడు కొన్ని యేండ్లు రాజుగా వెలిఁగి కడపటికి భిక్షుకుఁ డగుట వింతకాదని యతఁ డెఱుఁగును గాని ఆభిక్షుకత్వము నతఁడు పాపము ! భరింపఁజాలఁడు. నటుఁ డెంత చలుఁడో లక్ష్మి యంతకంటె చంచలురాలు !

నటునకు పంక్త్యర్హత లేదను నపవాదము మిగిలినవానితోపాటు సన్నగిలిపోయినది. తనధర్మమూయని భరతమునియే తీసి

౧. "కవి ర్దరిద్రో నటకో ధనాఢ్యః"

వయించినాఁడు. ప్రతిపదక్షౌరము, స్త్రీవేషధారణము ఈరెంటిని పెద్దలు లోపముగాచూతురు. ఈ రెండును నటునకు జీవగఱ్ఱలు; ఛాందసులకు ప్రాణగొడ్డములు. పోనిండు! నటుఁడేలయని కొంద ఱందురు. నటుఁ డేలయనినచో 'కవి యేల?' అను ప్రశ్న ముదయించును. ప్రశ్నకలాప మంతయు ఇక్ష్వాకులనాఁటి మాట. నటుని పెద్ద లెపుడు తిలకించిరో యతనికళకుఁ గావలసిన సదుపాయములపుడే స్మరింపఁబడినవి. నటుఁడు లేనిచో నాటకము లేదు; నాటకము లేనిచో కవి లేఁడు; కవిలేనిచో నంధకారము. ఏ మండలమున నటుఁ డుదయింపలేదో ఆ మండలమున నాటకము లేదు ఏ మండలమున నాటకములేదో దాని రససౌందర్యము లేదు.

ఆంధ్ర మండలమున మంచినాటకముల కన్న మంచినటు లెక్కువగా నున్నటులున్నారు. వారు త్వరపడి యేడవ మాసముననే ప్రపంచములోనికి వచ్చిరి. వారు నాటకకళను అమ్ముచున్నారు గాన మంచిసెబ్బరలనుమాట లేక చాల నాటకములను ప్రదర్శించి తీఱవలెను. దానిచే వారికళకొక నైచ్యము సంఘమునకు రుచిలో హానియు కలుగుచున్నవి. భాషలలో నవీనసృష్టి తక్కువ యయినపుడెల్ల ఈజబ్బు పుట్టును. కొన్ని నాటకములలో తమశక్తి కవకాశములేక నటులు నాటకములనంతయు ఒక ఆంగికాభినయముగా మార్చిరి. అది జీవజంతువుల సినీమావలె పాడఁగట్టినవి.

నటత్వముచే నటునిగౌరవము పోవదు సరికదా మఱి హెచ్చును. నాట్యముకొఱకే నటుఁడయినను[౧] జీవికకే నాట్యమయిననుఁ అదినటునిలో ప్రత్యేకలోపము. కవిత్వము కొఱకే కవియయినను, జీవికకోసమే కవిత్వమయినను అదికవిలో లోపము. గానముకొఱకే గాయకుఁడయినను, జీవికకొఱకే గానమయినను అది గాయకునిలో లోపము. శిల్పములన్నిటియందును ఇట్టి లోపనిరూపణ మార్యసంప్రదాయమయియున్నది. 'విటులముకాము, నటులము కాము, గాయకులముగాము...... స్తనభారానమితలమగు స్త్రీలముగాము. రాజును జూడ మాం కేల?' అనిభర్తృహరి యనును. కవి గూఢ నటుఁడు; నటుఁడు గూఢకవి. కవి నటునకు దోహదము; నటుఁడు కవికి దోహదము. నటుఁడు కవికి గౌరవ మిప్పించును; కవి నటునకు గౌరవమిప్పించును. నటునకు గౌరవము పోవుచో అది యితరసామాన్యదుర్గుణముచేఁగాని నాట్యముచేనెంతమాత్రము కాదనుటకు భరతమునియే ప్రమాణము. నటుఁడు తనసంఘముయొక్కయు, తనదేశముయొక్కయు, తనభాషయొక్కయు గౌరవమునకు ప్రతిభువు.

కవి చనిపోవుచో వానిగ్రంథము వానికి ప్రతినిధి. నటుఁడు చనిపోవుచో వానివెనుక కింవదన్తియే. అదియు కొలఁదికాలముననే జీర్ణవస్త్రమయిపోవును. లక్ష్మణరావుగారి కళకేమి మిగిలినది? శ్రీనివాసులుగారి కళకు వారసుఁడేఁడి? సినీమా ప్రదర్శనమున కెక్క

౧. "అసిజీవీ మషీజీవీ దేవలో గ్రామయాజకః; ధావకః పాచకశ్చైవ షడేతే బ్రాహ్మణాధమాః."

నను గ్రామోఫోను ప్లేట్లవలె అదియొక మృత కళ. నటుఁడీ ప్రకృతిలోకము నెఱిఁగి కీర్తి కొఱకే తననాట్యముకాదని విశ్వసింపవలయును. నటుని జీవితమంత ఒడుదుడుకు జీవితము మఱియొకటి లేదు. చాలమంది పిన్నవారు కీర్తి మొదలైనవాని కొఱకు వింతగా నాట్యమందిరములకు బలి యగుచున్నారు. చదువులు సమాప్తించుచున్నారు. చదువు వేఱు, నటనము వేఱని వారి వేదురు. జీవితోద్దేశము సంపూర్ణముగా నెఱుఁగనివాఁడు నటుఁడు కాఁజనదు. జీవితోద్దేశము నెఱుఁగని నటుని జీవితము రాత్రులందు కొన్నిగంటలుమాత్రమే. ఇంచుమించు అతనికి సూర్యదర్శనము లేదు. కావుననే క్షేమేంద్రుఁడు కాఁబోలు.

ఉ. నీతలపైని దివ్యతప
నీయ కిరీటమొసంగు, నంగదా
ఘాతము చెందు నీబుజము,
కంచుకి లోనుగ నీదుసేవక
వ్రాతము 'దేవ' యంచనుచు
వచ్చును తేఁడవొ దాన? ఆటత
ర్వాత మహీరసంబెకదరా
మిగులుఁ నట! నీదు నెమ్మొయిఁ."

అని చెప్పినమాట యథార్థము.

వివిధజీవితములకు ప్రతినిధియగు నటుఁడు ఈజగతి యంతయు ఒక మహానాటకమని సూచించును. అతఁడు కూరికూర్చుండి యొకరిసుఖదుఃఖముల తనపై నెత్తుకొనికదా క్రమ్మరును. ఓహో ఎంత విచిత్రుఁడు! అతఁడు గౌరవింపఁదగిన మోసగాఁడు. ఇప్పుడు కుచేలుఁడు, అపుడు కుబేరుఁడు; ఇపుడు మధురవాణి, అపుడు రుక్మిణి; ఇపుడు పరమపాతకి, అపుడు మహాజ్ఞాని. కొన్నియేండ్లకు ముదిసి తాను తానుగా నయిపోవుచున్నాఁడు. అపరసారంగధరుఁడగు హరిప్రసాదరావుగా రిపుడు హరి ప్రసాదరావుగారే! చివరకు మిగులునది తానే.

నటుఁడు తనలోని కర్మయోగి నెఱుఁగఁడు. ఆవిషయము నతఁ డనుభవములోనికి తెచ్చుకొనవలయును. అనుకార్యమునందలిసుఖదుఃఖములు తనవికావు. కామక్రోధములు తనవి కావు. భక్తి తనది కాదు. అవి తన వనుకొనినంతమాత్రమున తనవగును. అది యొక చిత్రమగు ఉన్మాదము. ఒక ఆరోపితమగు మాయ. అది ఉభయతోముఖమగు ప్రజ్ఞావిశేషము; జాగ్రత్స్వప్నములసంధి; ఒకజాగ్రత్స్వప్నము; ఒకమూర్ఛ.

నేలను కొట్టిన బంతివలె నతఁడొకక్షణమున పాత్రములోని కెగిరి వెనువెంటనే తనలో కూలును. వాచకుఁ డందింపఁగనే పరకాయమును తనలో ప్రవేశింపఁజేసికొనును. అది యతనికి పుట్టువుతో సంక్రమించిన సాధన. లేక నేర్చిన శక్తియేయగుఁగాక; అతనిలోని విజాతీయమగు వింత అదియే. అది తెలియని పిచ్చికాదు. తెలిసిన, లేక చదివికొనిన, లేక యెఱిఁగిన పిచ్చి. ఆపిచ్చియే యతనికి తారకము. అతఁడు క్రమక్రమముగా తనమానసమును, తనగానమును, తనచిత్రకళను, తననాట్యమును, తనసంఘాతమును, సర్వమును రసపిండముగా మార్చి ఆనందాకాశమున నడుచును. అతఁ డున్నతమయిన తనమనస్సోపాన మెక్కి— సుఖదుఃఖముల సమీకరించు లౌకికానంద

బ్రహ్మానంద వాహినుల నడిమిపాయలో దుముకును. సహృదయులనంగఅను తనతోపాటం దీఁతలాడించును. అప్పు డాక్షణమున తాను లేఁడు; నటుఁడు లేఁడు; సహృదయుఁడు లేఁడు; ఒక ఆనందకాసారమే.

నటుఁడు శాస్త్రీయజ్ఞానముచే విభావానుభావసంచారిభావ వ్యభిచారభావముల వెనుకనున్న దొకటియే యని యెఱిఁగి, మనస్తత్త్వజ్ఞానముచే తారతమ్యము లేర్పఱించి మంచి గ్రహించి, గూఢముగా నణఁగియున్న నీత్యనీతులలో నీతి నభ్యసించి, రసజ్ఞానముచే ఆనందమును, సౌందర్యమును ననుభవించి తన కభ్యస్తమయిన కర్మయోగాభ్యాసమనఁ దగు నాట్యమును కర్మయోగముగా మార్చికొని, తనలోను, మనుజునిలోను గల మహానటుఁడగు నీశ్వరు నారాధింపవలయును. తనలో రచింపఁబడిన నాటకము తనలో ప్రదర్శింపఁబడుచున్న దను పరమార్థము నటుఁ డెఱుఁగుఁగాక! సర్వనాటకశాలయొక్క సాధువాదములకును ధిగ్గర్జనములకును ఒకచెవియే యొగ్గి సర్వ మీశ్వరార్పణముగా నటుఁ డెప్పుడు నటించునో అపుడే లోకమును, ఈశ్వరుని ఆరాధించినవాఁ డగును.

---

# ఆంధ్రుఁడా!

పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్యగార్లు

మౌళి రాజన్యుల మూర్ధరత్న రుచులం దూగాడి శౌర్యాగ్నిది
క్కులనెల్లన్ వెలిగించి, పావనత నెక్కొండైన పేర్గాంచి భూ (?)
స్థలి నిండ న్నిజకీర్తి చంద్రికల విస్తారంబుగావించె నీ
వెలుఁగుం జాతి! కళంకమిప్పుడు ఘటింతే? దాని కో యాంధ్రుఁడా!

మనుమసిద్ధినృపాల మకుటంబు నెల్లూరి, సింహాసనమున శాసించు నాఁడు
విద్యానగరమందు విద్వత్కవీంద్రుండు, కృష్ణరాయలు దేశమేలునాఁడు
రాజ్మహేంద్రమునందు రాజరాజ నరేంద్రుఁ, డతి కృపామతిఁ బ్రజ నరయునాఁడు
ఓర్గల్లు కాకతీయోదధిచంద్రుఁడౌ, శ్రీప్రతాపుండు పోషించునాఁడు
కదనభూముల నాంధ్ర ఖడ్గప్రహార, దళిత వీరారి కంఠరక్తమునఁ దడిసి
జయపతాకాంచలములఁ దేజంబు కులికియ, మును విజయలక్ష్మి తాండవించెనుగదోయి!
వెలయింపవేమి, పూర్వులవోలె నాంధ్రతే, జః పుంజములను విశ్వంబునిండ
ఈఁదింపవేమి, నీ యింటిచేకలనిలో, నరుల రక్తప్రవాహంపు సుడుల
వినిపింపవేమి, కవీంద్రుని యుద్బోధ, ముల ముసలమ్మమేల్ జలదరింప
తోమింపవేమి, యోధుల దిగ్విజయములఁ, జాటునాంధ్రుల తామ్రశాసనముల
సానఁబట్టింపవేమి, నీసాహసమ్ము, పాలమున్నీటిలోని భాస్వత్తరంగ
మాలికలఁబోలు నీ యశోంబరములిట్లు, మలినమై పోవుచుండ నిశ్చలతనుంతె!




౫

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

శంసుఁడు—శ్రీమతీ ఖండవణాంబగారూ! మా నలుగురివంతును పూర్తి అయినది. ఇంక మీరు విన్నదిగాని, కన్నదిగాని, అనుభవించినదిగాని యేదయినను వింతసంగతి ఉన్నపక్షమున సెలవీయవలయును. మీరు పెద్దలును, మాకు మాన్యలును అగుటచే మిమ్మును చెప్పుమని కోరుట సాహసమే. అయినను మొదటను మనము నిర్ణయించుకొని యున్నాముగనుక నెట్టులయినను మీ చేతనుకూడఁ జెప్పింపక తప్పకున్నది. కావున మాసాహసమును మన్నించి మంచి వింత యేదేని సెలవిచ్చి మమ్ములను కృతకృత్యులనుగా చేయుదు రని నమ్ముచున్నాము.

ఖండవణా—ఆహా! ఏమయినను సరియే వినిపించియే తీరుదును. కాని మీ కందఱకును భోజనముమాత్ర మెప్పుడు పెట్టించెదనో అదిమాత్రము మీరు ముందుగా తెల్లిసికొని యుండుఁడు. మీరందఱును ప్రత్యేకముగా తలపాగాలు తీసి మీమీతలలు నాపాదములపై నెప్పుడు పెట్టెదరో, ఎప్పుడు నాపాదపద్మములను మీమీకన్నుల కద్దుకొనియెదరో అప్పుడు; తెలిసినదా. ఇంక నేను చెప్పఁదలచినది వినుఁడు?

శంసుఁడు—ఏమమ్మా, అంతమాట సెలవిచ్చినారు? మేమీమాత్రపు భోజనముకోసము, ఎంతో మాననీయుల మగుపురుషులము కదా! మీరు వయసుచేత నెంతపెద్ద లయినను పుట్టువేమో ఆఁడుపుట్టువు గదా! అట్టి మేము మీపాదములపైని పడి బ్రతిమాలుకొందుమా? తిండి లేక ప్రాణాలు పోయిన పోవుఁగాక, మీరు కోరినప్రకార మెన్నటికిని జరుగఁబోదుసుమండీ!

ఖండ—(చిఱునగవుతో) జరుగఁబోదూ? ఎందులకు జరుగఁబోదో నేనును చూచెదనుగాక! నేను చెప్పిన చొప్పున మీచేతను చేయించుకోఁజాలనిపక్షమున నే నాఁడుదాననే కాను. మీరే కాదు; నేను కోరినచో మీతండ్రులు, తాతలు, ముత్తాతలు వేయేల? మీపితృదేవతలుసయితము నాకాళ్ళమీఁదను పడిరే తీఱుదురు! పట్టుదలపట్టినచో ఆఁడుది చేయించుకోలేనిపని యేమున్నది? అట్లు చేయించుకోఁజాలనిపక్షమున అది ఆఁడుదియే కాదు. ఓహో! మాననీయులఁట! పురుషులఁట! ఆఁడుదానిపాదములమీఁదను తలలు పెట్టరంట! అదెట్లు పెట్టకుండఁగలరో చూడనా? ఆలాగే, మీపంతమే నెగ్గునో నాపంతమే నెగ్గునో తరువాతను చూచుకొందము గాని, ముందుగా నే ననుభవించినకథ వినుఁడు. నేను పడుచుదాననై యున్నప్పుడు మీరు నన్ను చూచి యుండలేదేమో కాని, రూపలావణ్యములకు నిధినై యుండెడిదానను. ఇంతవయస్సయినప్పటికిని, ఇప్పుడే యింతజగన్మోహనరూపముతో నున్నప్పుడు యౌవనకాలములో నెట్లుండెడిదాననో బుద్ధిమంతు లయినచో మీరే పోల్చుకోఁగలుగుదురు. నేను తరుణినయి యుండఁగా ఒకప్పుడు ఋతుస్నాతనయి, అది గ్రీష్మఋతు వగుటచేతను, గాలికోసము కిటికీతలుపులు తెఱచి పడుకటింటిలో హంసతూలికాతల్పముపయిని పరుండి నిద్రపోవుచుంటిని. అప్పుడు గాలి మెల్లఁగా కిటికీలోనుండి గదిలోనికి ప్రవేశించి నారూపలావణ్యములును, పండారినిండుజవ్వనమును చూచి మోహించి, చల్లఁగా విసరి నన్ను నిద్దురనుండి లేపి నాకు కామకైంకర్యము చేసి

కడుపులోనుండి భార్యను బయటికి తీసినాఁడు. ఆవల అగ్ని తనకు గత్యంతరము లేక భామొక్క నోటినుండి బయలుదేఱి పాఱిపోయి తిన్నఁగా అడవిలోనికి జేరుకొని దాఁగున్నాఁడు. యముఁడును వానిని వెంబడించినాఁడు. వనములో ప్రవేశించి యెదుట నొక మదించిన యేనుఁగ గనఁబడఁగా, ఏనుఁగా ఏనుఁగా! నీకిటువైపు పరుగెత్తికొని యిప్పుడిప్పుడే వచ్చియున్నాఁడే, ఆ అగ్ని కాన కనుపడినాఁడా? అని అడిగినాఁడు. కాని, అది ముందే మదించియున్నదిగదా! యముని ప్రశ్నకు బదులు చెప్పినదికాదు. తన్ను సమానపరచినందుల కా యేనుఁగు పైని కోపించి దాని నాలుక కోసి పాఱవైచి తనస్థానమునకు చేరుకొన్నాఁడు. అమ్మగారూ! విన్నారు గదా! ఈ పురాణకథను. అగ్నిసంయోగమువలన యముని భార్య కాలిపోకుండ నున్నప్పుడు మీరుమాత్ర మేల కాలిపోవలయును? ఇది యేగో మాటుమూలకథ యందురేమో, పోనిండు. మీరు రామాయణములోని యుద్ధకాండమునను, రావణవధానంతరకథను వినియున్నట్లు గాని, చదివియున్నట్లుగాని కనుపడదే! అటు లయినపక్షమున మీరిట్టు లేల సందేహింతురు? రావణుని చంపి రాముఁడు సీతను యుద్ధభూమిలోనికి రప్పించి నేను నీకొఱకు రావణుని చంపలేదు. నా పౌరుషము నిలువఁబెట్టుకొనుటకు చంపియున్నాను. కనుక పరులయింట నిన్నినాళ్లున్న నిన్నెవ రంగీకరింతురు? నీయిచ్చవచ్చినవానియొద్దకు పొమ్ము. నాకెంతమాత్రమును అక్కఱలేదు, అని యేమేమో అవాచ్యము లాడఁగా ఆమె భర్తమాటలుసహింపఁజాలక వెంటనే అగ్ని ప్రజ్వలింపఁజేయించి యందులో ఉఱికినది. వెంటనే అగ్నిదేవుఁ డాదేవి నెత్తికొని వచ్చి సీత నిష్కల్మష అని చెప్పి భర్త కప్పగించిపోయినాఁడు. అటువంటి అగ్నిలో దుమికినసీత కాలిపోనప్పుడు మీరుమాత్ర మెట్లు కాలిపోవుదురమ్మా!

ఖండ—సరిగాని, ఇంకొక్కటి చెప్పెద నాకర్ణింపుఁడు. నేనొకప్పుడు విలాసార్థముగా వనములోనికి విహరింపఁబోయియున్నాను. అది మంచి వసంతఋతువు. చెట్లు, తీఁగలు మొదలయినవన్నియు చిగిర్చిపుష్పించి కనుపడినవి. అవి చూడఁగానే నాకును కామద్రుమ చిగిర్చినది. ఏకాకినిని. ఏమిచేయుటకును తోఁచినది గాదు. అప్పుడు నావిద్యను స్మరించి దానివలన ఇంద్రుని సాక్షించికొని వానితో యథేష్టముగా ఇంద్రభోగమనుభవించినాను. ఆహా! ఆనాఁటిసంగతి తలఁచుకొన్నచో ఇప్పటి ముసలితనములోఁగూడ మదన వికారము కలుగుచున్నది. చెప్పుచానవే వచ్చినది. ఇంక వివరించుటెట్లు? అఁ ఏమనిచెప్పియున్నాను? దేవేంద్రభోగ మనుభవించినాను. ఆసంపర్కమున నా కాయింద్రునివంటి వాఁడే కొడుకొకఁడు పుట్టినాఁడు. ఈ విషయమున మిమ్ములను నే నడుగవలసిన అంశమేమనఁగా, సరే, నాకవసరము తటస్థించినది; చేతిలో విద్యయున్నది. కనుకను నే నింద్రుని మంత్రించి పిలిచినాను గాని, అతఁడు వచ్చి నన్ను మెచ్చి మంచిమంచి అచ్చరమచ్చెకంటులను కూడ లక్ష్యపెట్టక నాసాంగత్యము నెట్లభిలషించి నాకోరిక తీర్చినాఁడో చెప్పండమ్మా! అటువంటి అటువంటి దేవతాస్త్రీలు గలవానికి నావంటిమనుష్యస్త్రీ యేమంత బాగుగా కనుపట్టినదండీ!

శంపూఁకు—అవ్వగారూ! మీరు రామాయణము, భారతము పలుసారులు చదివియుందురుగదా! ఇటువంటి సందేహములు మీ కేల కలుగుచున్నవి? ఆకథలు గాని మఱచిపోయినారేమో? అటు లేని నేను మీ ప్రశ్నకు రామాయణ భారతములనుండి ఉదాహరణముల నెత్తి చూపి మీసందేహములను తీర్చెదను. ఒకప్పుడు దేవేంద్రుఁడు గౌతమఋషిభార్య అయిన అహల్యనుకామించి పలుపాట్లుపడి, యెట్లయిన నేమి? తుదకు తనపట్టుదల నెఱవేర్చుకొన్నాఁడు. ఆసంగతి దానిభర్తకు తెలిసినది. ఆయన వానిని శపించినాఁడు. దానివలన ఇంద్రుఁడు సహస్రభగవానుఁ డయిపోయినాఁడు. స్వర్గమునకు పోవుటకు సిగ్గుపడి పాపము! అచ్చటివనములలో తిరుగుచు కాలము గడపుకొనుచున్నాఁడు. వానిని చూచుచున్న కొలఁదిని పూటకు బ్రహ్మచారులైన గౌతముని శిష్యులకు కామపెడ మిక్కుటమయిపోవుచుండెను. వారందులకు తాళఁజాలక పాపము! వానిని కష్టపెట్ట మొదలు పెట్టినారు. గోరుచుట్టువలననే దుఃఖపడుచుండఁగా దానిమీఁదను రోకటిపోటు కూడ తగిలినచో నిఁకను చెప్పవలసిన దేమున్నది? సిగ్గుచే స్వర్గమునకు పోలేకున్నాఁడు. వనములో శిష్యకోటి చేయు కుచేష్టలకు తాళ

లేకున్నాఁడు. ఇంతట, ఎన్నాళ్లకును దేవేంద్రుఁడు స్వర్గమునకు రాకుండుటకు కారణము దివ్యదృష్టిని చూచి బృహస్పత్యాచార్యులవారు చెప్పఁగా, అప్పుడు ముఖ్యులయిన దేవతలువచ్చి గౌతముని పాదములమీఁదను బడి బతిమాలుకొన్నారు. వారియందలి గౌరవముచేతను దయతలఁచి యింద్రునిసహస్రభగవత్త్వమునకుబదులుగా సహస్రాక్షునిగా చేసి స్వర్గమునకు పొమ్మన్నాఁడు. ఒక టయినదా? రెండవది—మఱొకప్పుడాయింద్రుఁడే కుంతి కోరఁగా నామెతో సహవాసము చేసినాఁడు. అందువలన నామెకు మహాప్రతాపశాలియును, మహాధనుర్ధరుఁడును అగు అర్జునుఁడు పుట్టినాఁడు. ఇంద్రుఁ డప్సరసలను విడిచిపెట్టి, మనుష్యస్త్రీ లయిన—అహల్యతోను కుంతితోను భోగించినప్పుడు మీతోమాత్ర మేల భోగింపఁడు? మీరుమాత్రము వారికంటె తక్కు—వరూపలావణ్యాదులు గలవారు గనుకనా? ఇంతవృద్ధావస్థలో నే యింతచక్కఁగా ఉన్నారే! పడుచుతనములో మీ రన్నట్టెంత చక్కఁగా ఉండెడివారో కదా! మాయీపాపపుకన్నులకు మీ—ఆరూపలావణ్యాదులు చూచునదృష్టము లేకపోయినది! సరి; మీసందేహము లన్నియుఁ దీఱినవి గదా! ఇంక విశ్రమింతము—గాని ముందుసంగతి కేమి—ఆలోచన?

ఖండ—నాయనలారా! ఏల ఈలాగు తొందరపడుచున్నారు? అప్పుడే సరియా? నేను చెప్పవలసిన వింతసంగతులు చెప్పనేలేదు. ఇవి వాని కుపోద్ఘాతప్రాయములు. సరిగాని, మీ కెవరికయినను నాపేరు గాని, నా—ఊరు గాని, నాగోత్రము గాని, నామాయలచరిత్రము గాని, నాపుట్టుపూర్వోత్తరములుగాని తెలియునా లేదా? ముందాసంగతి చెప్పండి.

మూల—ఏమమ్మా! ఆలా గడుగుచున్నారు? మాలో మీ యావద్విషయములను ఎఱుఁగనివా రెవరున్నారమ్మా? అమ్మా, పాటలీపుత్రనగరములో వాసముచేయుచుండెడి గౌతమగోత్రోద్భవుఁడయిన నాగశర్మ అనుబ్రాహ్మణునకు భార్య అయిన నాగశ్రీ అనునాబిడగర్భవాసమునుండి పుట్టినకుమారితగారా? మీ పేరు ఖండవా అని జగత్తంతయు నెఱుఁగును. అసలు మాయసయితము మీ రెఱిఁగినన్నిమాయలు—మర్త్యులు నెఱుఁగదు. సరియా, సరిగా చెప్పియున్నానా?

ఖండ—అయ్యా! మూలదేవయ్యా! చెప్పినట్టు నీ వనుకొనుచున్నావు గాని, అది వట్టిభ్రాంతి ఓహో! అన్నట్టు మీరు పురుషు లఁటకదా! పురుషులకు భ్రాంతి సహజమే. కాని నీవన్నట్టు నేను కాను. నాగశ్రీ యనునాబిడకుమారితరూపమువంటిరూపము నాకున్నందున నావిషయమున తప్పభిప్రాయపడి పోయినావయ్యా! వాస్తవముగా నే నాయమ్మకూఁతురను కాను. అటువంటి బ్రాహ్మణపుణ్యదంపతులకూఁతురనై పుట్టుటకు నే నంతటిపుణ్యాత్మురాలనా? నే నా—ఊరి రాజుగారిచాకలివానికూఁతురను. నా పేరు గగ్ఘిక యందురు. మాయిల్లు రాజమందిరముచందమున నే ధనధాన్యసమృద్ధమై యుండెడిది. నే నొకవేయిమంది కూలివాండ్రను పెట్టుకొని రాజాంతఃపురములోనివారిబట్ట లుదుకుపనియం దధికృతురాలనయి ఉండెడిదానను. ఒకనాఁడు నేను నాకూలివాండ్రచేతను మోయించుకొని మాసినబట్ట లుదికించుటకై నదీతీరమునకు పోయినాను. కూలివాండ్రాబట్టలన్నియు తెస్సగా ఉదికి యెండవైచినారు. ఇంతలో ఎక్కడినుండియో పెద్దసుడిగాలి వచ్చిపడినది. ఎండవేసినబట్ట లన్నియు నెగిరిపోయినవి. పాపము! కూలీలు చాలభయపడిపోయినారు. నేను వాండ్ర—అవస్థ చూచి జాలిగొని "ఓసీ! మీ రేల భయంపడియెదరు? ఇందు మీతప్పేమున్నది? గనుక దైవసంఘటనవలన నిట్టి—ఉపద్రవము తటస్థించినది. మీ రిందువిషయమున చింతింపవలసినపని లేదు. ఇంక మీవలన నాకు పని లేదు కావున మీయిష్టమయినచోటికి పొండు. రాజుగారివలన వచ్చెడి—ఉపద్రవమును నేను సంబాళించుకొనియెదను లెండు. మీ రింక నెందేని వెళ్లిపొండు" అని వాండ్రకు ధైర్యము చెప్పి పంపించివేసి నే నొకతిర్యగ్జంతురూపమును ధరించి రాజుగారి—ఉద్యానవనములో తిరుగుచుంటిని. అంతట తెల్లవాఱినది. అప్పుడు వరల నే నిట్లాలోచించుకొన్నాను. "నే నీరూపముతోనే ఉంటినేని తోఁటమాలీలు నిజముగా జంతువే అనుకొని చంపివేయకమానరు. నిష్కారణముగా చావవలసివచ్చును" అని యాలోచించుకొని వెంటనే లతారూపమును ధరించి ఒకానొక—అశోకవృక్షమును చుట్టుకొన్నాను. అవతల రాజుగారు మామూలుగా సాయంకాలమును కోటకు బట్టలు రాకపోవుటచేతను మాయింటికి

పోయినది. అంతట నేను గర్భవతి నయినాను నెలలు నిండిన పైని నా కొకకుఁగపిల్లవాఁడు పుట్టినాఁడు. అప్పుడే నాతో ఏమేమో మాటలాడి యెక్కడికో వెళ్ళిపోయినాఁడు. ఇది నేను ప్రత్యక్షముగా అనుభవించినఘటన; మీరు నమ్మిన నమ్మవచ్చును; లేదా మానవచ్చును. "ఆఁ, అదే మన్నమాట! అట్లెన్నఁడయినను జరుగునా?" అందురా, అందులకును భోజనము పెట్టవలసియున్నది. అట్లయినను చేయుఁడు. అట్లుకాక నిజమే అయియుండు నందురా, అందులకు తగిన గ్రంథప్రమాణము చూపింపుఁడు.

మూలదేవుఁడు—అటులేని, అమ్మగారూ! నా యెఱిఁగిన దొకటి ఉదాహరణముగా మనవిచేసెదను—వెనుక నొకప్పుడు వాయువు కుంతితో భోగింపఁగా మహాబలశాలియగు భీమసేనుఁడు పుట్టినట్టు భారతమనెడి మహాగ్రంథములో ఉన్నది. అది పంచమవేద మగుట వలన అసత్య మనుటకు వీలుపడదుగదా! అదిగాక, ఆ వాయువే అంజన అనుకంజాక్షితో భోగింపఁగా హనుమంతుఁడు పుట్టినాఁ డని వేదతుల్యమును, ఋషిప్రోక్తమును, ఆదికావ్యమును అగు శ్రీమద్రామాయణములో ఉన్నది. పైని చూపఁబడిన రెండుసంగతులును సత్యమయినపక్షమున వాయుసంయోగమువలన మీకును కొడుకు పుట్టనేవచ్చును. ఇది అసత్య మనుట కెట్లు వీలుపడును?

కుంటి—సరియే; కొడుకు పుట్టవచ్చు నని మీరు భారతరామాయణములు ప్రమాణము చూపించినారు. కాని, వాఁడు పుట్టఁగానే నాతో ఎట్లు మాటలాడఁగలిగినాఁడో, ఎట్లు నడిచి పోఁగలిగినాఁడో అది మాత్రము నిజ మనిపింపవలెను.

మూల—అదే నమ్మా! అట్లనుచున్నారు? మీరు భారతాదిపర్వము వినలేదా యేమి? అం దిట్లున్నది. ఒకప్పుడు పరాశరఋషి తీర్థయాత్రా ప్రసంగమున పోవుచుండఁగా దారిలో ఆయనకు యమున దాఁట వలసి వచ్చినది. ఆసమయమున పడవ నడిపించుచున్న జాలారిబాలికను మత్స్యగంధి అనుదానిని మోహించి మంచిమాట లాడి, యేమేమో మాయలు చేసి, దానికి యోజనగంధి అని బిరుదిచ్చి, నీకన్యాత్వమునకు భంగము కలుగకుండు నని వరమిచ్చి యెట్టులో దాని నొప్పించి దానితో సాహసము చేసినాఁడు పరాశరముని. ఆయన యింకను పడవమీఁదినుండి దిగినాఁడో లేనేలేదో దానికి ద్వైపాయనుఁ డని, వేదవ్యాసు లని పేరుపడిన పుత్రుఁడు పుట్టినాఁడు. పుట్టఁగానే అతఁడు తల్లితో "అమ్మా! నా కనుజ్ఞ యిమ్ము. తపస్సు చేసికొనుటకు పోయెదను. ఎప్పుడయినను నా—అవసరము తటస్థించిన పక్షమున వెంటనే నన్ను తలఁచుకొనుము. అప్పుడే నేను నీకంటఁ బడుదును" అని చెప్పి యెందేని పోయినాఁడు. అటుతర్వాతను యోజనగంధ కన్యగానే ఉండినది. దానిని శంతనుచక్రవర్తి పెండ్లి యాడినాఁడు. ఆదంపతుల కిద్దఱు కొడుకులు పుట్టినారు. పెద్దవాఁడు పెద్దలలోఁ గలిసిపోయినాఁడు. చిన్నవాఁడయిన విచిత్రవీర్యునకు సవతిఅన్నయైన భీష్ముఁడు కాశీరాజుకుమారికలను అంబిక, అంబాలిక అనువారిని స్వయంవరములో తెచ్చి పెండ్లిచేసినాఁడు. కాని, అతఁడును సంతతి కలుగకుండఁగనే స్వర్గమునకు వెళ్లిపోయినాఁడు. అప్పుడు యోజనగంధ లేక సత్యవతి యిట్లాలోచించినది. "నాభర్త వంశవృద్ధికై వృద్ధావస్థలో నన్ను పెండ్లియాడి యిద్దఱు బిడ్డలను నాయందు కని చనిపోయినాఁడు! నాసవతికొడుకు గాంగేయుఁడు తనతండ్రికి నన్ను పెండ్లి చేయుటకై నాతండ్రిని సమ్మతింపఁజేయుటకై ఆజన్మము బ్రహ్మచారిగా ఉండెద నని ప్రతిన పట్టి భీష్ముఁడన్న బిరుదును పొందినాఁడు. పెద్దకొడుకు పెండ్లి కాకమునుపే చనిపోయినాఁడు. రెండవవాఁడు సంతానము లేకుండ చనిపోయినాఁడు. ఇంక నింతటితో వంశము సరి యగుచున్నదే! ఏమి చేయవచ్చును?" అని చింతించి చింతించి ప్రొద్దుపోవులు కనుకొను తుద కొక—ఉపాయ మాలోచించుకొని యెట్టులయినను వంశవృక్షము నిలుపఁబెట్టక తీఱ దని, అప్పుడు పెద్దకొడుకయిన వ్యాసుఁడు వెళ్లిపోవునప్పుడు చెప్పినమాటలు స్మరించి యతనిని తలఁచుకొన్నది. అతఁ డప్పుడు బదరికాశ్రమములో తపస్సు చేసికొనుచున్నవాఁడు. అట్లు తల్లి తలఁచుకోఁగానే వచ్చి యామెయెదుటను ప్రత్యక్షమయినాఁడు. అంతవఱకు జరిగిన తనయాపద్విషయమును చెప్పఁదగినది చెప్పి "నాయనా! నీతమ్ముఁడు

వంశాంకురము లేకుండ, అకాలమృత్యువునోటను పడి పోయినాఁడు. కావున తల్లినయిన నామాటయందు గుర్తుంచి యెట్టులయినను తమ్మునివంశము నిలువఁబెట్టుము" అని చెప్పవలసినవిధమున చెప్పినది. వేదవ్యాస భగవానుఁడు మాతృదేవుఁడు గనుక నామె చెప్పినచొప్పున తమ్ముఁడయిన విచిత్రవీర్యుని యిద్దఱుభార్యలతోను సావాసము చేసి ధృతరాష్ట్రుని, పాండురాజును కన్నాఁడు. ఇంకను తమ్ముని—ఉంపుడుకత్తె యయిన భోగస్త్రీ యొకతె ఉండఁగా దాని నేల వదలవలె నని కాఁబోలును! దానికిని ఒకకుమారుని కలిగించినాఁడు. అతండే విదురుఁడు. దీనినిబట్టి ఆలోచింపఁగా వ్యాసుఁడు పుట్టినవెంటనే తల్లితో మాట లాడినట్లును, తల్లితో చెప్పి తపస్సునకు వెళ్లిపోయినట్లును స్పష్ట మగుచున్నది గాదా? కాఁబట్టి, మీకుమారుఁడును పుట్టఁగానే మాట లాడుటలోను, నడిచి వెళ్లిపోవుటలోను సందేహ మేలయుండును ?

ఖండ—ఇంకొక చిన్నవింతముచ్చట జరిగినది చెప్పెదను వినుఁడు. నాకు చిన్నప్పుడొకసకి యుండెడిది. దాని పేరంటెలును ఉమ అందురు. అది నాయందలి స్నేహాతిశయముచేతను నాకొకవిద్య ఉపదేశించినది. తద్విద్యాప్రభావమువలన నేను దేవతలనుగాని, దానవులనుగాని యిష్టమయినవారిని ఆకర్షించి దగ్గఱకు తెచ్చుకొనుచుండెడిదానను. ఒకప్పు డావిద్యవలన సూర్యుని రప్పించుకొని వానితో యథేష్టముగా భోగించితిని. ఇది నిజమని ఒప్పుకొందురా? అట్లైనను నేను సూర్యసమాగమమువలన కాలిపోకుండ నెట్లుబ్రతికి యుండగలిగితిని.

కండరీకుఁడు—అదేమమ్మా! అట్లనుచున్నారు వెనుక నొకప్పుడు కుంతీదేవి సూర్యుని మంత్రబలముచే తన్ను రప్పించుకొన్నది. కాదా? అతనివలన సంభోగమనుభవించినది గాదా? ఆమె కాలిపోనేలేదు సరిగదా కొడుకునుగూడ కన్నది గాదటమ్మా! అట్లే మీరును కాలిపోలేదు. ఇం దాశ్చర్యముగాని, అసంభవముగాని యేమున్నది? సరియా, మీరు చెప్పవలసినది?

ఖండ—ఏమి ఆలాగు తొందరపడుచున్నావు. నాయనా! చెప్పవలసిన ముఖ్యమయిన సంగతు లన్నియును ముందే ఉన్నవి. సావధానముగా వినుచుండుఁడు. నేనింకొకసారి ఆవిద్య వలననే అగ్నిదేవు నాకర్షించుకొని అతనితో సావాసము చేసియుంటిని. గర్భవతి నయినాను. పరమ తేజశ్శాలి యగు పుత్రునికూడ కన్నాను కాని నేను కాలిపోలేదు. ఇట్లయ్యా! అగ్నిస్పర్శ అగుటయూ కాలకుండుటయు ఎన్నఁడయినను సంభవించునా! దీనికికూడ ప్రమాణము చూపఁగలిగిన పక్షమున అందులకై మీలో ఎవ్వరైనను సరియే ప్రయత్నింపుఁడు. లేదా అందఱకును భోజనము పెట్టుటకు నిర్ణయప్రకారము ప్రయత్నింప వలసినదే.

ఏలాషాఢుఁడు—ఓస్సి! ఇదియు నొక గొప్ప సంగతియా? దీనినిసమర్థించికూడ ప్రమాణ మున్నది విననమ్మా! ఒకప్పుడు యమధర్మరాజు భార్య ధూమోర్ణ అనునది హోమము చేయునిమిత్త మగ్నిహోత్రశాలలోనికి వెళ్లినది. సుందరరూపవంతురాలును, తరుణియు నగు నాఁడుదు ఒంటరిగా నగుపడఁగానే అగ్నిదేవుఁడు ~~దానిని~~ జూచి మోహించి కామవికారములకు పాలయినాఁడు. అదియును మదనపరవశంవదురా లయిపోయినది. ఇద్దఱును పిచ్చివాండ్రును పిచ్చిపిచ్చిచేష్టలు చేయుచుండఁగా నింతట ఏమి చప్పుమా, హోమముచేయుటకై వెళ్లినది. ఇంకను రాలేదు? అని భార్యకేదో అపాయము కలిగియుండునని ఊహించి యముఁడును అగ్నిశాలలోనికివెళ్లినాఁడు. ధూమోర్ణ భర్తరాకగని భయపడినది. వెంటనే అది వేఁడి యగ్నిని జలప్రాయముగాచేసి తనకడుపులో దాఁచినది. అయినను ఆసంగతి దాఁగియుండలేదు. తనభార్య శిథిలాంగియు, శిథిలచిత్తయుఁగా నుండుట కనిపెట్టి యముఁడు ఇది యేదో అపరాధము చేసియున్నది. అని నిశ్చయించుకొన్నాఁడు. కాని ఘలానాతప్పు చేసిన దని మాత్రము పోల్చుకోఁజాలకపోయినాఁడు. అతని కప్పుడే దేవసభకు వెళ్లవలసివచ్చినది. మొదలే భార్యపయి సనుమానము గలిగినది. అట్టిస్థితిలో దాని నొంటరిగా నింట విడిచి పోఁగలఁడా? కావున, దానినితనకడుపులో ఉంచుకొని సభకు పోయినాఁడు. అతఁ డట్లు సభలో ప్రవేశింపఁగానే ఏమండీ! యమధర్మరాజుగారూ! మీరు ముగ్గురును కుశలముగా వచ్చినారా? అని దేవతలు వేళాకోళముగా అడిగినారు. అందులకు యముఁడు సిగ్గుపడు

మనుజులమీఁదను మనుజులను పంపించినారు. "సుడిగాలి వీచి వస్త్రము లెగిరిపోయినవి. ఆ విషయమున కూలివాండ్రయందుఁగాని, చాకెతయందుఁగాని యెంత మాత్రమును తప్పు లేదు మహాప్రభూ!" అని నాయింటికి వచ్చినవా రందఱును ఏకముఖముగా రాజుగారితో జరిగినది జరిగినట్లుగా మనవిచేసినారు. రాజుగారును చాల మంచివా రగుటచేతను నౌకరులు చెప్పినమాటలు నమ్మి జాలిగొని "మాబట్టలు ఉదుకువాండ్రందఱును దైవవశమున జరిగినప్రమాదమునకు భయపడి యెందెందో పాఱిపోయినా రని మాకు తెలియవచ్చినది. పాఱిపోయినవాండ్రందఱును మరల నూరిలోనికి రావలసినది. మేము వాండ్ర కేవిధమయినదండనయు విధింపము" అని దండోరా చాటింపించినారు. అదివిని పాఱిపోయినకూలీ లందఱును తమతమయిండ్లకు చేరుకొన్నారు. నేనును లతారూపమును విడిచి యెప్పటిచాకలి రూపముతో ఇంటికి చేరుకొన్నాను. అటుతర్వాతను మాతండ్రి ఆబట్టలు మూటకట్టి తెచ్చుటకై యేటి—ఒడ్డునకు వెళ్లినాఁడు. కాని, అచ్చట మూటకట్టుట కుపయోగించెడి చర్మబంధనమును నక్క వచ్చి తినివేసి పోయినది. అచ్చట నది కనుపడకపోవుటవలన త్రాటికై యడవిలో నాలుగుమూలలను వెదకుచు తిరుగ మొదలిడినాఁడు. అంతట ఒకచోట నొకయెలుకతోఁక కనుపడినది. మాతండ్రి అది తీసి చీరి పెద్ద పెద్ద త్రాళ్లుగా పేని వానితో ఉన్న బట్టలు మూటగట్టుకొని సంతోషించుచు ఇంటికి చేరుకొన్నాఁడు. ఈసంగతి నిజమగునో కాదో సప్రమాణముగా చెప్పుదురుగాక. సత్యమని ఋజువుచేసినపక్షమున సరియే. లేనిపక్షమున భోజనము విషయమున ప్రయత్నించునది.

శంసుఁడు—ఆహా! మీ రన్నట్లు ఋజువుపఱుపఁజాలనిపక్షమున అట్లే ప్రయత్నించెదను గాని, పురాణములలో ఇట్లున్నది. అది మీకు సమ్మత మగునో కాదో వినుఁడు. సంక్షేపముగనే చెప్పెదను. ఈశ్వరుని లింగము తాలూకు తుద మొదలు కనుఁగొనుటకు పోయిన బ్రహ్మ, విష్ణువు తుదకు కనుఁగొనఁజాలకయే తిరిగితిరిగి వచ్చినా రన్నపు డది యెంతపెద్దదో మీరే ఊహించుకొందురు. అదియును కాక, హనుమంతునితోఁక సయితము అదేప్రకారముగా పెద్దది గదా! కనుకనే అతఁడద్దానితో అంతపెద్దది యగులంకాపట్టణము నస్తవ్యస్తము చేయఁగలిగినాఁడు. మఱియు నద్దానితో సంజీవి కొండను చుట్టి నెత్తిపైని పెట్టుకొని మోసికొని వచ్చియున్నాఁడు. ఇంకను రావణునిమిత్రుఁ డగు మైరావణుఁడు రామలక్ష్మణులను మాయచేసి తీసికొని పోవుచున్నట్టు విభీషణుఁడు చెప్పఁగా తోఁకతో క్రిందను పాతాళలోకమువఱకును, మీఁద నాకాశమువఱకును పెద్దకోట యొకటి కట్టినాఁడు. ఒక వానరునితోఁక అంతపెద్దదిగా ఉన్నప్పు డెలుకతోఁక బట్టలు మూటకట్టుటకుమాత్ర ముపయోగించు త్రాళ్లు పేనుటకైనను చాలకపోవునా? ఇందేమి యాశ్చర్యమున్నది. నాకే కాక వేఱొకరికిమాత్రము మీచెప్పిన వృత్తాంతమునకు సందేహ ముండునా? ఉండదు— ఉండదు.

ఖండ—సరియే కాని, నేను స్త్రీరూపమును విడిచిపెట్టి తిర్యగ్జంతువుగాను, లతగాను ఎట్లు మాఱఁగలిగినానో సప్రమాణముగా చెప్పఁగలవా?

శంసుఁడు—నేను ప్రత్యక్షముగా చూచిన దేదియు నుదాహరింపఁజాలను, ఉదాహరించినను మీకు నమ్మకయుఁ గలుగదు. కాన పురాణములలో ఉన్న సంగతియే చెప్పి మీచేత నొప్పించెదను. గాంధారీవరుఁ డొకసారి మనుష్యభావమును విడిచిపెట్టి, కురూపమయిన—ఒకానొక చెట్టుగా మాఱిపోయినాఁడు. మొదట నతఁడు నహుషుఁడను పేరుగల రాజై యుండెడివాఁడు. ఆదినములలో నతఁడు యుద్ధములో దేవేంద్రుని జయించినాఁడు. పరాభవము కలిగినందున నింద్రునకు కోపము వచ్చినది. ఆసంగతి తెలిసికొని బృహస్పతి రాజునకు శాప మిచ్చినాఁడు. అందువలన నహుషుఁ డజగరము (కొండచిలువ)గా మాఱిపోయి వనములోనికి చేరుకొన్నాఁడు. మఱికొన్నాళ్లకు దైవయోగమువలన పంచపాండవులును ఆదేవనములో ప్రవేశించియున్నారు. వారిలో భీముఁడు విహరించుచు పాముండెడిచోట నుండి బయలుదేఱినాఁడు. ఇఁక నేమున్నది? దగ్గఱకు రాఁగానే పాము మ్రింగివైచినది. ఈసంగతి ధర్మరాజునకు తెలిసి పరుగెత్తికొని పామును సమీపించినాఁడు.

పం మతని నేడుప్రశ్న లడిగినది. ధర్మరాజు సరిగా బదులు చెప్పినాడు. అప్పు డాపాము భీముని బయటికి గ్రక్కివైచినది. తాను సర్పశరీరమును విడిచి మరల నహుషుండుగా మారిపోయినాడు. ఈసంగతి భారతాదిగ్రంథములలో నున్నదిగదా! ఇది నిజమయినప్పుడు మీరు లతగాను, తిర్యగ్జంతువుగాను మారుటయు నిజమే కావచ్చునుగదా!

ఖండి—ఓ భూర్లోకసగచక్రవర్తులారా! ఇంకను మీకందఱును నేను చెప్పఁబోవు నొకవింతసంగతి సత్యమే అని అంగీకరించినపక్షమున నేను మీ--అందఱకును విందుభోజనము చేయించుటకు సిద్ధముగా ఉన్నానని నమ్మవలసినది. మఱియు నింకొక్కసంగతి ముందుగానే చెప్పి యుంచుచున్నాను. ఒకవేళ నేను మిమ్ములను నాబుద్ధిబలముచేతను ఓడింపఁగలిగినపక్షమున, మీరందఱును సంసారములో గన్న కిద్దఱు గొప్పవిక్రయింపఁబడియెదరు. అనఁగా ఎందులకును పనికిరానివారయిపోవుదురు. ఏమనఁగా, ఆఁడుదాని కోడిపోయినవారెందుల కుపయోగింతురు?

నలుగురును—అమ్మా, శ్రీమతిగారూ! ఎంతులకంతమాట నోటను రానిచ్చెదరు. స్త్రీలు ముఖచపల లనియు, జనునచపల లనియు ప్రసిద్ధిని పొందియున్నారు. ఇప్పుడు మీ రన్నయీమాట వినఁగానే మీరు ముఖచపల లని మే మనుకొనుచున్నాము. సుందరీశిరోమణీ! మీ కింతొందర కూడదు. మయశంబరమారీచాదులను చంపి పుట్టినమమ్ములను మహామాయాధురంధరుఁడయిన విష్ణుమూర్తివంటివాఁడు సయితము జయింపఁజాలఁడని ఖండితముగా చెప్పఁగలము. అట్టిస్థితిలో మీవంటి—ఆఁడుది, అందును వృద్ధావస్థలో నున్నది జయింపఁగల దన్న నెవ్వరయినను నవ్వుదరే కాక నమ్మెదరా? అసంభవము; అసంభవము; ముమ్మాటికిని అసంభవము. మీరేమి, బుద్ధివైభవముచేత నమమ్ము నోడించు టేమి? అమ్మగారట! ఇటువంటి పెద్దమాట లాడువారిని మాంచియే పెద్దలు గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినదఁట! అని సామెతను వాడ మొదలిడినారు.

ఖండ—ఓహో! అలాగున్నదియా? మీ పెంకితనము మంచిది. అటులేని నే నిపుడే కదిర్చెదను. ఇంకను నేను చేయువేడుక చూడుండి. ఒక్కమాటతోనే మీ నలుగురిని నేను పరాజితులను చేసివైచెదను. అంతటితో మీపురుషత్వము, నాస్త్రీత్వము లోకమునకు తెలియనయ్యెడిని. ఆఁ, వెనుకను గాలికి బట్టలన్నియును నెగిరిపోయినవన్నానే, అప్పుడే నా తాలూకు నౌకర్లు నలుగురు నెండ నెక్కడికో పాఱిపోయినారు. అంతట నేనాబట్టలను నౌకరులను వెదకుటకై రాజాగారి ఆజ్ఞవలన తిరుగుచున్నాను. తిరిగితిరిగి నేఁడిచ్చట మీయొద్దకు చేరుకొంటిని. మీరు నలుగురునే నాపాఱిపోయిన నౌకరులని తెస్సగా పోల్చుకొన్నాను. మఱియు, ఆనావస్త్రములను సయితము మీరే పట్టుకొనివచ్చియున్నారు. ఇపు డొకవేళ మీరు నేనన్న యీమాట నంగీకరింపని పక్షమున, అందఱకును భోజనము పెట్టండి. అంగీకరించితిరేని బట్టలనొంగలును, నాకు దాసులును కండి. ఏమి? మాటలాడరేమి?

ఇట్లామె అన్నమాటలు విని నలుగురు మోసగాండ్రును చాలసిగ్గుపడిపోయినారు. ఏమని బదులు చెప్పుటకును అసమర్థులయిపోయి "అమ్మగారూ! నిజము చెప్పుచున్నాము వినుఁడు. ఈప్రపంచములో మావంటి మోసగాండ్రను లేరని గర్వించుచున్న మమ్ములను జయించినారు. కాఁబట్టి మీకంటెను అధికబుద్ధిమతు లుండఁబోరని మే మంగీకరించుచున్నాము. ఇఁకనయినను దయతలఁచి మీ రెట్టులయినను సరియే, అందఱకును భోజనము పెట్టించి పుణ్యము కట్టుకొందురుగాక. ఏమందురేని, ఏడురోజులనుండి సంతతధారాపాతముగా వర్షము కురియుచుండుటవలన భోజనము దొరకక మే మందఱమును క్షుద్బాధాపీడితులమయి యున్నాము. మాఅందఱప్రాణములును కంఠగతములయి యున్నవి. ఇంకను మీరాలస్యము చేసినపక్షమున గడియలో నెగిరిపోక మానవు. ప్రాణదానముకంటెను వేఱుపుణ్యకార్యముండునా?" అని దానిని కొనియాడినారు. ఖండవతి తన్నీప్రకారముగా పొగడుటచేతను, నలుగురుధూర్తులును చేతులు జోడించుకొని ఆమె చెప్పినట్టులు చేసి ప్రార్థించుటవలనను ప్రసన్నచిత్తురాలయి తత్క్షణమే శ్మశానమునై పుబయలుదేఱినది. అక్కడకుపోయి నలువయిపులను చూచునప్పటి కెనోన్నిశవము లగపడినవి. అందుండి తెత్తొక్కలమే యని

పోయిన బాలశవము నొకదానిని బయటికితీసికొని స్నానదికి తీసికొనిపోయి స్నానము చేయించి తనమూటలోనున్న వస్త్రములా శవమునకుకట్టి తిన్నగా రాజనీపట్టనములోనికి తీసికొనిపోయినది. ఆయూరిలో ఒకవర్తకుఁడు మిగుల ధనముగలవాఁడు. నానాప్రకారములయిన తనవ్యాపారసంబంధమయినపనులలో నిమగ్నచిత్తుఁడై యున్నాఁడు. అంతట వానిలోగిటియొద్ద కాశవమును తీసికొనిపోయి నిలఁబట్టి తనచేతులతో పడిపోకుండ గట్టిగా పట్టుకొని దీనస్వరముతో "అయ్యా! సెట్టిగారూ! నే నొకబ్రాహ్మణస్త్రీని; నిరుపేదరాలను; అనాథను. నా కెవ్వరును దిక్కుదెస లేదు. తమరు నాయందు దయ తలంచి యేమయినను ఇప్పించెదరేని నే నీబాలుని పోషించుకొందమన్న ఆశచేతను, ఇట్టిసమయమున తమలోగిటికి వచ్చియున్నాను. బాబూ! దయచేయండి. దిక్కుమాలిన పక్షిని. కాలము వర్షకాలము. బయటికి తిరిగి ముష్టి యెత్తుకొనుటకైనను వీలు చాలకుండ నున్నది" అని యేమేమో అనుట కుపక్రమించినది. సెట్టిగారి కిట్టిదీనాలాపములు వినుట కవకాశ మెక్కడ నున్నది? తనపనులలో తాను పడి కొట్టుకొనుచున్నాఁడు. ఎంతసేపున్నను పోయినదిగాదు. రేపు రమ్మన్నాఁడు. అయినప్పటికిని కదలినదిగాదు. నయమున చెప్పినాఁడు; భయముపెట్టినాఁడు. ఏమిచేసినను పోనందున సెట్టికి కోపమువచ్చినది. వెంటనే నవుకరు నొకనిని పిలిచి "దీనిని బయటికి గెంటివేసి రమ్ము." అని ఆజ్ఞాపించినాఁడు. వాఁడును తనయజమానుని సెలవుప్రకారముగానే దానిని బయటికి గెంటుట కుపక్రమింపఁగానే దానిపట్టువదలి శవము క్రిందను పడిపోయినది. ఇఁక నేమున్నది? అంత నాయమ్మ నోరు బారు చేసి రోదన మారంభించినది."

"నాప్రాణములకంటెను ప్రియమయిన నాయేకమాత్రపుత్రకుని ఈ సెట్టి ధనమదాంధుఁడై కన్నులు గానక నౌకరుచేతను చంపించివేసినాఁడు దైవమా! నా కింక నేది దిక్కు? నే నెక్కడికి పోదును? ఎవరు నాదుఃఖ మాలించువారు. ఓపంచభూతములారా! ఈ సెట్టి నావిషయమున చేసినయీచెట్టపనికి మీరే సాక్షులు. ఇంక నా ఆశ లన్నియు నడుగంటిపోయినవా? నామహారత్నము మంటిలో కలిసిపోయినదా! నామనోరథములు మండిపోయినవా! దైవమా! నే నేజన్మములో ఏమి పాపముచేసినానుతండ్రీ! భర్తచనిపోయినందులకేయేడ్చుచుండఁగా, ఈదుఃఖముకూడ తెచ్చిపెట్టినావా? ఏమోకష్టకాలమువచ్చినదే, ధనవంతుఁడే, ధర్మాత్ముఁడే, యేమైనను ముష్టి వేయకపోవునా? అనునమ్మికచేతను వచ్చినందులకు నా కిదియా ఫలము కలిగించినాఁడీసెట్టి?" అని యేమేమో నోటికి వచ్చినట్లెల్ల ప్రేలుచు, ఏడ్చుచు, నెత్తి, నోరు మొత్తుకొనుచు, గుండెలు బాదుకొనుచు నానావిధములుగా అల్లరి చేయమొదలిడినది. ఆయీసంగతు లన్నియు వినఁగానే కోమటయ్యకు భయము పుట్టినది. పాపము! అతఁ డిట్లాలోచించుకొన్నాఁడు. "ఏమో చాలప్రమాదము జరిగినది. ఇది సామాన్యముగా పోవునది గాదు. హత్య జరిగినది పాపము! నిజముగానే ముష్టికి వచ్చినదీనికొడుకు చచ్చిపోయినాఁడు. ఇది యీసంగతి పోయి రాజుగారితోఁగానీ మనవి చేసికొన్నపక్షమున నన్నెంతయేని దండింపకమానఁడు. ముదలే రాజుగారికి నేను ధనవంతుఁడనని కోపముగా ఉన్నది. ఇట్టిసందు దొరకినపిమ్మట నెట్లు శిక్షింపవలయునో, అట్లు శిక్షింపకమానఁడు. ఏమిదారి భగవంతుఁడా? ఏమయినను ఇచ్చి ముదటనే దీని నేల పొమ్మనకపోతిని? మించిన దేమో మించనే మించినది. ఇంక నెంత చింతించినను లాభము లేదు" అని యాలోచించుకొని సెట్టి తనపరివారసహితముగా దానిని దగ్గఱకు పిలిచి మంచిమాటలాడి, సానుభూతి చూపుచు "అక్కగారూ! కాఁగలకార్యము నెవ్వరును తప్పింపఁజాలరుగదా! భగవంతుఁడు మీబిడ్డని కింతే ఆయువు లిఖించియున్నాఁడు. ఏజన్మాంతరకర్మశేషముచేతనో మావాకిట మృతి సంభవించినది. మీరుగాని మేముగాని యిప్పుడేమి చేసినను మీబిడ్డఁడు మీకు బ్రదికి లభింపఁడుగదా? కావున నెంతయేడిచిన నేమిలాభమున్నది; మీ కేమయినను ధనము కావలసినచో కావలసినంత యిచ్చెదను పుచ్చుకొని మాఱుమాటాడకుండ నెందేని వెళ్లిపోయినచో చాలసంతోషించెదను. నేను సంపన్నగృహస్థుఁడను. నన్ను వ్యర్థముగా రచ్చకీడ్చినందువలన మీ కేమిలాభ మున్నది? బ్రదికియున్నంతవఱకును ముష్టి నష్టి అక్కఱలేకుండ సుఖజీవనమునకు సరిపడు ధన మిచ్చెదను. గుడ్డిలో మెల్ల అనుకొని సంతోషించండమ్మా! మీ పాదాలకు నమస్కారము చేసెదను. మాయిల్లు నిలువ

బెట్టుండమ్మా! మీ సోదరునిగా భావించండమ్మా!" అని యేమేమో దీనాలాపము లాడును దానిని పాదములు పట్టుకొని బ్రతిమాలుట కుపక్రమించినాడు. అతఁ డన్నమాట లన్నియు విని మరల ఏడ్చుచు, తుట్టతుద కెట్టులో ధనము పుచ్చుకొని వెళ్లిపోవుట కంగీకరించినది. వెంటనే సెట్టి దీనికి కోరినంతధన మిచ్చి మఱియును తనవ్రేలినున్న రత్నఖచితమయిన ఉంగరముకూడ దానికి బహుమానమిచ్చి యీవార్త యెక్కడను చెప్పకుండ దానిచేతను ప్రమాణము చేయించుకొన్నాఁడు. ఆమోసకత్తియ తనయిత్తు సాగినందులకు లోలోపల సంతోషించుచు సెట్టియిచ్చినధనము, వాని విలువయయిన ఉంగరము పట్టుకొని మోసగాండ్రు బసచేసియున్న ఉద్యానవనములోనికి వచ్చి వారికి తాను తెచ్చిన యావత్తువిత్తమును చూపించి "మా చితిరిగదా! నా నేర్పు, ఈధనముతో మన మెన్నిదినములయినను భుజింపఁగలముగదా! మోసగాండ్ర మని గర్వపడుచున్న పురుషులారా! ఇప్పుడయినను ఆఁడుదాని దగ్గఱ పురుషులెందులకును పనికిరా రని యంగీకరించెదరా? మాటలు వేఱు, చేఁతలు వేఱునని యిప్పటికయినను అనుభవమునకు వచ్చినదా?" అని చెప్పి ధన మిచ్చి వారిని బాజారునకు పంపించి వలయుసామగ్రి తెప్పించి యందఱకును యథేష్టముగా విందుభోజనము చేయించినదాసుందరి. అధూర్తులందఱును కొన్నిదినములనుండి యన్నములేక పలుమల మాఁడుచుండుటచేతను తృప్తిగా భుజించి "జే! అన్నపూర్ణాదేవీ!" అని దానిని స్తుతిచేసి యెవరిదారిని వారు పోయినారు. కథలు కంచికి వెళ్లినవి, మనము మనయింటనే ఉంటిమి.

పరిశిష్టము—శ్రీభారతీపాఠకులగు నస్మదాంధ్రసోదరులారా! నాకుఁ జిరకాలమునుండి హిందీగ్రంథములను, జైనమతగ్రంథములను జగువుటయం దాసక్తి మెండు. ఒకప్పుడు జైనపుస్తకసూచీపత్రములో "ధూర్తాఖ్యానము—ఒక శ్వేతాంబరభిక్షువురచించిన సంస్కృతపుస్తకమునకనువాదము. ఇందులో హైందవపురాణములగుట్టు బట్టబయలు చేయఁబడినది. చదువునప్పు డుపన్యాసము(నవల)కంటెను మించిన రుచికలదై యుండును" అనియున్న జైనహిందీపుస్తకమును తెప్పించి చదివి సంతోషించి నా ఆంధ్రసోదరులయిన మీరును చదివిసంతోషింతురు గాక యని యీప్రకారముగా వ్రాసి భారతిచేతను మీసన్నిధికిఁ బంపుకొన్నాను. ఇటుపయిని "శర్మగారి గుళ్లేలుచ స్తరము" పంపుకొందును.

# గాజుల సెట్టి

మునిమాణిక్యం నరసింహరావు గారు, (సాహిత్యసమితి)

ఆమె

దింపుకొనుము మలందరము తిన్నగాను
పచ్చగాజులు నా కేమి నచ్చలేదు
తేనెగాజుల నేస్తము తెచ్చినావ?
మోజు పుట్టెను వంకుల గాజులపయి.

ఆయన [తనలో]

మోజు పడ్డది వంకుల గాజులపయి!
ఒత్తకుండగ తోడుగుమీ గుత్తముగను
గట్టిగా పట్టుకొనఁ గోయి కాంతకరము
అధికసుకుమారమోయి ఈ యతివపాణి!

పెట్టుకొన్నది చాచుక్క బొట్టు నొసట
కట్టుకొన్నది రంగులకంచిచీరె
పెట్టుకొన్నది మొగలిపూల్ చుట్టలోన
కూరుచుండెను తిన్నెపై కులుకులోప!

ముద్దు లొల్కెను సుమ్మి యీ ముదిత వాక్కు
అతివతో నేదియైన మాటాడు మోయి
సెట్టి, తరుణము నేల పోగొట్టెదోయి!
పలుకుపల్కెన తేనియ లొలుకు నోయి!

సెట్టి, నీ వెంతయో చేసి పుట్టినావు!
ఎంత యత్నించినను నాకు నెపుడు చిక్క
నట్టి మృదుపాణి నీ విట్టె పట్టినావు!
ఓహో! ఎంతటి ధన్యుడ వోయి నీవు!

న్యాయవాది యగు
...ద్దియో వ్యవహారము నిమి
...తులు వేంకటప్ప
...సచేసినాఁడు. నరసిం
...చ్చినపని యైనది. కక్షిదారు
...డివా రక్కడ కేగినారు. మను
జుల మొగము లేర్పరుపరాకుండ కనుచీఁ
కటిపడినది. గుంటూరునం దున్నచోఁ
బురమందిరముననో, యువజనసంఘసద
నముననో మిత్రులతోఁ గలసి ముచ్చట
లాడు సమయ మది నరసింహారావునకు.
కాన నేమియుఁ దోఁచక చేతనున్న
యాంగ్లవార్తాపత్రికను దీసి చదువ నుద్దే
శించి దీపముదెస చూచినాఁడు. ఎఱ్ఱకి
రోసిన్ నూనెపోగకు చిమ్నియంతయు
దట్టముగా మసిగమ్మి యసహ్యము గొ
లుపుచున్న దాదీపము. నరసింహారావున
కాదీపముముందర చదువుకొనుటకు బుద్ధి
పుట్టలేదు. అంత చదువుకొను ప్రయత్న
మును విరమించి "యీ పల్లెటూళ్లువచ్చిన నేమియుఁ
దోఁచదని లోలోన గొణుగుకొనుచు, నోడిలో నుంచు
కొనిన వార్తా పత్రికపై రెండుచేతుల నిడి పడుకకుర్చీపై
చేరగిలబడి యటునిటు వ్యర్థముగాఁ జూచుచు కూర్చు
న్నాఁడు. విశ్రాంతిగాఁ గూర్చుండుటచే నెదుటివస్తువు
గోచరముగానంతటి యాలోచనాసమాధిలో నిలిచినది
నరసింహారావు మానసము. ఈవిధముగా నొక్కగంట
గడచినది. ఇంతలోఁ దనచరణముల నెవరోస్పృశించినట్లు
తోఁచుటచే చప్పున చేరఁగిలబడియున్న నరసింహారావు
నిలువునఁ...
స్త్రీ తనపాదములపై ...
నోడుచు నరసింహారావు "ఎవరమ్మా
నీవుఁడు" అనెను.



"మీ ప్రథమభార్యను జానకిని"

"పాదముల నంటరాని పరురాలనుగాను"

పరురాలుగాక తనపాదము నంటుట కర్హురా లగు నాయింతి యెవరు? నరసింహారావున కేమియుఁ దోఁచలేదు. అనాలోచితముగా నప్రయత్నముగా "అయిన నీవెవ్వరు?" అనువాక్య మాతనినోటినుండి వెలువడినది.

"మీప్రథమభార్యను జానకిని" అని యిట్లు వచి యింపుమండగనే యామె కన్నీటిచే నరసింహారావు పాదములు కడిగినట్లయినవి. నరసింహా

...ట్టి వైద్యము

...మము నయముచేయించు

...ను యింటికిఁగూడ బంపలేదు. ఆ కన్నులలో నిప్పుడు పువ్వులు పుట్టినవి. ఎదుటి వస్తువు కనుపడుటలే దిప్పుడాపిల్లకు; ఇంక గొన్నాళ్లకాపిల్లకు వెలుగుగూడ కనుపడని స్థితివచ్చునని యందఱు చెప్పుచున్నారు. ఇక వైద్యము చేసినను లాభము లేదనికూడ చెప్పుచున్నారు. ఆ రోగమట్టిది. ఈ గ్రుడ్డి పెండ్లము నీ కెందులకు? ఆపిల్ల యిక పుట్టినింట తల్లిదండ్రుల ప్రాపున బడియుండవలసినదే. కాన నీ కొక మంచి సంబంధము కుదిర్చితిని. పిల్ల చక్కని చుక్క; మామ ధనికుడు. దశమి నాడు వివాహముహూర్తము" వెంట నెరమ్మని తండ్రి వద్దనుండి జాబు వచ్చినది. మతి హీనతయో, చిన్నతనమో, పితృభయమో, ఏమైననేమి నరసింహారావు నిజానిజములు పరికింపలేదు. యుక్తాయుక్తతలు యోచింపలేదు. ధర్మాధర్మములు విమర్శింపలేదు. తండ్రి చెప్పినవేళకు వచ్చినాడు: మరల నాలుగు సంచులు యింట కుమ్మరించినాడు; అయిదు దినములు పల్లకిలో నెక్కి యూరేగినాడు. ఎప్పటివలె చదువునకు వెళ్లిపోయినాడు.

క్రమముగా నరసింహారావు బి. ఏ., బి. యల్. పరీక్ష నిచ్చినాఁడు; ప్లీడరైనాఁడు; చిన్న భార్య కాపురమునకు వచ్చినది; తండ్రి రాలిపోయినాఁడు; తానే స్వతంత్రుఁడైనాఁడు. ప్రజ్ఞగల ప్లీడరని పేరుపొంది వేలకు వేలు ధనము గడించినాఁడు. మేడలు కట్టినాఁడు; భూములు కొనినాఁడు; బ్యాంకులు నింపినాఁడు; నగలు చేయించినాఁడు; మోటారుబండి కొనినాఁడు; ముగ్గురు

...కండ్లజబ్బు న...

"నా క...

'నీ కండ్లలో ...

గాదా? మీ నాయనగారు ...

...టయేకాక మా నాయనగారు "మా ...మేము బాగుచేయించుకొందు"మనినపంప...

"నా కన్నుల కెప్పుడట్టి దురవస్థ పట్టలేదు'

"అయిన మా తండ్రిమాట యబద్ధమా?"

"అబద్ధమే."

"నీ కేవ్యాధియు లేక సుఖముగా నున్నచో మా తలిదండ్రులు నాకు మరల వివాహమేల చేయుదురు?"

"పునస్సంధానకట్నము వేయునూటపదాఱులు మా తండ్రి యీయజాలననుటచే."

నరసింహారావు సంభ్రమాశ్చర్యములను లోనై నిశ్చేష్టుఁడైనాఁడు. కట్నముల దురాగత మెఱుఁగును! తండ్రి లుబ్ధత్వ మెఱుఁగును. నిజముగ కట్నమునకై వారిని పీడింప, వారు కాదన, తండ్రి యీ మాయాజాలమునుబన్ని తనకు మరలవివాహము చేసియుండవచ్చును. ఇందబద్ధమేమున్నది? సంశయహేతు వేమున్నది? ఇట్లు తలఁపగనే సిగ్గుచేతను విచారముచేతను నరసింహారావు క్రుంగిపోయెను. 'ఎంత విచారపడిన నేమి, గత జలసేతు బంధనము'అని నరసింహారావునకుఁ దోఁచినది. ఆ పాప పరిహారార్థముగా భార్యనిప్పుడు సాంత్వనవచనముల నుపలాలించుటకుఁ దన చిత్తమునకు స్వాస్థ్యము లేదని నరసింహారావు భావించెను. కాన "జానకీ; నేను నీకు

మహోపకారము గావించితిని. నీవు పతి పరిత్యాగినివై యల్లాడుచుండ నేను మహా భోగములతోఁ దులఁదూగుచుంటిని. ఏ సుఖసమయమునందైన నిన్నుఁ దలపెట్ట నైతిని. నీవు జీవితవై యుంటివో లేదో గమనింపనైతిని. తలిదండ్రులయందు విధేయుఁడను, విశ్వాసము గలవాఁడను నై వారు చెప్పిన చొప్పున వర్తించితిని. అవిమర్శత నాదోషమే యగును. కాని యా ద్వితీయ వివాహకాలమునకైన నేను విశేషము పెద్దవాఁడను కాను. ఇది బాల్యవివాహ పాపఫలము. అయినను నీయెడ నేచేసినపాప మనంతమని యొప్పుకొనెదను. కాని యిది యంతయు నేను బుద్ధిపూర్వకముగాఁ జేసినదిమాత్రము కాదని విశ్వసింపగోరెదను. నీకును నాకును నవ్యక్తావస్థ యందే వివాహ మైనది. మరల నన్ను నీవెఱుఁగవు. నిన్ను నే నెఱుఁగను. కాల మిట్లు గడచినది. అయిన దేమో యైనది. కడచినదానికి వగచిన లాభము లేదు. నీజీవనాధారవిషయమై నేను విస్మరించి యూరుకొనుట మహాపరాధము. కాన నీకు సాలుకు నాలుగువందల రూప్యములు వచ్చు పల్లపుభూమిని నీ యిచ్ఛానుసారముగ ననుభవించునట్లు వ్రాసియిచ్చెదను. చాలునా?"

"నాభుక్తికిజాలిన యాస్తిని నాజనకుఁడే నా కొసగిపోయెను. లేదా? ఏకైకపుత్రికనగు నాయవస్థకు దురపిల్లి దురపిల్లి నాతలిదండ్రులు మరణించిరి. నన్ను బోషింపవలసిన మీరు వదలిపెట్టితిరి. కాన మాతాపితృహీనను, పతిపరిత్యక్తను, సంతానహీనను, తిన దిండి లేక మరణించినను నాకొఱకు దుఃఖించువా రెవ్వరు? నాకేందులకు ధనము? సభర్తృకకు భరణమా? నిత్యము వేయిన్యాయముల దిద్దెడు న్యాయవాదులకు తమ రిట్లు వచించుట న్యాయమా?"

జానకినోటినుండి వెలువడినవి మాటలో నిశితశరములో నరసింహారావు యేర్పఱుపఁజాలక పోయెను. ఆ శరముల వ్రేటుల కాతని హృదయనాళము లే తెగినట్లయ్యెను. పరవ్యవహారములలో నతిచాకచక్యముతోఁ బ్రసంగించెడు నరసింహారావు నోటినుండి మాటలే వెలువడకుండెను. చాలసేపున కతిప్రయత్నముతో, గంపితస్వరముతో, "అయిన నీకేమికావలె" నని యాతఁ డడిగెను.

"మీచరణసేవ."

నరసింహారావు మరల నొకపరి స్తబ్ధుఁడయ్యెను. మాటాడలేదు. యేమిమాట్లాడును? రెండవభార్య కాఁపురమునకువచ్చి ముప్వురుబిడ్డలతల్లియై గృహయజమానురాలై యింటనున్నది. తనతల్లికిని భార్యకును బొసఁగక నిత్యజగడము లాడుచున్నారు. అట్టిచో నీభార్యను గూడఁ దీసికొనిపోయి యెక్కడయుంచును? తీసికొని వెళ్లినచో నామె యూరుకొనునా? ఆమె యేమైనఁగాని మాటలాడినచో నీమెపడునా? అన్నిబాధలలో నుభయపత్నీబాధవంటి బాధలేదని పెద్దలందురుగదా! అట్టిచో నిట్టిబెడఁద చేఁజేత నెట్లు తెచ్చిపెట్టుకొనును? లేదా? "మీచరణ సేవ" యని దీనాననయై యాచింపుచున్న యిల్లాలిని నిష్కారణముగాఁ ద్రోసిపుచ్చుటెట్లు? ఈ తర్కవితర్కములతో నరసింహారావు మానసము సంక్షుభిత మయ్యెను. కోమలహృదయుఁడగు నాతనికి భార్యను దీసికొనిపోవు ధైర్యముగాని, నిరాకరించు కాఠిన్యముగాని లేదయ్యె. కాన నాతఁడు కలఁగఁబాఱిన చిత్తముతో జాలిగొలుప నిట్లు పలికెను.

"జానకీ! నేను మరలఁ బెండ్లాడిన సంగతి నీకుఁ దెలియునుగదా!"

"తెలియును."

"ఆమెయిడ పదేండ్లనుండి కాఁపురము సేయుచు గృహయజమానురాలును, బిడ్డలతల్లియు నై యున్నది. న్యాయము వచింపఁదలఁచినచో మఱి నీవుగూడ యట్టిదానవే! కాని యొకయొఱలో రెండుకత్తు లిముడునా? నిన్ను కాదనుట గాదు. నా మనోగతాభిప్రాయము తెలుపుచుంటిని. నీవే చెప్పుము!"

"ఒఱలో బూర్వమేకత్తియున్నదో, ఆకత్తియే సర్వదా ఉండవచ్చును. కాని స్వామీ! బుద్ధితెలిసిన నాటనుండి పతివిముక్తనుగానే యుండుటచే నన్ను జూచినవారెల్ల "అదిగో! మొగుడు వదలిపెట్టిన పిల్ల" యని వ్రేలజూపువారు. ఆవాక్యము నాకెంతయో యవమానకరముగ నుండెడిది. ఆయవమానవాక్యమునకు వెఱచి యిరుగిల్లెఱుగ; పొరుగిల్లెఱుగ; బంధుగృహమెఱుగ; పెండ్లిపేరంటము లెఱుగ; వేడుక లెఱుగ; వినోదము లెఱుగ; చక్కనిచీరరవిక లెఱుగ; అందమగు నాభరణము లెఱుగ; వేయేల? దొడ్డియందు విర

బూసిన పువ్వులనైన దలను దురుము పెఱుఁగ; అగ్రాహ్యస్థితిలో మీరుకట్టిన కంఠసూత్రమునకు బద్ధురాలనై గ్రాహ్యత వచ్చినది మొదలు మగడు వదలిపెట్టిన పిల్ల' అని లోకులను నవమానవాక్యమునకు వెఱచి సర్వసుఖములపరిత్యజించి,సన్యాసినినై, జీవచ్ఛవమునై బ్రదుకుచున్నాను. నాథా! మీయింట వంటకత్తెగానైన బరిగ్రహించి వాకిలియూడ్చు దాసిగానైన జేపట్టి నా యపయశము బాపరా? నన్ను తోడిమానినులతోపాటు తలయెత్తుకొని తిరుగునట్లు చేయరా?"

తన పాదములపై వేగముగాఁ బడుచున్న కవోష్ణ బాష్పధారలచే జానకి తీవ్రముగా నేడ్చుచున్నట్లు నరసింహారావు గ్రహించెను. జానకి శోకాగ్ని నరసింహుని హృదయమును వెన్నవలెఁ గరఁగించెను. ఇఁక నవునుగాదనుట కాతనికి నోరాడలేదు. అంత నాతఁడు కనుల నీరు గారుచుండ గద్గదకంఠుఁడై "జానకీ, శోక ముడుగుము. ఈపు నిన్ను నా యింటికిఁ దీసికొని వెళ్లెద" నని పలుకుచుఁ జిరభర్తృవియోగవ్యథచేఁ గృశించి చర్మాచ్ఛాదితాస్థిపంజరమువలె నున్న జానకిని తన పాదములపైనుండి రెండుచేతులఁబట్టి లేవఁదీసెను.



"యేవూరమ్మా మీది"

## ౨

జానకీ సహితుఁడై మోటారుబండిపై నెక్కి నరసింహారావు ఉదయ మెనిమిదిగంట లగుసరికి గుంటూరులోని స్వగృహమున కేతెంచెను. మార్గమధ్యమున జానకికిని,దనకును జరిగిన పరస్పర సంభాషణలోఁ దాను బసచేసిన గృహము జానకి మేనమామగారిదని నరసింహారావు తెలిసికొని యక్కజమందెను. 'దైవ ఘటన చిత్రముగదా!' అనుకొనెను.

నరసింహారావు బండి దిగగనే తమనౌకరుతో నీమెను లోనికిఁ దీసికొని పొమ్మనిచెప్పి తాను కచ్చేరి* సావడిలోనికి వెళ్లెను. నౌకరు త్రోవచూప జానకి లోపలికి వెళ్లెను. నరసింహారావు చిన్నభార్యయగు సుందరి యప్పుడు కాఫీ త్రాగుచున్నది. నరసింహారావు తల్లి నాఁడేకాదశి యగుటవలనఁ గోడలిపైఁ గోపముచేఁ బనివారలచేఁ బిండి విసరింపక తానే స్వయముగ విసరుకొనుచున్నది. జానకిని సుందరి యెఱుఁగనే యెఱుఁగదుగదా! అత్తగారైన గుర్తుపట్టలేదు. కాన తేఱిపాఱఁ జూచుటయేకాని జానకి నొకరును బలుకరింపలేదు. సుందరి సహజముగా గర్వితమతి; చేయిత్రిప్పకుండ, కాలు కదపకుండ, మెడ తిరుగకుండ నగలున్నవారి నేకాని సాధారణులైనవారి నావిడ పలుకరించుటకాని పలుకుటకానియుండదు. కాన జానకికి సుందరి సత్కారభాగ్యము గలుగలేదు. పనిమిటితో వ్యాజ్యవ్యవహారములకో, లేక తమయింట పనిపాటులు చేయుటకో వచ్చిన స్త్రీనిగా సుందరి భావించెను. కానమాటియుఁ జూడన ట్లూరకొనెను.

జానకి గోడనానుకొని నిలుచఁబడియే యుండెను. ఎవరు కూర్చుండుమనలేదు. కొంతతడ విట్లుగడచినవెనుక నరసింహారావుతల్లి జానకివంకఁజూచి "యేవూరమ్మా మీది" యనెను. మాటమందలింపులులేక తా నిలిచి యున్నస్థితి జానకికి మిక్కిలి దుస్సహముగను, దుఃఖకరముగను నుండెను. అత్తగా రట్లు ప్రశ్నింపగనె జానకికి మఱింతదుఃఖము వచ్చెను. అంత నామె పైఁటచెఱఁగునఁ గన్నీరద్దుకొనుచు "బ్రాహ్మణకోడూరు" అనెను. పిచ్చమ్మగారికిఁ బూర్వస్మృతి గలిగినది. జానకిదెస తేఱిపాఱఁజూచి "అమ్మాయీ! అట్లు నిలుచబడితి

వేమి? కూర్చుండు"మనెను. జానకి నెమ్మదిగాఁ గూర్చుండెను. అంత "మీయమ్మయు నాయనయు బాగుగా నున్నారా" యని పిచ్చమ్మ ప్రశ్నించెను. "వారిద్దఱు పోయిరి. నేనుమాత్రమె చావక నిలిచియుంటి"నని జానకి మఱియొకమారు కన్నుల నీరునించెను. "ఏడువకమ్మా! పెద్దలుగనుక వారు దాటిపోయినారు. మూఁడేండ్ల దానవు. నీకేల యంతమాట యనుకొనవలెను? ఏకాలమున కేమియదృష్టము గలుగనున్నదో! అందఱు నీవంటివారు కారా? నీవందఱివంటిదానవు కావా?" అని పిచ్చమ్మగారు సుందరిపైఁగల యీసును జానకిపైనను గ్రహముగా మలిపి యూఱడించినది.

నరసింహారావు పెద్దభార్యను దీసికొనివచ్చిన సంగతి యింటిలోని పనిపాటులవారికిఁ గాదుగదా, యిరుగుపొరుగువారికిఁగూడ క్షణములోఁ దెలిసిపోయినది. ఒక్కొక్కరేదియో పనిగల్పించుకొనివచ్చి జానకిని జూచి 'చెంపకు చేరెడుకన్ను లున్నవే! గ్రుడ్డిదని చెప్పుకొన్నా రేమికారణమో!' యనియు, 'సుందరికన్న నీమెయే చక్కగా' నున్నదనియు, లోలోన గుసగుసలాడ నారంభించిరి. 'ఆగ్రుడ్డితన మెట్టిదియో' యని కొందఱు మరలమరల వచ్చిచూచి సందేహనివృత్తి చేసికొనుచుండిరి. వచ్చిపోవువారి గుసగుసలు, అత్తగారి కుశలప్రశ్నలు, సుందరి మది కొకింత యాందోళన గలిగించెను. పెనిమిటివచ్చిన నాతని నడిగి సందేహనివృత్తి చేసికొనవలయు నని యెదురు చూచుచుండెను. సిగ్గుననో, భయముననో, నరసింహారావు నాఁడు యెంతసేపటికి లోనికి రాలేదు. పదిన్నరగంటలయిన వెనుక నరసింహారావు అడావిడిగా లోనికివచ్చి స్నానముచేసి భోజనమునకు వెళ్లెను. భోజనముసేయుచు నరసింహారావు తల్లితో జానకిని బిలిచి భోజనము పెట్టవలసినదని చెప్పెను. నరసింహారావు భోజనముచేసి గదిలోనికి వెళ్లు సరికి నాకులు పోకలు చేతఁబట్టుకొని సుందరిగూడ యటకువచ్చెను.

ఉదయమునుండి సుందరి మానసము తుపాను రేగిన సముద్రమువలె సంక్షుభితమగుచుండెను. వచ్చిన యా విడ తన సవతియై యుండునని సుందరి కనుమానము గలిగినది. కాని రూఢికాలేదు. ఎవరినడుగును? ఎవరి నడిగిన సవతియని చెప్పుదురో? అని సుందరి భయము; సవతియను పేరు తలఁచుటకే, వినుటకే, చెప్పుటకే యామెకు దుస్సహముగ నున్నది! అట్టిచో నితరుల నడుగునా? అయ్యో! సిగ్గు! సిగ్గు! అందువలన భర్తనే యడిగి యనుమానము తీర్చికొనవలెనని సుందరి తలఁపు; కాని నరసింహారావు ఉదయమునుండి కంటికే యగుపడఁడయ్యె. ఏమి చేయును? ఎట్లో మనస్సు బిగబట్టుకొని యూరకొనినది. సుందరి హృదయాందోళనము మొగమున స్పష్టముగఁ గాన్పించుచున్నది. నరసింహారావు భార్యస్థితిని బరికించినాఁడు. తనపై వాడిబాణములు ప్రయోగింపఁబడ నున్నవని యనుకొన్నాఁడు. మాట్లాడకుండ నూరకున్నాఁడు. నరసింహారా వేమైన ప్రసంగించునేమో! ఆ సందర్భమున నడుగవచ్చునని సుందరి యనుకొనెను. కాని నరసింహారావా ప్రస్తావనయే యెత్తఁడయ్యె. పైపెట్టుకోటు తలపాగ వగైరా ధరించి కచ్చేరికిఁబోవ సిద్ధమగుచుండె. సుందరి యింక భరింపలేక పోయెను. గ్రుడ్లనీరు రెప్పల నప్పళించుచు "ఆ వచ్చినయామె యెవ"రని భర్తను బ్రశ్నించెను. "నా ప్రథమభార్య" యనెను నరసింహా



"ఆ వచ్చినయామె యెవ"

రావు. సుందరి కామాట తలపిడుగైనది. హృదయము కంపించినది. కన్నుల నీళ్లు గ్రమ్మినవి. మొగము వెల్లనైనది. ఒడలునఁ జిఱుచెమటలు గ్రమ్మినవి. అవయవ

ములు పటుత్వముదప్పినవి. నిలువఁబడుటకే యసమర్థురాలై నేలఁగూలఁబడినది. సుందరి దైన్యావస్థ నరసింహారావు గమనించెను. "సతులకు సవతులన్న నెంతభీతి" యనుకొనెను; నెమ్మదిగా నామె నూరడించువాఁడై "సుందరీ ఏల నీకింత విచారము? సవతి యనినంత మాత్రముననే ఆవిడకై నీవింత భియపడవలసి యవసరము లేదు" అనెను. నరసింహుని యుపలాలనవాక్యములచే సుందరి కొకింత జడుపు దీరినది. కోపము హెచ్చినది. కాన భర్తదెస తీవ్రముగఁ జూచుచు, "ఏమి! నేను జడియవలసినపని లేదా? పదునైనకత్తినిగంతముపైనిడి భయము లేదందురేమి? అవును, మీకేమి భయము? పదిమంది భార్యలనైన బోషింప సమర్థులు. ఇంట తలలుగూడక చచ్చునది యాడువారు గాని మగవారి కేమి?"

"ఎందుల కీయుపన్యాసము?"

"నాశోకాలాపములు మీ కుపన్యాసములుగా నున్నవా?"

"కాక యిదేమిగోల?"

"అనిన మీకు గోపమువచ్చునుగాని మీరు చేసినపని బాగుగ నున్నదా? కాదనిన నాలుగువందలు పాఱవేయవలెను. అంతకంటె నెక్కుడై భోగముతో దుఁగుటుయ్యెలలో నూగింపదలచినచో వేఱొక దివ్యభవనము గట్టించి యందుంచవలెను. అంతియేకాని వ్యవహారమునకని వెళ్లి యేనాఁడో విడనాడినభార్యను మోటారు బండిపై నెక్కించి నాలుగూళ్లూరేగింపుచు దీసికొని వచ్చి గృహప్రవేశము చేయింతురా? మీయమ్మగారి పోరుతోనే నలిగి చచ్చుచుండ వైని సవతిపోరుకూడ దెచ్చిపెట్టితిరా?"

"సుందరీ! వృథాకంఠశోషపడకు. ఆమెకూడ నీవలెనే యగ్నిసాక్షిగా బెండ్లాడిన ధర్మపత్నిగాని పెరస్త్రీగాదు. ఈనాసంపత్తియందు నీకెట్టి యధికారము గలదో, ఆమెకుగూడ నట్టియధికారమే కలదు. అధికారముమాట యటుంచుము. ఆమెకు దలిదండ్రులు మరణించిరి. తోడబుట్టినవారు లేరు. నాయనువారు లేక యనాథయై యల్లాడుచున్నది. కాన కనికరము గలిగి తీసికొనివచ్చితిని. పోనిమ్ము; నీకును నామెకును బోసగనినాఁడు నీవు చెప్పినట్లు ప్రత్యేకగృహముననే యుంచెదను."

"నాడు చెప్పిన దొకటి. నేఁడు చేసిన దొకటి. మిమ్ము కాదనువా రెవ్వరు?"

"ఏమి చెప్పితిని?"

"మీరుగాదు. మీతండ్రిగారు, మా కొమారునకు రెండవవివాహమని చెప్పిరి. కాని ప్రథమభార్య జీవించియున్నదని తెలుపరైరి. రెండవవివాహ మనగ మా తండ్రిగారు భార్య మరణించియుండునని భావించిరి. ఎక్కడనో మాఱుమూలను కోనసీమనువసించు మాతండ్రి కింతలిమర్మము తెలియదయ్యె. తెలిసియున్నచో నిక్షేపమువంటి కోనసీమ కొబ్బరితోట నమ్మి నాలుగువేలు కుమ్మరించి యిట్టిసవతిపోరు సంబంధమును చేసియుండునా? ఈగుట్టు తెలిసినతరువాత మాతండ్రి యెంత దుఃఖించెనో చూచినదానను నాకు దెలియును!"

"మాతండ్రిగారు యింతటిమోసము చేసియుండునా? నేను నమ్మను."

"మీతండ్రిగారు వ్రాసిన యుత్తరములు మా నాయనగారివద్ద నిప్పటికిని యున్నవి. కావలయునన్న జూడవచ్చును."

నరసింహారావు నిరుత్తరుఁ డయ్యెను. ధనాశ తనతండ్రిచే నెట్టిదురాగతముల చేయించెనో, తా నేవిధముగాఁ దలిదండ్రులచేతి సంతపశువుగా మాఱెనో, తలఁపఁగనే నరసింహారావు సిగ్గుచేతను, విచారముచేతను నధికముగాఁ గ్రుంగిపోయెను. కళాహీనమైన నరసింహుని వదనారవింద మాతని మానసికవ్యవస్థను విశదీకరింపుచుండెను. భర్తమ్లానవదనము సుందరి కొకింత జాలి కలిగించెను. అతఁడీవిషయమున నిర్దోషి యని యామెకుఁ దెలియును. కాని సవతిని నెత్తిపైఁ దెచ్చిపెట్టె ననునాగ్రహ మామె కాతనిపైఁ గలిగిన జాలినిఁ బైకి వెల్లడింపనీయకుండెను. కాన నామె కోప మతిశయించుటచేఁ గలిగిన దుఃఖముతోఁ గంటితడి యద్దుకొనుచు "పరిణయపు సంగతులనుగూర్చిన చింత యిప్పుడేల? కాని మంచిచెడ్డ లాలోచింపకుండ మీరిప్పు డామెను దీసికొనివచ్చితిరి. ఇప్పుడు మీయమ్మయే నన్ను కత్తి

కొంత కోయుచున్నది. ఇక నీమెయు నామెయు జతగూడిన నాదురవస్థ యెట్లుండునో యోచింపుడు. ఇరుప్రక్కల దావాగ్నుల దరికొల్పిన నే యిల్లాలైన నెట్లు భరింపగలదు?ఏమైనసరియే; యిప్పుడామె నామె యింటికి బంపినగాని వలనుపడదు" అని సుందరి పెద్దగా దుఃఖించెను. నరసింహారావు కొంచెము విసుగుతో భార్యవంకఁజూచి, "ఇశ్, ఏడువకు. ఆవిడ నిన్నేమియు బాధపెట్టదు. నీయధికారమున కడ్డురాదు. నీభోగభాగ్యముల కడ్డురాదు. అట్లు వాగ్దత్తము చేయించుకొనియే తీసికొనివచ్చితిని. నీయింట నొకపనికత్తెగా నుండును. గాన నీకేమినష్టము?" అనెను.

"ఇట్టి మాయమాటలను నమాయకులగు మీరు నమ్మవలెనుగాని నేను నమ్మను. డబ్బునకు జేరిన పని మనుష్యులే నూదివలెచొచ్చి, నాల్గుదినములు గడచిన దబ్బనమువలె దేలుదురు. అట్టివారి భార్యయైన నూరకొనునా?"

నరసింహారావున కొకింత యాగ్రహము వచ్చినది. "ఊరకొనక పోయినఁ బోనిమ్ము. ఆమె దబ్బనముగాఁ దేలిన సరియే, గడ్డపలుగుగాఁ దేలిన సరియే. రమ్మనిన నోట మరలఁ బొమ్మనను. నీ కిష్టమైన నామెతోఁగలిసి యుండుము. కష్టముగా నున్న వేఱైయుండుము. అంతకును దుస్సహముగా నున్నచో మీతండ్రి యింటికి వెళ్లుము" అనెను.

నరసింహారావు కఠినవచనములకు సుందరికి మరింత దుఃఖము వచ్చినది. అంత నామె భోరుభోరున విలపింపుచు: "ఇంక నెందరున్నా రీవిధముగా మీచే గంతసూత్రములు బిగింపబడి వదలివేయబడినవారు" అనెను. నరసింహారావు కొంచెముగా నవ్వుచు "నాకు జ్ఞాపకమున్నంతవఱకు మీ రిద్దరే! ఈమాత్రపు జ్ఞాపకముగూడ నుంచుకొనజాలని శైశవావస్థలో నింక నెవ్వరికైనఁ దాళి గట్టించిరేమో మాయమ్మనడుగవలె" ననెను. ఆ యేడ్పులో నవ్వువచ్చినది సుందరికి !

## 3

జానకి పెద్దలతో భాషించుటకంటె పిల్లలతో ముచ్చటలాడుట కెక్కువ కుతూహలపడును. వారుచెప్పినదెల్లఁ జేయుట కామెకు విసుగులేదు. వారికి జడలు వేయుట, నీళ్లు పోయుట, దుస్తులు వేయుట, అన్నము పెట్టుట, బొమ్మలు చేసిపెట్టుట, ఆటలు నేర్పుట, కథలు చెప్పుట, జోలలు పాడుట, నిద్రలు పుచ్చుట, మున్నగు పనులసేయుటయం దామెకు మిక్కిలి కౌతూహలమును, నోపికయును, వహించియుండును. ఇట్టి శిశుమిత్రురాలగు జానకికిని, సుందరి బిడ్డలకును నతికాలములోనె సఖ్యము కుదిరినది. 'అమ్మ,అమ్మ,' యని వారామెను వెంటాడి తిరుగుచుఁ దమకుఁ గావలసిన కర్జములనెల్ల నామెచేఁ దీర్చుకొనుచుండిరి. సుందరి మొదటఁ దన పిల్లలామెతోఁ గలియకుండుటకుఁ బ్రయత్నించెను. కాని జానకి మిక్కిలి వాత్సల్యముతో వారి నిఁజేరదీయుటయు, తాను నీళ్లాడ నిండు ప్రొద్దులై యుండుటయు, పిల్లల పనులెల్ల జానకి చేయుటచేఁ దన భారము తీరినట్లుండుటయుఁ దలఁచి తన యసూయను తన మనస్సునందే యడంచుకొనవలసిన దయ్యెను. విశేషించి జానకి సాధుప్రవర్తనమును, మితభాషిత్వమును సుందరి యీసును ద్విగుణముగా నడఁచివేయుచుండెను.

'ఒఱలో నిప్పుడేకత్తియున్నదో, ఆ కత్తియే శాశ్వతముగానుండుఁగాక' యని తాఁబలికిన వాక్కును జానకి సత్యభంగము కాకుండ రక్షింపుచుండెను. గృహకార్యములపట్ల యింటిదానివలెను, ధనాధికారముల [illegible]స పెరదానివలెను వర్తింపుచున్న జానకి ప్రవర్తనము సుందరి కక్కజము గలిగించుచుండెను. అటు అత్తగారిపట్లను, నిటు సవతిపట్లనుగూడ నామె సమభావముతో మెలఁగుచుండెను. గృహకల్లోలము లేమియుఁ గలుగమికి సంతసింపుచు నరసింహారావుకూడ జానకిపట్ల సంతుష్టుఁడయ్యెను. పనిపాటులవారేమి, ఇరుగుఁబొరుగువారేమి, ఇంటిలోనివారేమి, జానకి సౌమ్యప్రవర్తనమును జూచి జానకి యపరజానకియేయని భావింపుచుండిరి.

జానకి భర్తృగృహమున కేతెంచిన యాఱుమాసములకు జానకికిఁ దండ్రియొసఁగిన భూమిని జేసెడు రైతులు మూఁడువందల రూప్యములను దెచ్చి జానకి కిచ్చి వెళ్లిరి. జానకి వానిని సుందరికి దాఁచ నిచ్చెను. మఱునాఁడు నగలవర్తకుఁ డగు విశ్వనాథము నగలపెట్టెను జేతఁ బట్టుకొని నరసింహారావుగారియింటికి వచ్చెను

అప్పుడు పగలు రెండుగంట లయినది. నరసింహారావు కచ్చేరికి వెళ్లినాఁడు. స్త్రీలను మోసగింప నెంచెడు టక్కరిగిన త్తెకుల కది మంచిసమయము గదా! విశ్వనాథము సుందరికడకు వచ్చి "అమ్మా క్రొత్తమాదిరి గాజులు, గొలుసులు, ఉంగరములు వచ్చినవి. ఏమైన చూచెదరా" యనెను. సుందరికి మహానగలపిచ్చి! సాధారణముగా విక్రయమునకు వచ్చిన నగను నావలకుఁ బోనివ్వదు. కాన యలసటతో మంచముపైఁ బవ్వళించి యున్న సుందరి చివాలున లేచి "ఏవి చూపుము" అనెను. విశ్వనాథము చాఁపపైఁ గూర్చుండి నగల పెట్టెను దెఱచెను. "అమ్మా! ఇదిగో, చూచినారా? గాజులు! ఇవి యీయూరిలో నింతవఱ కమ్మలేదు సరికదా! ఇవి యీప్రాంతమున మఱియెవరివద్దను దొరకవు. ఇవి మేమే స్వయముగా మా దుకాణములో దయారుచేయించినాము. చెన్నపట్ణములోఁగూడ నీ మాదిరి లేదు. ఇదిగో! ఈగొలుసు చూచినారా? నడుమ కృష్ణునిపతకముగూడ వేసియున్నది. అమ్మాయిగార్ల మెడలో వేసిన బహుసొగసుగా నుండును. ఇదిగో! గొలుసుపై పలకచెక్కియున్నది. చూచినారా! దీపాల వెలుగున నచ్చముగ వజ్రములదండయే యనుకొనవలెను. అంతదీప్తిగా నుండును.

ఇదిగో! రాళ్లుపొదిగిన యుంగరములు చూచినారా, ఎంతయందముగా నున్నవో!"

"అన్నియు చూచినాము. డబ్బుండవలెనుగాని నగలకేమి కొదువ! ఆ గొలుసు విలువయెంత?"

"ఒక్కొక్కటి మజూరితో సహా నూటయేబది రూపాయ లగునండీ."

"అబ్బా, ధరచాలయెక్కువగా చెప్పుచున్నావే!"

"ధర యెక్కువనుచున్నారా? మేము దీనికి యిరువది రూపాయలు మాత్రమే కూలి యేర్పఱచినాము. కాని చెన్నపట్టపు నగల దుకాణములలో యీ గొలుసునకే నలువది రూపాయలకు తక్కువ మజూరి తీసికొనరు. మీరు విచారించిచూచినను నట్లే యుండవలెను. మేమైనను మఱియొకరివద్దనైనచో ముప్పది రూపాయలు చెప్పువారమే. మీరు కావున మఱి పది తగ్గించితిమి."

"విశ్వనాథము! నీ వద్ద నగల మెఱుగుకన్న మాటల మెఱుగెక్కువ. ఎవరివద్ద వారికి తగ్గించినట్లు మాట్లాడెదవే కాని యందఱిపై నీకు సమానానుగ్రహమే! ఎవరికిని దగ్గింపవు. సరే! కూలి మాటకేమిగాని నా వద్ద యిప్పుడంత డబ్బులేదు. పిల్లలొకరికి గొనిన నొకరూరుకొనరు. కాన మఱియొకమాటు వానిసంగతి చూచెదను. ఇప్పు డీగాజులవెల చెప్పుము?"

"అఱువది రూపాయలు."

"అఱువది రూపాయలే! ఎత్తుసరి యేమాత్రము?"

"మూడు నవర్సుల యెత్తుసరి. పదిహేను రూపాయలు కూలి."

"అక్కర లేదు. తీసికొని పొమ్ము."

"పోనిండు పన్నెండీయండి."

"లేదు. పది యిష్టమా?"

"మఱియొకటి కట్టుకొనండి బొత్తిగ గిట్టుపాటు లేదు."

"లేదు."

"సరే, యీయండి."

సుందరి వెంటనే గాజులు తీసికొని చేతికిఁదొడుగుకొనినది. తోడనే పిల్లలు "అమ్మా! మా కాకృష్ణుని దండ కొనిపెట్టవుటే" యని పట్టుకొన్నారు. "నా వద్ద డబ్బు లేదు. రాత్రికి మీ నాన్నగారి నడిగి తీసికొనండి. రేపుకొనెద" నని తల్లి సమాధానము చెప్పినది. మేదకురాలగు పెద్దపిల్ల మగల మాటాడలేదు. కాని చిన్నది తల్లివలెనే గడ్డరి. కాన "నీ గాజులకైతే డబ్బు ఉన్నది కాబోలు"నని యేడువసాగినది. జానకి యప్పుడు భోజనముల సావడిలోఁగూర్చుండి భగవద్గీత చదువుకొనుచుండెను. నగల బేరమామెకు చాల సేపటినుండి చెవుల పడుచున్నను బైటకు రాలేదు. కాని సత్యవతి పెద్దయేడ్పు వినగనే చివాలున లేచి యక్కడకు వచ్చెను. సుందరి యేలనో యామెనుజూచి మొగము చిట్లించుకొనెను. జానకి యా యసూయను లెక్కసేయక యేడ్చుచున్న సత్యవతిని జేరదీసి "ఎందుల కేడ్చుచుంటివి" యనెను. "అమ్మా! అమ్మ తాను

శ్రీ శారదానికేతనము-చిత్రకళాభవనము, గుంటూరు



బౌద్ధభిక్షువు



శివాజి

చిత్రకారిణి: శ్రీ తుంగల లక్ష్మీదేవి



మల్లికాపరిణయము

చిత్రకారిణి: శ్రీ వెలగా సరస్వతి

అక్షయ సం. కార్తికమాసము

శ్రీ శారదానికేతనము-చిత్రకళాభవనము, గుంటూరు



బుద్ధుడు



ఆంధ్రకుసుమము



ఇంద్రధనుస్సు

చిత్రకారిణి: శ్రీ పెలగా సరస్వతి

గాజులు కొనుక్కొని నాకు గొలుసుకొనమంటే కొన లేదు చూడు" అనెను. జానకి ఆపిల్లను యేమనవల దని యూరడించి విశ్వనాథుని దెసచూచి "ఆ గొలుసు లేవియో చూపు" మనెను. విశ్వనాథము రెండు గొలుసులు తీసిచూపెను. జానకి పిల్లలకా గొలుసులు చూపి "మీకు గావలసిన వివియేనా? అనెను. "అవునవియే" యని యాబాల లిరువురు మురిపెమునం బలికిరి. జానకి వెంటనే యా గొలుసుల బాలికల మెడలలో వేసి "వీనివెలయెంత" యని విశ్వనాథము నడిగెను.

'రెండు గొలుసులు కూలితో సహా మూడువందల రూపాయ లగు'నని విశ్వనాథము చెప్పెను.

"మంచిది" సుందరమ్మా! నిన్న నీకిచ్చిన మూడు వందలను విశ్వనాథమున కిచ్చివేయుము" అని చెప్పి "మీ గొలుసుల బామ్మగారికి చూపుదురు రండి" యని పిల్లల నిరువురం దీసికొని జానకి యటనుండి వెడలి పోయెను.

తనయొడలున నొక్కనగ లేదుకదా! ఆ సొమ్ముతో దానేదియో యాభరణము కొనుక్కొనక తన పిల్లలకుం గొలుసులు కొనియిచ్చు టేమి? అని సుందరి కత్యాశ్చర్యము గలిగినది. ఈమె వెఱ్ఱిదా! యోగినియా! లేక యెవరికుండు నీ నిస్పృహ! ఎవరికుండు నీ తన్మూలిన ధర్మము! ఎవరికుండు నీకీతి పితృధనముతో సవతిబిడ్డలకు నగలు కొనిపెట్టెడి యౌదార్యము! ఇట్లు జానకినిగూర్చి మనమున భావింప భావింప సుందరి కత్యంతమును బిడియము గలిగెను. తాను నగలు కొనుక్కొనుచుండ జానకి యటకు వచ్చినందులకే తాను మొగము చిట్లించుకొనెను. జానకి వచ్చినదాదిం దానెన్నియో నగలు చేయించుకొనెను; చీరలం గొనుక్కొనెను; రవికలు కుట్టించుకొనెను. వానిలో నత్యల్పమగు నొక్క తైకెకడ్డ నైనను జానకి కిచ్చుటకుం దాను ప్రయత్నింపదయ్యెం. ఇంత విరివిగాం దాను వెచ్చింపుచున్న యాధన మెవ్వరిది? తనకును జానకికింగూడం బెనిమిటియైన నరసింహారావుదే కదా! ఇట్టి తననైచ్య స్వభావముతో జానకి యౌదార్యమును బోల్చుకొని నప్పుడు నిజముగా సుందరికి సిగ్గుగాదా!

## ౮

రాత్రి యెనిమిదిగంట లగుసరికి నరసింహారావు యింటికి వచ్చెను. తాను కొనుక్కొనిన గొలుసులు చూపుటకై పిల్లలిరువురు నిద్రింపక తండ్రికొఱ కెదురు చూచుచుం గూర్చుండిరి. కాన సత్యవతి తండ్రి కెదురుగాబోయి "నాన్నగారు! గొలుసులు కొనుకొన్నాము. చూచారా? దీనిలో కట్టుడి బొమ్మకూడా వుంది." అనెను.

"కొన్నారా? మీయమ్మకు పని యేమున్నది! వచ్చిన నగలను బోనీయకుండ గొనుటయేకదా!"

"అమ్మగాదు. ఆమ్మకొని పెట్టింది—నాకు, అక్కకు. మఱి అన్నకు ఉప్పు ఉంగరం కొంటుందట? అన్న అడిగితే చెప్పింది."

"ఆమ్మ కొనినదా? ఏవి? అక్కకుగూడనా? చక్కగా నున్నవే!"

ఇంతలో హైమవతివచ్చి తన గొలుసుకూడ తండ్రికిం జూపెను. "చక్కగా నున్నవి. కాని మీ యమ్మ నొకమాఱు పిలుచుకొని రండి" అని నరసింహారావు కొమార్తెలతోం జెప్పెను. పిల్లలు జానకిని క్షణములోం బిలుచుకొనివచ్చిరి. "జానకీ! ఇది యేమిపని? పిల్లల కిదివఱకు నగలు లేవా? లేకున్న తల్లికొనదా? నీ వేల కొంటివి?" అని నరసింహారావు ప్రశ్నించెను. "పిల్ల కిదివఱకు నగలున్నవని తెలియును. కాని పిల్ల లీ గొలుసుపై మిక్కిలి యపేక్షపడిరి. నాకు కొనిపెట్టవలెనని కోరికగలిగెను. కొంటిని."

"పిల్లల యపేక్ష కేమి? ఎన్ని యున్నను క్రొత్త వానిని జూచిన కావలయుననియే సంబర పడుదురు. ఒకవేళ కొనినను నీ డబ్బునేల వెచ్చించితివి? నీ కొక్క నగ లేదుగదా! నీ వేదియైన నగను బుచ్చుకొనక పోతివా? పాపము! మీ తండ్రిగారొసగిన ధనముగూడ సవతి బిడ్డలకే వినియోగమా!"

"ఎంతమాటంటిరి? వారు పరాయి బిడ్డలా? వారెవరు? నే నెవరు? పిల్లల కోరిక దీర్చుటే నాకు సంతోషము. నేను కొనిపెట్టుకొనినను పిల్లలనుభవింపు

మున్న యానందమనుభవింపగలనా? నాకు నగలపై నిప్పుడు యాసలేదు."

"నగలపై నాసలేకున్న దాఁచుకొనుట మంచిది. జబ్బు చేసినా? పోనిపోవునా? జాగ్రత్తచేసికొనిన నెందు కైన వినియోగించుకొనుగదా!"

"నా యుదరపోషణనిమిత్తము నా తండ్రి నా కొసఁగుమునిచ్చెను. మీ యాశ్రయము లేనప్పుడు నే నా ధనమును నందుల కే వినియోగించితిని. కాని యిప్పుడు మీరు నా సంరక్షణభారము వహించితిరి గదా! నా కింక వేఱె ముల్లె ముడు పేల?"

అట్టి సాధ్వీరత్నము నెడ నిర్దయతో వివేక దూరముగాఁ దాను బ్రవర్తించిన విధమును దలఁపఁగ నే నరసింహారావు లజ్జితుఁడై ఖిన్నుఁడై తలవంచెను. అప్ర యత్నముగా నతని నేత్రము లశ్రుసిక్తము లయ్యెను.

నాఁటిరాత్రిగే సుందరి సుఖముగాఁ బ్రసవించి యొక పుత్త్రికారత్నమును గనెను. ఇఁక బిడ్డల సంరక్ష ణయు, పతిశుశ్రూషయు నాదిగాఁగల గృహకృత్యము లన్నియుఁ బూర్తిగా జానకిశిరముపైఁ బడినవి.

సుందరి పురిటిదినములు సుఖముగా వెళ్లినవి. ఈలోనన నామెతల్లి గూడవచ్చి బాలెంతకు వలయు నుపచారములలోఁ బాల్గొనినది. సుందరి పుట్టింటి గ్రామము పల్లెటూరగుటవలన వైద్యావసరములకు ఇ బ్బంది యగునని నరసింహారావు ఏ పురిటికిని భార్యను బుట్టింటి కంపునాచారము లేదు. కాని తల్లియు పిల్లయు సుఖముగ నీళ్లుపోసికొనగనె నెలలోపలనే పుట్టింటికి వెళ్లుట యెప్పుడును జరుగుచున్న పద్ధతియే. అట్లే యీ మాఱుగూడ సుందరితల్లి నెలలోపలనె తీసికొని వెళ్లెను. ఆడపిల్ల లిరువురుగూడ తల్లితో వెళ్లిరి. బడిలోఁ జదువుకొనుటవలన కొమారుఁ డగు రాముఁడు మాత్రము తండ్రివద్దనే యుండెను.

మూఁడుమాసములకు మరల సుందరి యింటికి వచ్చినది. వచ్చుటతోడనే నిద్రాభిముఖములై యున్న యరమోడ్పు కన్నుఁగవతోడను, పాలిన చెక్కిళ్లతోడ ను, బడలిన వదనముతోడను, చిక్కిన శరీరముతోడను నొప్పి, పేరఁటి సౌభాగ్యమును వెల్లడింపుచు వేవిళ్లచే నొకిరింపుచున్న జానకిని జూచి సుందరి నివ్వెఱ పోయినది.

౫

జానకి పతిగృహప్రవేశము గావించిన పదునైదు మాసముల కొక నాఁటి యుదయమువేళ డాక్టరు గోపాల రావుగారి గుఱ్ఱపుబండి నరసింహారావుగారి మేడముం దర నిలిచియుండెను. ఇంటిలోనివారందఱు మిక్కిలి యాతురతతోడను, గళవళపాటుతోడను, నటు నిటు తిరుగుచుండిరి. "అయ్యో! పాపము! ఏమి కానున్నదో! ఎందులకువచ్చెనో ఈమాయాకడుపు! పాపము! వచ్చి సంవత్సరమున్నఁ యైనదిగదా! ఇంట యేమి ప్రవేశించి నదో మరల పీఖిగుమ్మ మెఱుగదు! ఎంతకాలమునుండి యో ఇంట పనుపడియున్న యిల్లాలివలె యెప్పుడు నేదియో యొకపని చేయుచునే యుండెడిది! ఎంత శాంతము! ఎంతయోర్పు! ఎంతవినయము! పనివారలనైన పల్లెత్తుమాటయని యెఱుఁగదుగదా! పేదవారినైన పేద పిలుపు పిలిచి యెఱుఁగదుగదా! ఎంతమంచితనము! అన్ని సద్గుణములు కలిపి యామెను సృష్టించెను భగవంతుడు! ఇపుడేమి చేయనున్నాడో! పాపము! నెలదినములనుండి జబ్బుగా నున్నదని యందఱనుచుండ ఏమో! అనుకొం టిమి! ఎంతలో యెంతవచ్చిన" దని వేవిధముల వ్యాకుల ముతోఁ జెప్పుకొనుచు నిరుగుపొరుగు నమ్మలక్కలు దొడ్డివాఁకిటను వీథివాఁకిటనుగూడ విధివిరామము లేక వచ్చిపోవుచుండిరి. నరసింహారావు యేమియుఁ దోఁచని వాఁడువోలె వీథియరుఁగుపై నటునిటు పచారు చేయు చుండెను. ఇంతలో డాక్టరుగారు లోపలనుండి వాకిలి లోనికి వచ్చెను. "ఏమి యెట్లున్న"దని? నరసింహారావు డాక్టరుగారి నాతురతతో నడిగెను.

"చాల పొరపాటు చేసినారు. ఆమెను మున్నె ఆసుపత్రికి పంపవలసినది.

"అగును. మొదటినుండి నాకుగూడ యదే యభి ప్రాయము. కాని వెళ్లుటకామె యెంతమాత్ర మంగీక రింప లేదు."

"నిజమే, ఇప్పటికిఁగూడ నామె యదే యభి ప్రాయముతో నున్నది. కాని రండుదినములనుండి తీవ్ర

ముగా బ్రసవవేదనఁబడుచుండుటచే నామె మిక్కిలి నీరసించియున్నది. డాక్టరు దొరసానినిగూడ పిలిపింపుట మంచిది. ఊరిలో స్త్రీ వైద్యాగారముండఁగా మేము చేయిజేసికొనుట యంత ప్రశస్తముకాదని నా యభిప్రాయము.

"అయిన నీకు మనశ్శాంతికై మంత్రసానులతో బని సాగదందురా?"

"సాగదనికాదు. వీరుగూడ మంచిసమర్థురాండ్రే! కాని డాక్టరు దొరసానిగూడ దగ్గఱనుండుట మంచిదని తోచుచున్నది. ఎప్పుడెవరి యవసరమో!"

"అట్లే పిలిపించెదను."

"ఇక నాకు సెలవు."

"చిత్తము" డాక్టరు వెళ్లగనే నరసింహారావు దొరసాని వచ్చుటకై చీటివ్రాసి గుమాస్తాచేతికిచ్చి పంపి వాకిట కుర్చీవైచుకొని కూర్చుండెను. జానకి దుస్సరప్రసవవేదనాజనిత యార్తరవములు మిక్కుటముగాఁ జెవులఁజొచ్చి హృదయమును విదారింపుచుండెను. ఆయార్తధ్వనులు వినలేక నరసింహారావు కుర్చీపైనుండి లేచి వీథిలోనికి వచ్చెను. ఇంతలో "కావు కావు" మని శిశురోదనధ్వని వినఁబడెను. నరసింహారావు హృదాభారము తీరినట్లు సంతసింపుచు లోనికి వచ్చుచుండెను. ఇంతలో సత్యవతి పరుగెత్తుకొనుచుఁ దండ్రి కెదురువచ్చి "నాన్నగారు! తమ్ముడు పుట్టినాఁ"డనెను. నరసింహారావు సంతోషమును వెల్లడింపలేని మాధుర్యములో సత్యవతి నెత్తుకొని యరుఁగుమీఁదకు వచ్చి మరల కుర్చీపై శాంతముగాఁ గూర్చుండెను. ఇంతలో "అయ్యో స్పృహతప్పి పడిపోయినది. కన్నులు తిరిగిపోవుచున్నవి. శోషయో యేమో! కొంచెము జావపోయవచ్చునా? అయ్యో! డాక్టరుగారిని పిలిపించిన బాగుండును." అను కేకలు వినఁబడెను. వెంటనే నరసింహారావు లేచి సావడిలోనికి వచ్చెను. సుందరి కల్లోలపడుచు నరసింహారావు నద్దకువచ్చి "అక్క స్పృహతప్పి పడిపోయినది. వైద్యుని పిలిపించండి" అనెను. ఎవరు లేరే! అందఱు అన్నిచోటులకుఁ బోయినారని

యాందోళనపడుచు నరసింహారావు వాకిటికి వచ్చుసరికి మోటారుబండి డాక్టరు దొరసాని నెక్కించుకొని వచ్చి వాకిట నిలిచినది. దొరసానితోఁగూడ నరసింహారావు లోనికి వచ్చినాఁడు. వెంటనే దొరసాని పురిటిగది లోనికి వెళ్లి స్మృతిహీనగా పడియున్న జానకి కేదియో వాసన చూపి, సూదిమందెక్కించి, నోటిలో నేమియో స్మృతివచ్చునట్లు చేసెను. సమయమునకు దేవతవలె వచ్చి పోసి రవ్వంతయాపద తప్పించెనని యెల్లరు ముదమందిరి. దొరసానికూడ వచ్చిన పని సఫలమైనట్లు సంతసింపుచు నరసింహారావునద్ద సెలవుపుచ్చుకొని వెళ్లిపోయెను. పది నిముసములలో జానకి బాగుగా నేత్రములువిప్పి నలువైపులఁజూచి, యొకచోటఁ దలుపుపట్టుకొని నిలుచఁబడియున్న సుందరి నుపలక్షించి "అమ్మాయీ? భర్తగారి నొకమాటకు దోడ్కొనిరమ్మా." అనెను.

"అక్కా! నీవు చాల నీరసముగా నున్నావు. ఇప్పుడు మాట్లాడజాలవు. కొంచెము తాళి పిలుచుకొని వచ్చెదను. నీవు కొంచెము స్తిమితముగా నుండుము."

"అమ్మాయీ! నీకు తెలియదు తరువాతకాదు. ఇప్పుడే తీసికొనిరమ్మా; శీఘ్రముగా దీసికొనిరమ్మా."

సుందరి దుఃఖపడుచు వెళ్లి నరసింహారావును బిలుచుకొని వచ్చెను. నరసింహారావు జానకి సమీపమునకువచ్చి తలవంచి "జానకీ! ఎందులకు బిలిచితివి?" అనెను. నరసింహారావు వచ్చునప్పటికి జానకిముఖము వైవర్ణ్యమునందినది. కన్నులు క్రుంగుచున్నవి. శరీరము చల్లఁబడుచున్నది. అట్టి యవసానస్థితిలో జానకి యతిప్రయ



త్నముమీఁద చేతులుజోడించి, "స్వామీ! నాకు బతిపరిత్యక్తయను నపయశమును బాపుకొనవలెననియు, పుత్రహీనులగు నా తలిదండ్రులకు దౌహిత్రలాభముచే సద్గతులు గలిగింపవలెననియు రెండు కోర్కెలుండెడివి. భగవదనుగ్రహమువలన నా రెండు కోర్కెలు సిద్ధించినవి. నా కింక సెలవు. ఈ శిశువునకిక తల్లియు దండ్రియు మీరే! ఎట్లు కాపాడెదరో! నాథా! మీకీ విన్నపముసేయుటకే మీ రెన్నివిధముల జెప్పినను నా సుపత్రికిబోక నిలిచితిని. క్షమాపణ" అని వచింపుచుండగనే యంజలిచేసెడి జానకి చేతులు పక్కకొరగి పోయెను. కన్నులు తిరిగిపోయెను. "అయ్యో! అయ్యో! జానకీ! నన్నెంత భంగపుచ్చితి"వని యార్తనాదముసేయుచు నరసింహారావు జానకి శరీరముపైఁబడెను. "అయ్యో అక్కా! మమ్ము వీడిపోతివా? నీ వెంత పగదానవని భయపడితినో అంతయాప్తురాలవై ప్రియముజూపితివే! అయ్యో! నిన్నెట్లు మఱతును! అమ్మ, అమ్మ యని పలవించు నీబిడ్డల కేమిచెప్పుదును?" అని యగ్గలముగా దుఃఖింపుచుసుందరి నేలగూలెను.

"అమ్మా! జానకమ్మ తల్లీ! పెద్దతనమున నా కెంతకడుపు కోతబెట్టి పోతివి. మిత్తిలు జొచ్చినట్లే యత్తింటికి రాకున్నను బ్రతికియుందువేమో కదే! వచ్చి యేమి యనుభవించితివి! ఏమి కట్టుకొంటివి! ఏమిమట్టుకొంటివి! ఏమియు లేదే! ఏసౌఖ్యము కాలేదే! అప్పుడే యింతఘోరమా! అయ్యో! పిల్లలన్న నెంతప్రేమ! యెంత మురిపెము. ఎందఱు పిల్లలు చుట్టుముట్టినను విసుగు లేదే! అయ్యో! కడుపునఁగన్నబిడ్డ నొక్కమాఱు కన్నులఁజూచుకొనుటకైన నీ కాయువు లేకపోయెఁగా! జానకమ్మా! నీ ముందర నేను దాటినచో నాకు గోమార్తెలు లేని కొఱత యుండదని యనుకొంటిని! అయ్యో, నా ముందరే నీవు వెళ్లిపోతివా! అయ్యో!" అని తలమోదుకొనుచుఁ బిచ్చమ్మగారు నేలఁబడెను.

దేహి వీడిన దేహముపైఁబడి యెందఱు పలవించినను నేమున్నది?

అంత టిల్లేడ్చుచుండఁ దనదురవస్థ నెఱుఁగని యా యజ్ఞానపు శిశువుకూడ విలపించెను. జానకి యభీష్టము నెఱవేర్చువాఁడై నరసింహారావు తలవని తలంపుగ జరిగిన యా విషాద నాటకమునకు నాశ్చర్యమును దుఃఖ



మును వెలిపుచ్చుచు యేడ్చుచున్న యా శిశువు నక్కునఁ జేర్చెను.






# బాలచంద్రుడు

అధికార్ల సూర్యనారాయణరావు గారు, బి. ఏ., బి. యల్.

చదలు తరువుల నాలీల చందమామ!
ఒంటరిగ నేడు సడయాడు చుంటివేల?
మురిపెములజూపు ముద్దుల మూట! నాదు
దృష్టిపథమున బడకుండ తిరిగెదేం ?
ఏమిదుర్వార్త తెలుపు నీలేతమోము
నీలితెలుపుల నిగనిగల్ నిలుపవేల
కేళికా వినోదము చూపవేల నేడు
వెన్నెలలవాడ! నీకేల విన్నదనము ?——
అమలభవదీయ సఖ్యంబు నభిలషించి
జననియానతి గైకోక చనినవాడు
మోదమిడు నాదు వేయినోములఫలంబు
తేటతెలినవ్వు లొలయు నీసాటివాడు
బాలకుడు నేడు నీజాడ నేలరాడు?
చదల నోలాడు మేఘముల నొదిగినాడు
నీపవిత్రబింబము వెన్క నిలచినాడొ?
ఆకసంబున వ్రేలు గోళముల బొదలు
మృదులగానము వినుచు నిద్రించినాడొ?——
మబ్బుటుయ్యాల నూగాడు మన సెకాని
నిలచిమాటాడవేల వెన్నెలల బాల?
అలపొదుగుల లేగలు పాలుత్రాగ
పసిపులుంగులు గూళ్లలో బాసలాడె
నీముఖముచూచి నీతల్లి నింగికెగసె
చిన్నినాపాప నన్నేల చేరరాడు?
రాడు, చదలేటియిసుకల నాడుకొనునొ?
పారిజాతప్రసూనంబు లేరువాడొ?
నందనోద్యాన భూముల నానంద మిడునొ?
వలపు మార్చెనో కైలాసవాససుఖము?
చిన్ని వానిని మనసార కన్నతల్లి
రమ్మనె నటంచు తెల్పుమా రాకపోడు;
తోడిబాలకు డాడుకో రాడటంచు
కొందలము నీకు లేదోయి చందమామ?
తనయుగోల్పోయి వాపోవు తల్లిజూచి
నవ్వుచుండెదవారికి న్యాయమగునె?
లలిత సుకుమార జీవన లాలసీయ
భావవీచికా డోలికం మాలికలను
దేలియుండెడు నీవెట్లు తెలియగలవు
మాతృజఠరము దహియించి మంటలుగొను
పటుతరవిషాద సంజాత వహ్నికీల?

* * * *

వలదు వలదోయి, శోకింప వలవదోయి!
దుఃఖభారంబుచే నిన్ను దులనాడి
తల్లిడిలజేసినా నురడిల్లు మోయి!
చింతలకు చింత తోడనె? సంతసంబు
గొలుపులేనవ్వు మోమున నిలుపుమోయి!
తాను లేకున్న నిను జూచి తనివినొంద
వలయునని ముద్దుకొమరుండు పలికినాడు;
నిన్ను గాంచిన నాబాలు గన్నయట్లె
తోచుచుండెను, దుఖంబు నాచుకొందు;
క్రొత్తయాశలు లేతచిగుళ్ల దొడిగె
వింతసౌఖ్యపు కళ లాత్మవిస్తరిల్లె
అనుపమోల్లాసదీప్తు లల్లాడె మేన
స్తన్యమిచ్చెద రావోయి చందమామ!



# చంపావతి

ఆంధ్ర శేషగిరిరావు గారు, [సారస్వత సమాజము]

ఇది ఆరావళీ పర్వతారణ్యవాటిక. త్రాచు పాము పిల్లవలె పరుగెత్తుచుండు సెలయేటితీరము. సాంద్రముగఁ బెరిగియున్న మహావృక్షముల నడుమ నొక పటకుటీరము. అందు రాణాప్రతాపుడును, మహారాణి గుణవతియు ఆసీనులై యుండిరి. వారు కట్టుకొనినవి ముదుకబట్టలు. వారి శరీరములు బక్కచిక్కియున్నవి. వదనములు తీవ్రవిచారగ్రస్తములై యున్నవి. కాని వారిరువురి విశాలనయనములయందును రాజపుత్ర శౌర్యాగ్ని చింతనిప్పువలె ప్రజ్వరిల్లుచునే యుండెను. ఏదియో గభీరవిషయ మిప్పుడు వారి హృదయముల కలతపెట్టుచున్నట్లు కనుపించుచున్నది. చాల కాలమువఱకు వారు మౌనము తాల్చియుండిరి. తుదకు రాణాప్రతాపుడు దీర్ఘనిశ్వాసము పుచ్చి.——

'గుణవతీ! మనము నేడెంత దురదృష్టవంతులము? ఆకలిగొన్న బ్రాహ్మణుడొకడు తిండిదొరకక మన గుమ్మమునుండి పోవలసివచ్చెగదా! బప్పరావుల వంశమునకు నేనెంత అపకీర్తి తెచ్చుచుంటిని? రాజపుత్రస్థానమున కంతకును తిలకాయమానముగ నుండిన మేవాడు రాజవంశము నేడిట్టి కటికిదరిద్రమనుభవించుచున్నదా? ఆకలిగొన్న అతిథికి పట్టెడన్నము పెట్టనేరని నాబ్రతుకేల? ఓ, భగవానుడా! నాయందు దయయుంచి ఈ దైన్యమును బాపుము. ఓ, మృత్యుదేవతా! నీకరాళవదనగహ్వరమును తెరచి నన్ను మ్రింగివేసి బప్పరావులవంశగౌరవమును నిలబెట్టుము.'——

అనుచు రాణాప్రతాపుడు మూర్ఛవివశుడయ్యెను. రాణి గుణవతి నాధునిశిరము తన యంకతలమున జేర్చి చీర చెఱగుతో నెమ్మదిగ విసరుచుండెను. కొంతసేపటికి రాణా రెప్పలు విప్పిచూచెను.

అంతట మహారాణి ఇట్లు చెప్పెను.——

'ప్రాణేశ్వరా! విచారింపకుడు. ఇంతవఱకు నొకకంటితో జూచుచుండిన భగవాను డిట్టి కష్టకాలములో మనలను మఱవజాలడు. భగవానుడు దయార్ద్రహృదయుడు. కావున, ప్రాణప్రియా! ధైర్య మవలంబింపుడు. శౌర్యజీవులగు బప్పరావుల వంశమున జనన మొందిన రాణాప్రతాపసింహు డిట్టి అధైర్య మొందుట కానిపని.' అందులకు రాణా ఇట్లు బదులుచెప్పెను:

'గుణవతీ! నాజన్మములో మొదటిసారి నేడు క్షుధార్తుడగు విప్రునకు పట్టెడన్నము పెట్టలేకపోయితిని. ఆవిప్రుడు తిరిగివచ్చెదనని

చెప్పియున్నాడుగదా! అప్పు డాతనికి నేనేమని చెప్పుదును? మనము చాల దినములనుండి కడుపునిండ తిండితిని యెఱుగము. మనపుత్త్రుడు అభయ కుమారుడును, మనపుత్త్రిక స్వర్ణకుమారియు తిండిలేకనే మనలను విడిచిపోయిరి. అప్పుడుకూడ నాకింత విచారము కలుగలేదు. నాధైర్య కంచుకము సడలలేదు. కాని, నేడు......అయ్యో......'



“ప్రాణేశ్వరా! విచారింపకుఁడు......”

ఒక్కొక్కప్పుడు వజ్రకఠినహృదయములుకూడ ద్రవీభూతములగును. మఱి మాటలాడుటకు దార్ఢ్యములేక రాజాప్రతాపుడు తిరిగి మూర్ఛావివశుడయ్యెను.

## ౨

అప్పుడు చిన్నితమ్ముడు సుందరలింగముతో చంపావతి లోనికివచ్చెను.

గుణవతి.—చంపా! ఇప్పు డిక్కడకేల వచ్చితివి?

చంపావతి (ఒక్కనిముసమాగి).—అమ్మా! ఇప్పు డిక్కడకు వచ్చియుండకపోదును, గాని—

గుణ.—కాని, ఏమి?

చంపా.—ఆబ్రాహ్మణు డాకలి దీర్చికొనక మన కుటీరమునుండి పో నక్కఱలేదు.

గుణ.—ఏమి నీకు అతిథిసంగతి తెలియునా?

చంపా.—(ఫలభారానమితమైన చెట్టువలె తలవంచుకొని) నాన్నగారి మాటలను నేను వింటిని.

గుణ.—(కోపముతో బొమముడివైచి) ఇతరులు చెప్పుకొనుమాటలను పొంచియుండి రహస్యముగ వినుచుంటివా?

చంపా.—అమ్మా! నన్ను క్షమింపుము. ఇట్టి తప్పానరించుటకు నా కిదియే తొలిసారి. కావున నా యీతొలితప్పిదమును మన్నింపుము. అతిథి ఆకలి దీర్చికొనక పోనక్కఱలేదని నాయనగారితో మనవిచేయుము. ఆ అతిథికి నే నాహార మిచ్చెదను.

తోడనే రాణా కన్నులుతెఱచి లేచి కూర్చుండెను.



"తల్లీ, అతిథికి ఆహారమిచ్చెదవా?......"

'తల్లీ! అతిథికి ఆహార మిచ్చెదవా? ఎక్కడనుండి తెచ్చెదవమ్మా?' అని ఆత్రముతో నడిగెను.

'ఇప్పుడే వచ్చెద'నని చంపావతి వెడలి పోయెను.

సుందరసింగు ఏడ్చిఏడ్చి నీరసముచే దల్లియొడిలో నిద్రించెను.

ఒక గడియకు దరువాత చంపావతి రెండు చిన్ని రొట్టెముక్కలతో బ్రవేశించెను. రొట్టెముక్కలను జూచుటతోడనే రాణా ప్రతాపుని ముఖమున సంతోషము పుష్పించెను. సంతుష్టవదనముతో నాతడు.—

'తల్లీ! నీకీరొట్టెముక్క లెక్కడివి?' అని అడిగెను.

దానికి చంపావతి,

'నిన్నటి సాయంకాలము నాకాకలి లేక పోవుటచే వీనిని దాచిపెట్టితిని. నేటి యుదయమున వన్యఫలములు తిని ఆకలిదీర్చికొంటిని. సుందరసింగు ఏడ్చినప్పుడు పెట్టవచ్చును గదా యని వీనిని భద్రపఱచితిని. సుందరసింగు ఇప్పుడు నిద్రపోవుచున్నాడు. కావున ఈరొట్టెలను అతిథి కొసగుదము;' అని బదులుచెప్పెను.

ఈమాటలు వినుసరికి బ్రతాపుని హృదయమున ప్రేమప్రవాహము పొంగి పొరలి వెల్లువయై ప్రవహించెను. ఆతడు కూతు బిగ్గ కౌగిట బొదవిపట్టి 'తల్లీ, నిన్ను భగవానుడు రక్షించుగాక' అని ఆశీర్వదించెను.

## 3

ఆ రెండు రొట్టెముక్కలతో బ్రాహ్మణుని ఆకలి తీరునా అనుసందేహము రాణాకు దోచెను. క్రొత్తరొట్టెల నాతడెట్లు సంపాదింపగలుగును? తమ్మునియందున్న మమకారము కొలదిని తన ఆకలి చంపుకొని చంపావతి దాచియుంచినది కావున ఆ రెండు రొట్టెముక్కలైనను ఆపటకుటీరమున దొరికినవి. అధికముగా గావలయు నన్నచో లభ్యమగునా? ఈసంగతి రాణాప్రతాపుడు గుణవతి చెవులలో నూదెను. ఆ గుసగుసల యర్థము చంపావతి గ్రహించి,

'తండ్రీ! నాదగ్గర ఈరాగిడబ్బు లున్నవి. వీనిని తీసికొనిపోయి పిండి కొనితెండు. దానితో గ్రొత్త రొట్టెలుకాల్చి అతిథికి బెట్టవచ్చును,' అనియెను.

ఆత్రముతో నారాగి డబ్బులను దీసికొని ప్రతాపుడు దగ్గఱనున్న కొండపల్లెకు బో

యెను. చాలకాలమునుండి పసుపుముళ్లవైచి ప్రాణపదముగ దాచుచున్న చంపావతి రాగి డబ్బులు నాటితో పిండిగా మారిపోయినవి.

ప్రతాపుడు పిండి కొనితెచ్చిన కొంత సేపటికి అతిథిబ్రాహ్మణుడు తిరిగివచ్చెను. అంతకుబూర్వము చంపావతి ఆ పటకుటీరాభ్యంతరభాగమున కసవు ఊడ్చి కలయంపిచల్లి గడ్డిచాపపఱచి అతిథిపూజకై సర్వమాయత్తము చేసి యుంచెను. ఆ అతిథికి నేబదియేండ్లుండును. చీకిపాతలు కట్టుకొనియున్నను ఆతని ఆకారముగంభీరముగ నుండెను. ఆకలిగొన్న ఆ బ్రాహ్మణుడు, 'తల్లీ!' అనుచు పటకుటీరమునుసమీపించెను. చంపావతి బయటకు వచ్చి చాపపైగూర్చుండుమని కోరెను. ఆసీనుడై ఆతడు,

'తల్లీ! ప్రతాపసింహ మహారాజు నీ కేమి కావలయును?' అని అడిగెను.

చంపావతి.—ఆర్యా! ఆయన మా నాయనగారు. అతిథిపూజకు నన్నాయన నియమించెను.

అని చెప్పుచు నాహారము గొనితెచ్చుటకై లోనికరిగెను. అప్పుడు అతిథిమొగమున రుద్ధమైన సంతోషచిహ్నము తొంగి చూచుచుండెను. భూర్జపత్రమున పది చిన్నిరొట్టెముక్కలుంచి ఆమె అతిథిముందర నుంచి గ్లాసుతో మంచినీళ్లు తెచ్చియిచ్చెను. అతిథి ఆహారమును గైకొనదొడగెను.

చంపావతి.—(వినమితవదనయై) మహానుభావా! మా కటికదరిద్రమువలన మీకిట్టి కొయ్యరొట్టెముక్కలు పెట్టవలసి వచ్చినది. మీ జిహ్వకివి రుచింపవు.




"మహానుభావా! మా కటికదరిద్రమువలన...రుచింపవు"

అతిథి.—రుచింపకేమి? తల్లీ! ఆకలి గొన్నవానికి రుచులతో నిమిత్తము లేదు.

రెండుమూడు నిమిషముల తరువాత అతిథిఆహారమును ముగించిలేచి రాత్రివచ్చి రాణావారి దర్శనము చేతుననిచెప్పి వెడలిపోయెను. అతిథి విషయమును తల్లిదండ్రులకు నివేదించుటకామె సంతోషవికాసవదనయై లోనికరుగుచుండెను. రెండురోజులనుండి ఆహారము పుట్టియెఱుగనిది అగుటచే నామెకు శిరసు మెఱ్ఱవై పోవుచుండెను. అంతలో నామె లోపలి కడపయొద్ద స్పృహతప్పి పడిపోయెను.

౪

కనుచీకటివేళ. మర్మరధ్వనితో మందవాయువులు సంచారముచేయుచుండ

ను. చిక్కి శల్యమైయున్న చంపావతిచాపపై బరుండియుండెను. సుందరసింగు మేలుకొని యుండెను.

రాణాప్రతాపుడు—(నిస్పృహా తెల్పు నిట్టూర్పువిడిచి) 'ఓ! భగవానుడా! సుశగంగ సమము సింహబట్టుగల యుట్టి నంతతిసినాను నాకు లేకు యిం నీసికొనవిరోవుచుంటివా?' అనుకొనెను.

సుందరసింగు—అమ్మా! అన్న, ఇంకను మేలుకొనియున్న దేమి?

గుణవతి—(కన్నీరు తుడిచికొని) నాయనా! నిద్రపోవుచున్నాడు.

అంతటను నిశ్శబ్దము పిండజమై యుండెను.

తుదకు రాణా గుణవతితో నిట్లనియెను: 'అక్బరు పాదుషా ప్రత్యుత్తర మంపెను. అతని అధికారమును కొప్పుకొలిచ్చినచో నన్ను స్నేహితునికంటె ఎక్కువగా జూచెదనని యుత్తరమున వ్రాయుచున్నాడు. నా నిస్సహాయస్థితిజూచి ఆతనికి జాలి కలుగుచున్నదనియు, తిను తిండి లేక అల్లాడుచున్న నా బిడ్డలను చూచియైన తనతో సంధి కావించుకొని పేరునకు మాత్రము తన అధికారము అంగీకరింపవలసినదనియు ఆతడు చెప్పుచున్నాడు. ఈమాటలొప్పుకొననిచో నేను నాయిష్టము వచ్చినచోటికి స్వేచ్ఛగా బోవచ్చుననియు, అతనుగాని అతని సరదారులుగాని ఇకముందు నాకే విధమైన ఇబ్బందియు పెట్టరనియు తుదిమాటగా అక్బరు వ్రాయుచున్నాడు.'

అప్పుడు పటకుటీరాభ్యంతర భాగమున పలుకు సవ్వడి వినవచ్చెను. ప్రతాపుడు నిస్వనముతో—'ఎవరువారు' అని ప్రశ్నించెను.

ప్రత్యుత్తరము రాలేదు.

'ఎండుటాకుల మర్మరధ్వని కాబోలును' అని గుణవతి అనియెను.

'అక్బరు పాదుషా నిజముగా దయార్ద్రహృదయుడు' అని ప్రతాపుడనియెను.

౫

సీసము కరిగించి చెవులలో బోసినట్లున్నట్లు కాబోలు చంపావతికి. ఆమె మాటలు వినుటతో



"ఆహా! నేడు అక్బరుపాదుషా దయార్ద్రహృదయమును కనుగొంటివి....."

# ప్రకృతియోగిని! నినుఁగాంచి సుకృతినగుదు

సోమంచి వాసుదేవరావుగారు

శైల వనవార్ధిదేశ సంసక్తిఁ బదలి
శారికాకీరపికకోకిలారవముల
రంగదుత్తుంగ వీచికారావములను
నలరి సంధ్యారుణాంబరముల ధరించి
శీతవాతాతపములకు భీతిగనక
నిశ్చలసమాధి వహియించి నిరుపమాన
చిత్సుఖాంబుధిఁ దేలెదే చిగురుఁబోఁడి!
ప్రకృతియోగిని! నినుఁగాంచి సుకృతి నగుదు.

అఖిలమై మానసాతీతమై యమేయ
మై నిరుపమానమై నిత్యమై యనంత
సచ్చిదానందమై యోగిజనవిదితము
నై తనరు తత్త్వ మది భవదాకృతిఁగనఁ
దెలియు నోరు లెవ్వరుం జెప్ప వలనుపడ ద
నంగ భవదంతరంగ ప్రేమన్ గనంగ
మాదృశులకును శక్యమే మహితచరిత!
ప్రకృతియోగిని! నినుఁగాంచి సుకృతినగుదు.

స్వీయతత్త్వంబు జగతికి వేగఁదెలుప
నీశ్వరుఁడు నిన్ను నియమించెనేమొ ధరణి?
అట్లుగాకున్నఁ దన్మహిమానుభావ
మెట్లు నీచేత మాకిట నెఱుఁగఁబడెను?
ప్రేమలతికానికాయంబు పెరుగఁజేసి
దానిసౌఖ్య నికుంజముల్ గా నొనర్చి
మాదృశుల నట్టియిరవుల నాదరింతు
ప్రకృతియోగిని! నినుఁగాంచి సుకృతినగుదు.

భూరిశరదాగమారంభపూర్ణపూర్ణి
మాసుధాకరచంద్రికా మానితభవ
దమలదరహాస కాంతి పూరములఁగలసి
చిత్సుఖాంబుధిఁ దేలుచుఁ జిగురుఁబోఁడి!
ప్రకృతియోగిని! నినుఁగాంచి సుకృతినగుదు.

కోకిలసుధామధుర వరకాకలీని
నాదమేదుర భవదీయసాదరవచ
నాళిశ్రుతిపుటపేయమై యలర వించుఁ
జిత్సుఖాంబుధిఁ దేలుచుఁ జిగురుఁబోఁడి!
ప్రకృతియోగిని! నినుఁగాంచి సుకృతినగుదు.

కమలమధురసపాన సుఖప్రవృత్తి
నలరు బంభర సముదాయములు చలించి
ఝంకృతులు నేయ నలలు ఘోషం బొనర్ప
వించు నలరుచు సరసులఁ గంచు మించు
ప్రకృతి యోగిని! నినుఁగాంచి సుకృతినగుదు.

కోమలలతికా దేహవై కుసుమవిసర
హాసవై బంభరాలకవై కురంగ
నేత్రవై కీరవాణివై నెగడి శుద్ధ
ప్రేమశాంతరసములఁ జూపెదవు నీవు!
ప్రకృతియోగిని! నినుఁగాంచి సుకృతినగుదు.

మందమలయానిలకిశోర బృందచాల
నములు మెయిఁ బులకల నించ సుమపరీమ
ళములు మదినెమ్మిఁ గూర్ప గేళాకుళులఁజ
రించు నంచలకూఁతలు వించుమించు
ప్రకృతియోగిని! నినుఁగాంచి సుకృతినగుదు.

లలితపాథోధిసికతాతలంబునందు
రంగదుత్తుంగవీచికాప్రకరశీక
రవహపవమానమానవరటననటన
ములఁగనుచుఁ గాలవీచికావళులఁ బుచ్చు
ప్రకృతియోగిని! నినుఁగాంచి సుకృతినగుదు.




పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

"ఇక్కడ మునగడం గుండువారి రేవులో తేలం మానూ; అక్కడికి ముందవరు వడితే వాడికి తక్కినవాళ్లు వందరూపాయ లివ్వడం. ఏమంటావు?" అని ప్రకాశము నిక్కచ్చిగా నడుగగా "నేనంటే నేనూ నూ" అని నలుగురైదుగురు విద్యార్థులు సిద్ధపడిరి; గాని యందొకడు "రూపాయల పంటెం యేమిటిరా! ఓడిపోయినవాళ్లు పాతగట్టుమీద యెక్కి నుంచో కుండా మైలుదూరం పరుగెత్తడం. ఏం చెబుతావు?" అని యడిగి తక్కినవారు అంగీకరింపకపోగా తను తగ్గెను.

మొత్తము నలుగురు ముందుకువచ్చిరి. "సంయే" అంటే "సంయో" అనకున్నతగుపంత పైవారిలో నొకడు చప్పటులు చరువగా ఆనలుగురును ఒక్కసారి బుడుంగున మునిగిరి. తక్కినవారందరును ఒడ్డెక్కి గుండువారిరేవు నకు పరుగెత్తుకొనిపోయిరి.

పదిబారలలో నొకడు తేలి "నాఎంటుం ముక్కు యిమూడురూపా యలవుతాయి. సారేస్తాను" అని పలుకుచు నొడ్డెక్కెను. మరి పదిబారలలో నింకొక్కడును. అరఫర్లాంగులో మరియొక్కడును తేలి ఒడ్డెక్కిరి.

అది మాఘమాసము. నాడు ఆదివారము. మార్కండేయస్వామిని సేవింపవచ్చి అనేకజాతుల స్త్రీలు గుండువారిరేవులో స్నానములు చేయుచుండిరి. నీటికాసు బ్రాహ్మణులపని చాలతొందర త్రొక్కుడుగా నుండెను. తక్కువజాతి మగపిల్లలు కొందరు ఈతలాడుచు నడుమనడుమ బ్రాహ్మణులచే నదిలింపబడు చుండిరి.

సాహసముగల విద్యార్థులు కొందరు మెట్లుదిగి నీటిచెంతకుపోగా స్త్రీల శీలమైశిత్యము నెరిగిన మరికొందరు ఒడ్డుమీదనే యుండిపోయిరి. అందరును ప్రకాశ మునకను గమనించుచు గోదావరిదెసకు చూచుచుండిరి "మునిగి యెదురు రావడం ఫర్లాంగుపైగానూ. ప్రకాశంమాత్రం పుంజిపడ్డాడా యేమిటి మనకంటే?" అని మొదట తేలినవాం డనగా "మనం యింతసేపుండం వచ్చాముగాని వాడుమం అక్కడే తేలివుంటాడు" అని రెండవవాం డనియెను. "వాడుగుండా అక్కడే తేలితే మరి రూపాయలుయెవరికి యివ్వడం?" అని మూడవ వాం డడుగగా "కాఫీహోటలువాళ్లకి" అని చప్పటులు కొట్టినవాంత డనియెను.

పైని యిట్లుండగా నీటిలో నొక వృద్ధవాండు "బాబోయి యెంతచేపో" యని యుల్కిపడెను. నీటికాసు బ్రాహ్మణు డొకడు "మొసలి" అని యెగిసిపడెను. ఒక బ్రాహ్మణుడు సంకల్పము చెప్పుచుండగా స్నానము చేయుచున్న యొక బాలిక "అమ్మోయి" అనియెగిరిపడి నీటిలో మునిగెను. కంగారుపడి యిద్దరుముగ్గురుయువతు లామెను లేవదీయుసంతలో ప్రకాశ మామె యెదుట తేలి నిలిచెను.

తోడనే పెద్ద గందరగోళమైనది. "నువ్వు మనిషివికాదూ?" అని యెగసిపడిన బ్రాహ్మణుడు మండిపడెను. చాలమంది స్త్రీలు మొట్టుకొనిరి. "చిన్నాడవా చిలకాడవా? పైగా బ్రాహ్మణుడవు కూడాను. ఇలాంటి పనే చెయ్యడం!" అని యొక ప్రౌఢ కసరుకొనగా "అడ తోడున పుట్టలేదూ నువ్వా? మరిలిగివచ్చి మాపిల్లనిపట్టు కుంటావా? మాసుమరి" అని మగమర తీరముదెస చూచుచు "మీబాబుని తీసుకురా. రమ్మనడూ" అనియొక యువతి పలికెను. అక్కడనేయున్న యామె తమ్ముడు మండిపడుచు బూతులు ప్రారంభించెను. బాలికయింకను గడగడ వడకిపోవుచునే యుండెను. ప్రకాశము ఏమియు చెప్పలేక స్థాణువువలె నిలిచియుండెను. అప్పుడు పై

నున్న విద్యార్థులలో నొకడువచ్చి జరిగిన సంగతి యంతయు చెప్పి ఈపొరపాటు మన్నింపవలసినదని కోరెను; కాని లాభము లేకపోయినది.

ఇంతలో నొక పురుషుడు ముగ్గురుపోలీసులను దీసికొనివచ్చి "అరదండాలు తగిలించండయ్యా యిద్దరికి" అనియెను. పోలీసులు: "ఏంపని చేశావయ్యా" అని ముంగోపముతో నడుగగా "అలా ముద్దుగా స్నానము చేస్తుంటే నేను మాట్లాడకా?" అని యెగిరిపడిన బ్రాహ్మణుడు వీపుమీద పొడిచెను. అప్పుడు ప్రకాశము "నేను చేసినపని చాలాతప్పే; కాని యిది బుద్ధిపూర్వకంగా చెయ్యలేదు. ఈసమయంలో యిక్కడ యింతవంటి స్త్రీలు స్నానంచేస్తూవుంటారన్న వూహే నాకు కలగలేదు. ఇక జరిగిపోయినదానిని గురించి యేమనుకున్నా ప్రయోజనంలేదు, కనక నేను నెగ్గిన నూరురూపాయలూ నీకిచ్చేస్తాను. క్షమించు" అని చేతులుజోడించుకొని పలుకగా బాలిక సిగ్గుపడి మొగము ప్రక్కకు త్రిప్పికొనియెను. ఆమెతల్లి అంగీకరింపబోయెను; గాని కొన్నవంద రూపాయలా? ఎవడికి కావాలి? బంకోలు పంపించేస్తాజూడు నిన్ను. ఇంకా చూస్తారేమయ్యా!" అని పోలీసులను హెచ్చరించెను. కేసు లేకుండా చేసుకోవాలంటే పిల్లకయిదువందలిచ్చి పోలీసోళ్ళకి సమాధానం చెప్పుకో" అని పోలీసులను తెచ్చిన యువకుడనియెను. "అయిదు వందలుకాదు. వెయ్యిరూపాయలు పుచ్చుకొని పైగా ఖైదుచేయించినా పాపంలేదు వీడికి. ఆపిల్లకి నూరు రూపాయలిస్తానన్నాడు. రెండు గంటలనుంచి సంపాదించుకున్న డబ్బులు అయిదు రూపాయలకుపైగా చేతులోవుండగా నీమూలాన్ని గోదావరిలో పడిపోయాయి; మరి నామాట యేమంటావు?" అని యాబ్రాహ్మణుడు తారాజువ్వవలె లేచెను.

విచారణ చేయగా ఆబాలిక వేశ్యయని తేలినది. పైనున్న విద్యార్థులలో నొకడు "నూరురూపాయలిస్తానంటుండగా యింకా వెక్కివెక్కి యేడుస్తుందేమిరా బోగంపిల్ల!" అనియెను. దానిమీద నామెయన్న మండిపడి "పనికిరాదు. స్టేషనుకి తీసుకుపదండి" అని పట్టుపట్టెను.

రాజీ కుదురలేదు. "నీపేరే"మని యొక పోలీసడిగెను. "జంధ్యాల ప్రకాశం. జూప్రాడిని రి కొట్లలో బస. బి. యే. సీనియరుక్లాసు" అని ప్రకాశము చెప్పెను. పోలీసులాతనని వెంటనిడుకొని స్టేషనుకు వెడలిపోయిరి. ఆబాలిక అన్నయగు మాధవరావును, తక్కిన విద్యార్థు లందరును, పోలీసులనుదెచ్చిన యువకుడును వారివెంట వెడలిరి. ఆబాలికయు, అక్కలు, తల్లి మున్నగుస్త్రీలు గుడికిపోయిరి. ఇదియంతయు చూచుచున్న యొకవృద్ధబ్రాహ్మణ వితంతువు "బోగండైతే మాత్రం! ఎదిగినపిల్ల; తప్పుకాదూ?" అని తనదారిని బోయెను. ఆమాట ఆబాలిక నల్లగండెకు చివాలున తగిలెను.

౨

రంగనాయిక—ఆబాలిక తనవాళ్ళతో యిల్లుచేరి పొడిబట్టలు కట్టుకొనునప్పటికి సానులు చాలమంది చేరిరి. ఆమెతల్లియగు రాజామణి జరిగినదంతయు చెప్పెను. పెద్దక్క "రంగమ్మ బేజారై పోయిందే. దానికండ్లె లింకా కొట్టుకుంటూనే వున్నాయి" అనగా పోలీసులను తెమ్మనిన రెండవయక్క "అంతా బ్రాహ్మలే. కోనసీమజట్టులావుంది. లేకపోతే అంతపని చెయ్యరు" అనియెను. మూడవయక్క "పకబాపనోడు"బోగంపిల్ల యెగిసెగిసిపడుతోం"దన్నాడు చూశావా? అసలు మునిగివచ్చినవాడు అతిగేవుంటగా పైనున్నవాళ్ళే యెగిరిపడ్డారు. అందర్నీ ఖైదుచేయిస్తే మంచిది. అనగా నాల్గవయక్క "కేసూవద్దు గీసూవద్దు. పోలీసులనవ్వరిస్తే సరీ బాజాపడుతారు" అనియెను. అందరు నన్నివిధముల ననిరి. రుసరుసలు, వినవినలు, ప్రగల్భవచనములు, చెలరేగెను. రంగనాయికకు "బోగండైతేమాత్రం? ఎదిగినబిడ్డ. తప్పుకాదూ?" అనుమాట ఖంగుఖంగున వినబడినట్లయ్యెను. ఈస్థితిలో మాధవరావువచ్చి "వాడెవ్వడైతే నాకేం? ఖైదులోపెట్టించేస్తా చూడు"మని యారచించెను. "ఏమాయిన"దని యొకసాని యనగా "బసా, పేరూ, అన్నీ రాసుకుని విడిచిపెట్టేరు. రేపు కేసుపెడతారు" అని యాతడు బదులుచెప్పెను.

ఎవరియింటికి వారు వెడలిపోయిరి. భోజనములగునప్పటికి రంగనాయిక అక్కల సగసులు —ఒక

బ్రాహ్మణుడు, ఇరువురువైశ్యులు, ఒకచౌదరి వచ్చిరి. అందరును దూరముగా నుండియే జరిగినదానికి నొచ్చుకొనిరి; గాని పోలీసులను తెచ్చిన వైశ్య యువకుడు "నేనెంతపని చేశానో చూశావా?" అని రంగనాయిక చేయిపట్టుకో బోయెను.

చేతిమీద చేయిపడినది; అంతే. ఇంకను పట్టుకొనలేదు. వెంటనే యామె త్రాచుపిల్లవలె "భోగం దాన్నయితేమాత్రం? చెయ్యి పట్టుకోవడమే?" అని కస్సుమనియెను. రాజామణి అసంతుష్టయై యుండకుండగా పెద్దక్క "యిప్పుడా మరిదిగారూ వేశ్యాకోశం?" అని బొమలు ముడుచుకొనియెను.

"మీరు చెయ్యి చేసుకుంటారండీ మాట్లాడితేనా" అనియాతనిసాని విసుగుకొనియెను. బ్రాహ్మణుడు "తొందరపడ్డావు" అనగా చౌదరి "అసలు రంగం ఉడికిపోతూవుంది పాపం" అనియెను.

రాజామణి బ్రాహ్మణునితో ఏదో చెప్పబోవుచుండగా రంగనాయిక "సానయితే యింత లోకువా? నాకక్కరలేదు సానరికం" అని చివాలున లోపలకు పోయెను. అందరును మొగముగములు చూచుకొనిరి. దోషి స్తబ్ధుడై తనగదికి పోయెను. తక్కినవారందరును కొంతసేపు రంగనాయిక శౌర్యమును గురించి మాట్లాడుకొని వెడలిపోయిరి.

రాజామణి శయ్యమీద బోరగిలపడి పడుకొనియున్న బిడ్డను "రంగా"యని పలుకరించెను: కాని యామె పలుకలేదు. "ఇంత శౌర్యం అయితే యెలాగే తల్లీ?" అనుచు రాజామణి ప్రక్కలో పరుండగా రంగనాయిక మొగముమాత్ర మివ్వలకు త్రిప్పుకొని "నేను చెయ్యలేనమ్మా సానరికం. నాకు పెళ్లిచేసెయ్యి" అని మరల యథారీతిగ పరుండెను. ఆమాటవిని యామె ఉలికిపడి ఆలోచనాధీన యయ్యెను.

రంగనాయిక పదునాలుగేండ్ల బాలిక. రజస్వలయై యారుమాసములైనది. ఇంకను కన్నెరికము కాలేదు. వీణావాదనము నేర్చుకొనుచున్నది. అక్కల సరసులామె కొకవరుని కుదుర్చుటలో వ్యగ్రులైయుండిరి. కన్నెరికము చేయుటకొక వర్తకుడు అంగీకరించెను; గాని అయిదువందలా ఎనిమిదివందలా యని వ్యవహారము నడుచుచుండెను. రాజామణి తన యీకడసారపు బిడ్డకు ఒక వైష్ణవునిచే కన్నెరికము చేయింప గోరుచుండెను; కూతుళ్లు ఆ యాలోచనమును ప్రత్యాఖ్యానములు చేయుచుండిరి.

కానిఅయితే పదునాలేండ్ల బాలికయే. అయినను సానులతోడను, సరసులనడుమను మసలుచున్న దగుటచే నామెకు కొంత ప్రౌఢిమ అబ్బియుండెను. ఈకారణమువలన ఆమె వృద్ధబ్రాహ్మణు వితంతువుమాటను చక్కగ బోధపరచుకొనగలిగెను. సహజముగ నామెమోస్తరు వేరు. ముక్తసరు మనిషి. అక్కలవలెన రాసికొనుచుతిరుగదు. అందుచేత వారప్పుడప్పుడామెను "ఇలాఅయితే సరసుణ్ణిబాగా మెప్పిస్తావు" అనీ, "బువ్వబాగానే వస్తుందనీ" యనుచుందురు. అప్పుడెల్ల నామె "పోనీలెండి. వచ్చినంతలోనే గడుపుకుంటాను. నాగుణాలు నచ్చిన సరసుడే వుంటాడు. అసలు నేను మంచి బ్రాహ్మణ్ణి చూసిపెండ్లాడివెళ్లిపోయి వారింట్లో చాకిరీచేస్తూ బతుకుతాను" అనుచుండును.

## 3

మరునాడు పోలీసులు ప్రకాశముమీద కేసు పెట్టిరి. మాధవరావు వెంటవచ్చి ప్రకాశము కాలేజీలో తరగతిలో నుండగా నోటీసు ఇప్పించెను. దొర "యేమి" టని యడుగగా ప్రకాశము జరిగినదంతయు చెప్పెను. మరియొకచో పాఠములు చెప్పుచున్న వీరేశలింగము పంతులును పిలిచి దొరయంతయు చెప్పెను. ఇద్దరును ఒక్కక్షణము నిశ్శబ్దముగా నుండిరి. "నాతో చెప్పావు కాదేమీ?" యని పంతులడుగగా ప్రకాశము "ఇంతవరకూ వస్తుందనుకోలేదు" అనియెను. దొరగంభీరముగా చూడగా పంతులు ఆచూపుల నందుకొని వెడలిపోయెను.

వాయిదా రేపనగా ప్రకాశము పబ్లికు ప్రాసిక్యూటరగు రామదీక్షితుని యింటి కరిగెను. అప్పటి కప్పుడే వీరేశలింగము పంతులు వచ్చియుండెను. ప్రకాశము నమస్కరించి యిట్లు మాట్లాడెను.

"వేశ్యాబాలికపక్షంగా తమరు దాఖలుచేసిన కేసులో నేను ముద్దాయిని——"

"అలాంటి పని చేశావేమి అబ్బాయీ?"

"నేను చేశానా అని నాకే సందేహం; కాని జరిగిపోయిందిమాత్రం తప్పులోనే చేరుతుంది"

"ఇంకా నింపాదిగా అంటున్నావా? పెద్దశిక్షనే పడింది"

"అది మీచేతిలో వుంది. నేనిక్కడ బి. యే. సీనియరు తరగతి చదువుతున్నాను. ఈకేసులో మీరు దాఖలుచేసిన ప్లయింటు చూడగా నా భవిష్యజ్జీవితాన్ని గురించి చాలాభయం కలుగుతూవుంది. నాలుగోతరగతి మొదలు యింతవరకూ అపజయమనేదిలేకుండా యొకా యికూకేని పైకివచ్చాను. చాలామాట్లుతమరుగూడా నాకు చందా లిచ్చివున్నారు కనక నాబీదతనాన్ని గురించి మళ్లీ చప్పవలసిన పనిలేదు."

"తప్పుచెయ్యడానికి బీదాసాదా భేదంవుందా?"

"అదిగాదు నేను మనవి చేసుకునేది. నేనుఅల్లరి జట్టులోనివాణ్ణి కానని నావిశ్వాసం. వీరేశలింగం పంతులుగారు నాగురువులు.—"

"బాగుపడతావు?"

"కాని మీరు దాఖలుచేసిన కేసు—"

"నన్నేం చెయ్యమంటావు. నువ్విలా ప్రవర్తించావు"

నావుద్దేశాన్ని తమరు విమర్శించాలని కోరుతున్నాను. స్టీమరురేవులో మునిగి గుండువారిరేవులో తేలడానికి మాక్లాసువాళ్లం పోటీలుపడ్డాము. అందుకు యౌవనంయొక్క వ్యగ్రోత్సాహంతప్ప వేరేమీ కారణాలు లేవు"

"అది వ్యగ్రోత్సాహం అని నువ్వు చెప్పేటప్పుడు దానివల్ల యిలాంటివి సంభవిస్తాయని నే నింక చెప్పడం—"

"అంతటా ఫలం అలావుండకపోయినా ఆసమయంలో నావిషయంలో అలాగే జరిగింది"

"మునిగిజల్లి తేలడంలో స్త్రీసంఘంలో అలా జరిగిందంటావు. ఇంతేనా నువ్వుచెప్పేదీ?"

"సరిగా అంతేనండి. ఆసమయంలో అక్కడ అంతమందిస్త్రీలు వుంటారని వూహించలేకపోయాను"

"స్త్రీలు కాకపోతే పురుషు లుంటారు. లేకపోతే పడవవుంటుంది. ఎలాగయినా ఆరేవులో తేలేటట్లు పందెంవేసుకోవడంతప్పే"

"తప్పే అయింది. కనకనే పశ్చాత్తాపం"

"విప్రాః పశ్చిమబుద్ధయః"

"అది జాతి కంతకీ చెందిన కళంకం"

"ఇంతకీ నువ్వుచెప్పే దేమిటో?"

"జరిగిపోయిన సంగతికి మూలం యేమిటో, యెలా జరిగిపోయిందో మనవిచేశాను. నాస్థితి మనవి చేశాను. నాప్రార్థన యేమంటే? ఆపందెంలో నేను నూరురూపాయలు గెలిచాను. అవి ఆబాలికకు దాఖలు చేస్తాను. కేసుతప్పించి నన్నుకటాక్షించాలి తమరు."

"కోరిక మంచిదే. కేసులు రాజీకావడమే నా వుద్దేశం"

"ప్రయత్నిస్తే తమకు వ్యతిరేకం జరగదు. కళంకం రికార్డుయిపోవడం వకటే, నాభవిష్యత్తు ధ్వంసంకావడం వకటేనీ. తమరు బాగా యోచించాలి"

దీక్షితులు దీనికి సమాధాన మాలోచించుచుండగా వీరేశలింగముపంతు లందుకొనియెను.

"దీనికి పర్యవసానం యేమిటో?"

"రెండువేలదాకా జరిమానా రెండేళ్లదాకా వరకమూనూ. అధికారి తన యిష్టాన్ననుసరించి యిందులోయేదో వకటిగాని, రెండూగాని విధించవచ్చు."

"ముందు రుజువుకావాలన్నమాట."

"అంటే?"

"ముద్దాయీ యేవుద్దేశంతోవుండగా ఆపని జరిగిందో ఆవిషయం తేలవద్దూ?"

"జరిగిపోయినదానికేమో రేవంతాసాక్ష్యమే—"

ఈసమయమున ప్రకాశ మందుకొని "నేను జరిగిన సంగతంతా యిందాకానే మనవిచేశాను. కోర్టులో గూడా ఇలాగే చెబుతాను. దీనికి సాక్ష్యమే అక్కర

లేదూ. ఇది జరగలేదని వాదించను. క్షమించవలసిందనే మొదటినుంచీ నాప్రార్థన అని చెప్పెను.

"కష్టసుఖాలూ, లాభనష్టాలూ, మంచిచెడ్డలూ వివరించి చెబుతాను. ఆయింట్లో తల్లిపెత్తనం వుంటే మాత్రం రాజీజరుగుతుంది. కాని ఆపిల్ల అన్న చాలా పట్టుదలగా వున్నాడు. అప్పుడు నీవాళ్ళేమో బోగం జాతిని నిందించారట. పంతులుగారూ! అతనొక్కమాట చెప్పాడు. అదిమీతో చెప్పడం నాకు యిష్టంలేదు; దానికి నేనూ అంగీకరించలేదు. రాజీకి అదొక్కటే మార్గంకాదు. ఆపిల్లాడు—"

"ఏమన్నాడూ?"

"చెప్పమంటారా?"

"వచ్చినకేసు సన్నమైనదికాదు. దానికి సంబంధించిన ఆలోచనలు తగినట్టుగానే వుంటాయి. అయినా వినడాని కేమి?"

"మీశిష్యుడు ఆపిల్లకి కన్నరికం—"

ఈశబ్దము వినుటయే తడవుగ ప్రకాశము శ్రీహరీ యని చెవులుమూసికొనియెను. పంతులు ఉలికిపడెను.

"అందుకోసమే నేను చెప్పనన్నాను"

"ఆపిల్లాడు అలా అన్నాడా?"

"అవును. రాజకావాలంటే అదొక్కటే మార్గం అంటాడు."

"అందు కింకెవ్వరూ దొరకరూ?"

"లోటా? పిల్ల దీపంలావుంది. చాలా తెలివైనది. శీలం చాలా నిశితమైనదని తలుస్తాను."

"ఏమన్నారూ?"

"పరపురుషుడు తన్ను తాకినందుకు ఆపిల్ల చాలా కింనపడుతోంది"

"అయితే వకపని చేస్తారా?"

"ఏమిటది?"

"ఆపిల్లతల్లిని మాతోటలోకి వకమాటు పంపించగలరా?"

"దానికేమీ?"

"అయితే సరే."

ఇట్లుచెప్పి పంతులు సెలవు పుచ్చుకొని బయలుదేరెను. ప్రకాశముగూడ దీక్షితునకు నమస్కరించి బయలుదేరెను. రాత్రి పదిగంటలకు రమ్మని ప్రకాశమును పంపివేసి పంతులు తనతోటకు వెడలిపోయెను.

## ౪

దీక్షితుని వర్తమానమును విని సానులందరును తెల్లపోయిరి. పంతులుకు వేశ్యలనిన బద్ధవైరమని అందరు నెరుగుదురు ఎందుకో యెవరికి నేమియు తోచలేదు. రాజామణి బయలుదేరగా పెద్దకూతురుగూడ వెంటబడెను.

రాత్రి యెనిమిదిగంట లైనది. అప్పుడే భుజించి వచ్చి పంతులు వెన్నెలలో పడకకుర్చీమీద కూర్చుండెను. సానులు వచ్చి నమస్కరింపగా ఆతడు కూర్చుండ గోరెను; గాని తల్లికూతుళ్లు ఇద్దరును వినయమును జూపి నిలిచియే యుండిరి. అందుకు పంతులు "లోకంలో జరిగే సంగతులు నాకు బాగా తెలుసును. ఎటువంటి వాళ్ళూగూడా మిమ్మల్ని కూచోమనడం తమకు అగౌరవమని భావిస్తారు. కాని నావుద్దేశం అది కాదు. నాయెదుట మీరు ఆకుర్చీలమీద కూచోడం నాకు అమర్యాదకాదు. ప్రకృతం హిందూసంఘం స్త్రీల గౌరవాన్ని మరిచిపోయి వుంది. అంచేతనే దేశం యిప్పుడిలావుంది. ఇంగ్లీషు దొరతనం రాబట్టిగాని లేకపోతే మనం యింకా అధోగతిపాలై వుందుము. నోరుమాలిన వయస్సులో మీరీపాడు వృత్తిలో ప్రవేశపెట్టబడ్డారు. మీవృత్తిని నే నసహ్యించుకుంటాను; కాని మంచి వుద్దేశంతో కబురుపంపించాను గనుక మిమ్మల్ని గౌరవించడం నావిధి. ఒక్క నాభార్యాతప్ప తక్కిన స్త్రీలంతా నాకు తల్లులూ, తోడబుట్టువులునూ. కనక మీరా కుర్చీలమీద కూచోండి" అని చెప్పెను. చేయునదిలేక సానులు కూర్చుండిరి. "వీరేశలింగం పంతులుగారు యిటువంటివారా?" అని సానులు ఆశ్చర్యపడిరి. పంతు లడుగగా రాజామణి తన కుటుంబపు సంగతులన్నియు చెప్పెను. పంతులు యిట్లు చెప్పెను.

"నేనిప్పు డొకసంగతి చెబుతున్నాను. ఉలిక్కిపడకండి రాజామణీ! నువ్వు పెద్దదానవు. నీకు సంగతు

లన్నీ తెలుసును నలుగురు కుమార్తెల్ని సానరికంలో దింపి కష్టమో, సుఖమో, లాభమో, నష్టమో అనుభవి స్తూ వున్నావు. కనక రంగనాయికకు పెళ్లి చేయకూడ దూ? అప్రయత్నంగా ఒక పురుషుడు తన్ను తాకినందుకు ఆమె విచారిస్తోం దని చెబుతున్నావు. సంసారిణికి వుండ వలసిన శీలస్థైర్యం ఆమెకు పూర్తిగా వున్నట్లు నాకు తోస్తూవుంది."

"మాపిల్ల సానిగా వుండడానికే మున్నట పడు తూ వుందండి."

"అది శుద్ధాబద్ధం. యిప్పు డడిగి చూడు."

"ఇప్పటికీ దానికదే అభిప్రాయమండి. కాదం టే తమరుగూడా అడిగిచూడవచ్చు."

"నువ్వు నాకలాంటి అవకాశంయిస్తే యిక లేని దేమిటి? రంగనాయిక నిప్పు డిక్కడికి రప్పించగలవా?"

రాజామణి చెప్పగా పెద్దకూతురు బండియెక్కి వెడలిపోయెను. ఈప్రస్తావము ఆమె చెప్పగా యింట నందరును తెల్లవోయిరి. రంగనాయిక మాత్రము యింక ను వినుటకాత్రము చూపెను. ఆమెకు "బోగండ్లై తే మాత్రం? ఎదిగినబిడ్డ. తప్పుకాదూ?" అనుమాట స్ఫుర ణకు వచ్చెను. తోడనే ఆమె బయలుదేరెను. అదిచూచి తక్కిన అక్కలు ముగ్గురునుగూడ బయలుదేరిరి. అందు కు వారిసరసులు తొలుత ససమ్మతిని జూపిరి; గాని తుద కంగీకరించిరి.

వీరు వచ్చులోపల పంతులు రాజామణి కనేక విషయములు చెప్పెను. రాజామణిగూడ చాలసేపు వాదించినది. "సానులు వుండడమూ, మానడమూ అంటే మానడానికి నేనేకాదు సంఘమే వప్పుకోదు; కాని నా బిడ్డకి మీరు పెళ్లిచేస్తానంటే మీరుచెప్పిన కారణాలవల్ల వప్పుకుంటాను. సాధ్యమైతే మీరు ప్రయత్నించవచ్చు వని యామె చెప్పినది. ఆమె యీమాటలు ముగించు చుండగా అందరును వచ్చిరి. అందరికంటెను ముందుగా రంగనాయిక పంతులుకు నమస్కరించి తల్లిచెంత నిలిచి పంతులు పిలువగా యెదుటికిబోయెను. అందు కానం దించి పంతులు లేచినిలిచి, రాజామణినిజూచి "మీరు చూస్తూనే వుండవచ్చును నీకూతుర్ని. మామాటలు మీకు వినబడకుండా వుండేటంత దూరంగా తీసుకుపోయి కొన్నిమాటలు చెప్పవలసివున్నాయి. ఏమంటావు?" అనియెను. రాజామణి యందు కంగీకరింపగా పంతులు బయలుదేరెను. పిలువకుండనే రంగనాయిక పంతులు వెంట వెళ్లెను.

పంతు లొక చెట్టుక్రింద కూర్చుండగా రంగనా యికగూడ కూర్చుండెను. పిదప నిరువురును సంభా షణ ప్రారంభించిరి; గాని అది యెవరికిని వినబడనిది.

అక్కడ యేకాంతసంభాషణ జరుగుచుండగా యిక్కడ గుసగుసలు ప్రారంభమయ్యెను. "రంగమ్మకి పెళ్లి చెయ్యగూడదటే?" అని తల్లి యడుగగా పిల్ల లంద రందుకొనిరి. "కన్నెరికంతరవాయిగా సానయి వుండగా యిప్పు డెవరు పెళ్లాడుతారూ?" అని యొకతె యడిగెను. "అదికూడా సానయితే మనమేళంలోకి యికపరాయిసాని పనివుండదు" అని యొకతె పలికెను." "కేసు యేమవుతుందో తేలీదాకా యేమాటా చెప్పలే" వని యింకొకతె యనియెను. "సానరికంలోవుండే లాభ నష్టాలు మనం చూస్తూనే వున్నాము. పంతులుగారు చెప్పేమాటలుగూడా బాగానే వున్నాయి" అని పెద్ద పిల్లచెప్పెను. ఒక్క అరగంట గడచినతరువాత పంతు లువచ్చి కుర్చీమీద కూర్చుండగా రంగనాయికవచ్చి తల్లిచెంత నిలిచెను. "ఇప్పు డడగండి యేం చెపుతుందో." అని పంతులనగా అందరును ఒక్కమారే "రంగా! పెళ్లా డతావా?" అని యడిగిరి. వెంటనే ఆబాలిక ముక్తకం ఠముతో "ఆడతాను" అని చెప్పెను. పంతులుకు ఆనం దము వెల్లివిరిసిపోయెను. సానులకు విద్యుద్ఘాతము తగిలినట్లయినది.

"నా ప్రయత్నం చాలావరకు ఫలించింది. ఇక మీరేమంటారూ?"

"చెప్పడాని కేంవుంది? మారంగమ్మ పద్ధతి మొదటినుంచీవేరే. అది యిదివర కప్పుడప్పుడు "పెళ్లాడ తాను" అంటూనే వచ్చిందిగాని ఆకోరిక యింత దృఢం గా వుంటుందని మేము అనుకోలేదు"

"సరే."

సానిగావుండి నెగ్గ
మంచిదిగా

నుకుంటూ వుంటాను. ఏమనీ?
స్త్రీలువుంటారనీ, కుల స్త్రీలలో సానులు
ంనినీ”

“యథార్థం.”

“స్త్రీకి పదహారేళ్లేనా వస్తేగాని యీవిషయం తెలదు. కనక అందాకా పెళ్లిచెయ్యకుండా వుంటే మంచి దనుకుంటాను.”

“నువ్వు పెద్దవిషయాలు ప్రస్తావిస్తూ వున్నావు. నువ్వుచెప్పే మాటన్నిపట్టి మాస్త్రీ శీలస్థైర్యము ఉన్న వాళ్లకే పెళ్లిచేస్తే మంచిదని తేలుతుంది.”

“అవునండి.”

“అయితే అసలు పెళ్లియొక్క వుద్దేశం యేమిటి? ధర్మప్రజాసంపత్తి అని ఆపస్తంబాదులు చెప్పేరు. ప్రజోత్పత్తి కులటలలోగూడావుంది కనక ధర్మమే ఆరెంటిలో ప్రధానం. అనగా స్త్రీగాని పురుషుడుగాని ఏకచారత్వాన్ని విడిచిపెడితే వారి వివాహం భ్రష్టమైపోయిందన్నమాట.”

“అందుకు సందేహం వుందాండి?”

“ఉందని యెవరు చెప్పగలరూ? దీనివల్ల వివాహం అనేది స్త్రీకి పురుషుడికీగూడా ఐచ్ఛికం అని తేలుతూవుంది. హిందువులు పురుషుడు బ్రహ్మచారిగావుండిపోతే అంగీకరిస్తారు; కాని స్త్రీ కన్యగా వుంటే గోల పెడతారు. పురుషుడు ఎన్ని పెళ్లిళ్లు చేసుకున్నా వూరుకుంటారు; కాని స్త్రీపునర్వివాహం చేసుకుంటానంటే మండిపడతారు. పురుషుడు వకభార్యని విడిచిపెట్టి- అంటే ఆమె జీవితాన్ని నాశనంచేసి- యింకో స్త్రీని పెళ్లాడితే యెవరూయేమీ అనరుగాని స్త్రీకి అలాంటి అధికారం లేదంటారు. మొత్తానికి హిందూసంఘంఅంతా యిలాంటిదోషాలతో నిండివుండడంచేతనే యింతగా కూలిపోయింది.”

“చిత్తం.”

“శారపాట్లు అంతటా వుండవచ్చును. మూఢవిశ్వాసాలు అన్నిమతాల్లోను వుండవచ్చు; గాని హిందూజాతిలాంటి మూఢజాతి ప్రపంచకంలో లేదు. ఈజాతిలోకూడా పెద్దపెద్ద మహానుభావు లుద్భవించారు గాని అందరుకూడా అనాలోచితంగా వర్ణవ్యవస్థకి కట్టుపడడంచేత సంఘం కుళ్లిపోయింది.”

“చిత్తం.”

“ఇవి యిలా వుండనియ్యి. ప్రకృతాంశానికి వద్దాను. నాప్రయత్నం చాలావరకు ఫలించింది. పర్యవసానం రేపుసాయంత్రం చెబుతాను. రంగనాయికి స్త్రీరత్నం. ఆమెకి తగిన పురుషరత్నం నా దృష్టిలో వున్నాడు. అత సంగీకరిస్తే రేపురాత్రి అతనూ నేనూ మీయింటికి వస్తాము. అత నంగీకరించకపోతే నేను మీతో యిక మాట్లాడను. ఎవణ్నో వకణ్ణి తీసుకు వచ్చి రంగనాయికను పెళ్లిచేయడం నాకిష్టం లేదు. మేము వచ్చినా రాకపోయినా రేపురాత్రి పదిగంటలుమొదలు పదికొండుగంటలదాకా మీయింటో నువ్వూ, నీకూతుళ్లయిదుగురూ తప్ప మరివక స్త్రీగాని పురుషుడు గాని వుండకూడదు ఈలోపుగాగాని తరవాతగాని— అంటే అయిపోయేదాకా రంగనాయికి పెళ్లిసంగతి యెవరికీ— నీఅల్లుళ్లకీ, కొడుక్కీ కూడా— తెలవకూడదు.”

“నాకొడుక్కి తెలవకపోతే యెలాగండి?”

“తెలవకపోతేనే మంచిదని నావుద్దేశం.”

“అంతఃకలహాలు—”

“అవునవును. ఈరహస్యం సంగతి ముందతనితో గట్టిగా చెప్పు. రహస్యభేదనం అయిందంటే కొన్ని చిక్కులు వున్నాయి.”

“చిత్తం.”

“మరి మీ రిక వెళ్లండి”

“దణ్ణాలు.”

“శుభం. మీమంచిబుద్ధికి నేను చాలా సంతోషించాను. ఈశ్వరుడు మిమ్మల్ని రక్షిస్తాడు. రంగనాయిక పెళ్లిచేయగలిగితినా అది నాజీవితానికంతా ప్రకాశం కలిగిస్తుంది. మరివెళ్లండి.”

సానులందరును పంతులుకు నమస్కరించి బయలు దేరిరి. పంతులు "రంగా!" అని పిలువగా ఆమె నిలిచి పోయెను. పంతులు లేచి ఆమెచెంతకువచ్చి "అమ్మా! నీవు చెప్పవలసిందేమీ లేదు. నీమూలంగా మీజాతి బాగుపడుతుంది. దేశం బాగుపడుతుంది. నీవు చెప్పిన మాటలు మరిచిపోకు. తల్లీ! రేపురాత్రిదాకా నేనుచెప్పిన రహస్యాన్ని కాపాడు" అని చెప్పెను. రంగనాయిక శిరమువంచుకొని "చిత్తం" అని పలికి మరియొకమారు నమస్కరించి తనవారిని కలిసికొనియెను. పంతులు బ్రహ్మానందపరవశు డయ్యెను.

౫

చెప్పినచొప్పున మరునాటిరాత్రి తొమ్మిదిగంటలకు పంతులు రాజామణియింటికి వచ్చెను. రాజామణి స్వాగతమిచ్చి చూడగా పంతులువెనుక ప్రకాశ ముండెను. రంగనాయిక సిగ్గుపడెను. ఆమెయక్కలు తెల్లపోయిరి.

పంతులు కుర్చీమీద కూర్చుండగా ప్రకాశ మాతనిపాదముల సన్నిధిని కూర్చుండెను. సాను లందరును యెదుట కూర్చుండిరి. పంతులు పిలువగా రంగనాయిక ఆతనికుడిప్రక్కన నిలిచెను.

"వరుణ్ణి తీసుకొనివస్తానని నిన్నరాత్రి చెప్పెను. ఈశ్వరానుగ్రహంచేత ఈవాళ అలా రాగలిగేను. ఇతణ్ణి మీరు చూసేవున్నారు. ఇతనిమీద కసిగాకూడా వున్నారు. అయినా రంగనాయికని పెళ్లాడడానికి యింతకంటే మంచివరుడు పృథివిమీద లేడు. ఇతను స్వచ్ఛమైన వెలనాటి కుటుంబంలో పుట్టిపెరిగాడు. కాని బీదవాడు. 'మా'అన్న శబ్దం లేదు. తల్లిదండ్రీకూడా లేరు. ఒక్కసోదరిమాత్రం వుంది. ఆమె భర్తతో కాపురం చేసుకుంటూవుంది. ఇతను మెట్రిక్యులేషన్ మొదలుకొని వక్కతరగతిలోనైనా అపజయం అనేదిలేకుండా పైకివచ్చాడు. ఈయేటితో—అంటే వచ్చే మార్చితో బి. యే. అయిపోతాడు. ఇతనికున్న ధనంఅంతా అదే నాలుగుసంవత్సరాలనుంచి నాశిష్యుడుగా వున్నాడు. సంవత్సరం క్రిందట వితంతువుని పెళ్లాడడానికి నిశ్చయించుకున్నాడు. అయితే యిప్పుడు బ్రహ్మసమాజంలో కలవవలచి నాదగ్గరకు రూపవతీ అయిన టున్నాడు. కన రించినాడు. ఇతను మీ గని మీకు కోపంగదా ? ఆమెను పెళ్లాడుతున్నాడు. ఇంకేమి

"బాగానే వుందండి. ప్రస్తుతం మా గురించి కొంచెం చెబుతాను. మంచో చెడ్డో యీజాతి యిలా నడుస్తోంది. మాలో పెళ్లిళ్లుకూడా జరుగుతూనే వున్నాయి. కాని మంచివరులు దొరకడంకష్టం. ఈకారణంచేతగూడా కొందరు తమబిడ్డల్ని సానులుగా చేస్తున్నారు. అగ్రజాతులవారెవరేనా పెళ్లాడడానికి సిద్ధపడితేనూ పిల్లలలో అనేకమంది కులస్త్రీలు అవుతారు."

"నువ్వన్నమాట చాలా మంచిదే. ఇందులో రెండుకష్టాలు వున్నాయి: పెళ్లిచెయ్యడానికి సానులు అంగీకరించడం వకకష్టం; సానికూతుర్ని పెళ్లాడడానికి అగ్రజాతుల యువకులు సిద్ధపడడం అంతకంటె కష్టం. రంగనాయిక పుణ్యం మంచిది కనక నువ్వూ మా ప్రకాశమూగూడా చటుక్కున అంగీకరించారు."

"మీరు తెచ్చినవరుడు నాకిష్టమే. మరి నా బిడ్డ యేమంటుందో?"

"తక్కిన నీసహోదరీలేమంటారు?"

"ఏమ్మా రా?"

"నాకిష్టమే."

"నాకంగీకారమే."

"నాకు వప్పుదలే."

"నాకూ సంతోషమే."

"సెబాస్! ఇకరంగనాయిక సంగతా? ఆమె నిన్నరాత్రే అంగీకరించింది. లేకపోతే నేను ప్రకాశాన్ని యిక్కడికి తీసుకురాకనే పోదును. అయినా మీరుకూడా వినవలసిందే. అమ్మా! రంగనాయికా! నీవుద్దేశం చెప్పు."

"నేను వారినే పెళ్లాడతాను."

రాజామణి తటాలున ఆమెను కౌగిలించుకొనియెను. అక్క లందరును చుట్టుకొని లాలించిరి.

పిదప పంతులు రంగనాయకను, ప్రకాశమును ఒకబల్లమీదకూర్చుండజేసి ఒకరిచేతనొకరికి తాంబూలా లిచ్చి దీవించెను. సానులుకూడ దీవించిరి. పంతులు పౌర్ణమివెళ్లిన రెండవదినమున (ఆరుదినముల గడువు) వివాహమని చెప్పి బయలుదేరెను.

వెళ్లుచు వెళ్లుచు నాతడు సానులనందరిని సంబోధించి "మీకు తెలపందేమీ లేదు. అనేక కారణాలచేత యీ వివాహవిషయం మీ రతిరహస్యంగా వుంచాలి. మీ సరసులకిగూడ తెలపనివ్వకూడదు. పెళ్లినాటి మధ్యాహ్నం మీకు కావలసినవాళ్ల నందరిన్నీ పిలుచుకోండి. అప్పుడేనా వరుడు ఫలానా అని చెప్పవద్దు. ఈవివాహం చూడడానికీ, దంపతుల్ని ఆశీర్వదించడానికీ నాతోగూడా పెద్ద లనేకులు వస్తారు. అందర్నీ మీరు గౌరవించాలి. పీటలమీద కూచునేటప్పుడు మాత్రమే వరుడెవరో అందరికీ తెలవాలి" అని చెప్పి వెడలిపోయెను.

పిమ్మట ఆతల్లీకూతు ళ్లందరును వరవర్ణనము ప్రారంభించిరి. పెద్దపిల్ల "శాంతమైనవాడు" అనియెను. పోలీసులకు తెప్పించినపిల్ల "ఆవేళ గోదావరిలో నేను మొగం సరిగా చూడనే లేదు. చామనచాయ అయినా రంగమ్మకి తగినవాడే. నున్నపాపిడి క్రాపింగు నేత మొగం యెంతో బాగుంది. కళ్లల్లో నిదానమూ, గాంభీర్యమూ వున్నాయి. మొగం కలకల్లాడుతుంది" అనియెను. మూడవ కూతురు "ఇరవై యేళ్లకంటే ఎక్కువ వుండవు. నూగు మీసాలలో యెంతో చక్కదనం వున్నది" అనియెను. నాల్గవపిల్ల "పొడుగూ పొట్టీ కాదు. లావూ సన్నమూ కూడా కాదు. అన్నివిధాలా చెల్లాయికి తగినవాడు" అనగా రాజామణి "బి. యే., అయిపోతాడుట, పెద్దవుద్యోగం అవుతుంది. రంగం అదృష్టం" అనియెను. ఇట్లు కొంతతడవైన తరువాత "పెళ్లికొడుకుసంగతి జాగ్రత్త" అని చెప్పి రాజామణి పోయి శయనించెను. సినీమాకు పోయిన సరసులు వచ్చునంతవరకును ఆ యక్కచెల్లెండ్రు ప్రకాశము సంగతియే చెప్పుకొనుచుండిరి.

## ౬

అటు కస్తూరికపు బేరములు జరుగుచుండగా ఇటు వివాహనిశ్చయము. వేశ్యావాటిక అంతయు గందరగోళముగా నుండెను. సానులకంటె విటులే ఆశ్చర్యపడసాగిరి. ఎవరి నడిగినను, ఎట్లు ప్రయత్నించినను వరుని సంగతి తేలలేదు. మాధవరావుగూడ "చెప్పలే" ననియెను.

అంతవరకును రహస్యముగ కస్తూరికపు బేరాలు చేసిన షాహుకారు ఇప్పుడు బయలుపడెను. ఎనిమిదివందలకే అంగీకరింపని యాతడిప్పుడు వేయున్నూట పదారు లిచ్చెద ననియెను. అయినను ఆయాశ వదులుకొమ్మని జవాబు వచ్చెను. రంగనాయకను చూపినను చాలునని రెండుసారులు వచ్చెను; గాని లాభము లేకపోయెను. ఎంతో ప్రాధేయపడగా "మరివకని భార్యని నీవెందుకు చూడాలయ్యా?" అని ప్రత్యుత్తరము వచ్చెను. "పెళ్లికొడు కెవరో చెప్పండి" అని యడుగగా రాజామణి "మీ కేమిపని?" యని కచ్చితముగా నడిగెను.

కచేరీలో రావదీక్షితుడే విచారణకు వాయిదా కోరెను. "పిల్లకి పెళ్లిచేస్తారుటే"యని పోలీసు లడుగగా దీక్షితుడు "దానికల్లునకిచ్చినబా. యేమిటో?" అనియడిగెను "మీకేసుకోసం మమ్మల్ని పెళ్లిమానుకోమంటారుటండీ?"యని రాజామణి యడిగెను. "పెళ్లికీ కేసుకీ సంబంధం యేమిటి? మీ ప్రయత్నాలు మీరు మానవద్దు. ఇంట్లో నా పెత్తనం యేమీ సాగదు. నామట్టుకు నేను మీరెలా చెయ్యమంటే అలా చేస్తాను" అని మాధవరావు చెప్పెను. "కేసు తీసేసుకుంటాం మాకు ప్రజంటుమట్టు చెప్పు" అని ప్రకాశము నడుగగా నాతడు "మళ్లీ యీ ప్రస్తావన తెచ్చారంటే మీసంగతి దొరకి రిపోర్టు చేస్తా" ననియెను. వారిని పిలిచికొనివచ్చిన వైశ్యయువకుడు "ఆవేళ మిమ్మల్ని పిలవమంటే పిలిచాను. ఇందులో నా పూచీ యేమివుంది?" అనియెను. వివాహముసంగతి డిప్టీసూపరెంటికి చెప్పగా "పెళ్లి నిలుపుచెయ్యడానికి మనకేమేనా అధికారం వుందా?" అనియెను. చేయునది లేక సబిన్స్పెక్టరు మొగము దిగాలు వేసికొనియెను.

సర్కిలు ఇనస్పెక్టరు "పెళ్లికొడుకెవరో తెలుసుకోండి" అనిచెప్పెను; గాని యెవరును ఆప్రయత్నముచేయలేదు.

వివాహదినము వచ్చినది. మాధవరావు గృహాలంకారమున చాలనైపుణ్యము చూపెను. సరసులు అవసరవస్తువులనన్నిటిని సమకూర్చిరి. రాజామణి మధ్యాహ్నము బయలుదేరి ఇద్దరు కూతుళ్లతోవెళ్లి బంధువులనందరిని పెళ్లికి పిలిచెను. అందరును "పెళ్లికొడుకెవరూ" అని యడిగిరి. గాని యామె "మాస్తారుగారమ్మా?" అని మాత్రమే ప్రత్యుత్తరమిచ్చెను. వీరేశలింగము పంతులు గూడ రావలసినవారి నందరిని ఆహ్వానించెను. దీనితో పట్టణమంతయు నుడికిపోయెను. 'మాయచేసి యే అమాయిక శిష్యుడికో బోగందాన్ని కట్టిపెడుతున్నాడు పంతులు' అని సంస్కారవిముఖులు గోల ప్రారంభించిరి. 'వితంతువులకు మళ్లీ పెళ్లి చెయ్యడం బాగానేవుంది. వర్ణసాంకర్యంకూడా చేస్తారు పంతులుగారు' అని సంస్కారాభిమానులు చెప్పుకొనసాగిరి. "అసహనం వున్నా, ద్వేషాలువున్నా, హెచ్చుతగ్గులువున్నా, అవన్నీ మనలో వర్ణవ్యవస్థవల్లనే వచ్చిపడ్డాయి. ఈకులపద్ధతి యెంతత్వరగా నాశనమైతే దేశం అంత త్వరలో బాగుపడు"నని బ్రహ్మసమాజసభ్యులు చెప్పసాగిరి.

సాయంత్రమైనది. అనుచరవర్గముతో పంతులు రాజామణి యింటికివచ్చెను. ఆయనూరులయందొకటై యున్న ప్రకాశమును నదినెలు జలకమాడించి అలంకరించి యెక్కడ పెండ్లిపీట వేయుదురో అక్కడికి సమీపమున నున్న గదిలో నుంచిరి. పంతులు వీధి గుమ్మమున నిలిచి వచ్చిన పెద్దలకందరికి స్వాగతమిచ్చెను.

జిల్లాజడ్జీ, సబుకలెక్టరు, కాలేజీప్రిన్సిపలు, తహసీలుదారు, మాజస్ట్రీటు, కోర్టుమున్సబులు, సబుజడ్జీ, పోలీసుపెద్దదొర, చిన్నదొర, సర్కిల్ ఇనస్పెక్టరు, కొందరు ప్లీడర్లు, రామదీక్షితుడు, పెద్దల సంపాదనతో తగుమనుష్యులనిపించుకొనుచున్న నిర్వ్యాపారులు, మున్నగువారనేకులు వచ్చిరి. నాలుగిండ్లభవంతి కనుక నది సరిపోయెను; గాని లేకున్న అందరును వీధిలోనిలువవలసినదే.

పేడున్నరయైనది. పంతులు బ్రహ్మపీఠము నధిష్ఠించెను. రాజామణి రంగనాయికను తెచ్చి పీటమీద కూర్చుండబెట్టెను. పంతులు కనుసన్నమీద రాజామణి పెద్దకూతురు తలుపు తీయగా ముసిముసినగవులతో ప్రకాశమువచ్చి రంగనాయికచెంత కూర్చుండెను. కరతాళధ్వనులు మిన్నుముట్టెను. మంగళవాద్యములు మ్రోగుకలంగెను. కొందరు "సెబాస్" అనిరి, కొందరు నిర్విణ్ణులైరి. కొందరు ఆశ్చర్యపడిరి. కొందరు "కలికాలం" అనిరి. కొందరు చకితులైరి. దొరలు, సంస్కారప్రియులు పంతులుపట్టుదలను కొనియాడిరి. అందరు నవేకవిధముల చెప్పుకొనిరి

యుక్తసమయమున యుక్తరీతిని వివాహకృత్యములన్నియు ముగిసెను. సానులు వంతములెత్తి పాడి మంగళహారతి యిచ్చినపిదప పంతులు వధూవరులను లేవదీసి సభలో నున్నతాసనములమీద కూర్చుండజేసి జరిగిన దంతయు నుపన్యసించెను. పిదప ప్రిన్సిపలు లేచి యిట్లు చెప్పెను.

"ఆంధ్రదేశచరిత్రలో ఈవివాహం ప్రత్యేకప్రకరణంలో వర్ణింపతగ్గది. ఈవివాహంవల్ల ఈపట్టణానికి చాలా శోభ కలిగింది. ఈవివాహంయొక్క పూర్వచరిత్ర అంతా పంతులుగారు బాగాచెప్పివున్నారు. యుక్తసమయములో వారుపూనుకొనక పోయినచో వేశ్యజాతిలో నూతనాధ్యాయాన్ని ప్రారంభింపచేసిన యీబాలిక కుంభీపాకనరకంలో కూరుకపోయివుండును. తల్లులయొక్క అవివేకంవల్ల యీజాతిలో యింకా యిలాంటిబాలికలు చాలామంది చెడిపోతున్నారు. సంగతులన్నీ బాగాబోధిస్తే యేవేశ్యాకూడా తనబిడ్డన్ని పాడుచేసుకోడానికి సాహసించలేదు. దీనికంతకీ అగ్రజాతుల స్వార్థంకొంతా, ఔదాసీన్యంకొంతా కారణాలైవున్నాయి. మీసంఘంలోవుండే ఆచారాలు యిప్పుడు చాలామట్టుకు మీశాస్త్రానికీ, ప్రపంచసభ్యతకీ గూడా దూరంగానే వున్నాయి. ఈసంగతి తెలిసికోవడం ఒకయెత్తూ, సంఘాన్ని మంచిదారిలో నడపబూనుకోవడం ఒకయెత్తూను. ఈవిషయంలో ఆంధ్రదేశానికల్లా ఒక్క వీరేశలింగం పంతులుగారే కనబడతున్నారు. వారికంటే విద్వాంసులూ, ధనంకలవారూ, మంచీచెడ్డా తెలిసిన

వారూ, కష్టసుఖా లెరిగినవారూ, దేశంయొక్క దుస్థితికి వగచేవారూ, మీలో చాలామంది వుండవచ్చును; గాని యీశ్వరసందేశాన్ని విని, దాన్ని బాగా బోధపరుచుకుని, ఆచరణలో పెట్టగలవారు పంతులుగారొక్కరే కనబడుతున్నారు. వాస్తవంగా శంకరరామానుజాదుల తరువాత పంతులుగారు మళ్లీ అంతవారని చెప్పడాని కేమీ సందేహంలేదు. పంతులుగారి వుద్దేశాలను ఖండించేవారు కొందరుండడం నిజమే. పంతులుగారు సంఘాన్ని పాడుచేస్తున్నారనడమే కాని తాము నమ్మినధర్మాన్ని పునరుద్ధరించడంకోసం వారేమీ ప్రయత్నించడం లేదు. చెడిపోయిన సంఘాలని బాగుచెయ్యాలన్నప్పుడు పూర్వశాస్త్రానుసరణం యెప్పుడూ, యెవరికీ సాధ్యంకాదు. పూర్వం యెప్పుడో నిర్ణయింపబడ్డ సంఘనియమాలలో కొన్ని కాలాన్నిబట్టీ, సంపర్కాన్నిబట్టీ, పాత్రలబట్టీ, ప్రభుత్వాన్నిబట్టీ దిద్దబూనేవారికి అసహ్యంగా కనబడడం ప్రపంచకం అంతటా వున్నదే. ఇంతవరకు సంస్కారాన్ని నడిపిన యే ఆచార్యుడూకూడా కేవలమూ పూర్వశాస్త్రాలను అనుసరించి మాత్రమే పనిచెయ్యలేదు. అలా చెయ్యలేదుకూడాను. సంతత సాహచర్యంవల్లనైతేనేమి, సంస్కారనైపుణ్యంవల్లనైతేనేమి, పంతులుగారిఘనతని ఈప్రాంతంలోని వారనేకులు గ్రహింపలేకపోవచ్చును; గాని వారుఉపాధ్యాయులుగా వుండడంవల్ల నాకాలేజీ చాలా పవిత్రమైనదని నేను నమ్ముతున్నాను. వారిస్నేహంవల్ల నాగౌరవం పెరుగుతూవుందని నేను చాలా ఆనందిస్తున్నాను. అయితే కేటివరకూ వారిఅనుచరులలో వారికి తగినవారు లేకపోయినందుకు నేను చాలా విచారించుతున్నాను. తలుచుకుంటే—శ్రద్ధచేస్తే మా ప్రకాశం అంతవాడు కావచ్చును ప్రకాశం నాప్రియశిష్యుడు. నా కాలేజీకంతకీ దీపంవంటివాడు. నేడు ఆతడు ఒక పతితసంఘంలోని పిల్లని పెళ్లాడడంలో తన విద్యాధికతకు తగిన ఔన్నత్యాన్నీ, జ్ఞానానికి తగిన విచక్షణతనీ, తన అభిజాత్యానికి తగిన ఔదార్యాన్నీ వెల్లడించి స్తుతిపాత్రుడైనాడు. ఈ సాహసకృత్యంవల్ల ఆతడు ఇప్పటి శిథిలసంఘానికి కొంచెం దూరం అయినా ఈ బాలికారత్నంయొక్క సాహచర్యంవల్ల అతని జీవితం ప్రకాశమానమై అనేకులకు ఆదర్శం కాగలదు ఇప్పుడిప్పుడు హిందువులలో కొందరు వేశ్యావృత్తిని తగ్గింప బూనుకొనివుండడం మంచిదే; గాని వుపన్యాసాలవల్లా, వ్యాసాలవల్లా తగినంత ప్రయోజనం కలగదు. నేడు అనేక కారణాలవల్ల వేశ్యాకులంలో వున్న కన్యలకు ఆకులంలో తగినవరులు లేరు. అంచేత సంస్కారం ప్రారంభం కావలసిన ఈ సందిగ్ధసమయంలో అగ్రజాతులయువకులు ఆ బాలికలను పెళ్లాడడానికి ముందుకు రావలసివుంది. అగ్రజాతులు ఆజాతికి చేసిన ద్రోహం యిట్టి పనులవల్లనే తీరుతుంది; గాని మాటలవల్లా, సానుభూతివల్లా కాదు. ఈ సందర్భంలో యీ బాలికయొక్క తల్లిని గురించి కొంచెం చెప్పవలసివుంది. నలుగురు కూతుళ్లని కులవృత్తిలో దింపిన ఆమె ఈ బాలిక విషయంలో చాలా మంచిపని చేసింది. ఈశ్వరుడు ఆమెని పాపాలనుంచి విముక్తి కలిగించడానికి ఈపని వక్కటే చాలు. ఆమెనీ, ఈ కుటుంబంలోని తక్కినవారినీ నేను చాలా ప్రశంసిస్తూ ఈదంపతులను రక్షించవలసినదని పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను."

ఈ యుపన్యాసము ముగిసిన తరువాత పోలీసు పెద్దదొర లేచి వివాహమునకు సంబంధించినవారి నందరిని వినుతించి "ఈవరునిమీద మేము పెట్టినకేసు రేపే తగ్గించుకుంటా"మని చెప్పెను. రామదీక్షితుడు లేచి తనకు తెలిసిన సంగతులన్నీ తెలిపి, "కన్నెరికం ప్రస్తావన చేసిన మాధవరావు నేడు ఈ వివాహసందర్భంలో చాలా హడావుడిగా వున్నందుకు ఆనందిస్తూ వధూవరులను ఆశీర్వదిస్తున్నా"నని చెప్పెను. ఇంకను మరికొందరు ప్రస్తావించిరి. చివర రాజామణి సమయోచితముగా కొంచెము చెప్పి వచ్చినవారందరికీ తన కృతజ్ఞతను తెలిపి వధూవరుల నాశీర్వదించవలెనని కోరెను.

ఈ సంభాషణలన్నియు విని అచ్చట నున్నవారందరును ఉద్రిక్తులైరి. అనేకులు వధూవరులకు వెలగల పారితోషికము లిచ్చిరి. ప్రిన్సిపలు వధువునకొక వెండి గిన్నెను, వరునకొక రిస్టువాచీని ఇచ్చి "నాశిష్యుడైన ప్రకాశం ఉన్నతినిగురించి నేనెప్పుడూ శ్రద్ధచేస్తూ వుంటా"నని మాట యిచ్చెను

అంతయు నైనతరువాత మాధవరావును, మరికొందరాతని బంధువులును వచ్చినవారికి చందన

తాంబూలము లిచ్చి సత్కరించిరి. ఆరాత్రి పంతులు కోరికమీద ఆక్షేపణలేనివారు అచ్చట సహపఙ్క్తి భోజనమున పాల్గొనిరి. చిత్రవిచిత్రములగు బాణాసంచాలతో రాత్రి గొప్పయూరేగింపు జరిగెను.

ఈ వివాహమునుగురించి అనేక పత్రికలు తమ సంతోషమును వెల్లడించినవి. దేశభక్తులనేకులు తమ సంతసమును ప్రకటించిరి. గృహాలలోని అంధకారమునకై ఆచారసంఘసందోహమునకు దవుదవ్వుల మార్గాచార పరాయణుల గుప్తాగ్రహములుగూడ ఉండినవి.



# ఈశ్వరోపాలంభన

నాదెళ్ల వెంకట్రావుగారు

సతతంబున్ వాతఁబెట్టుచున్నవి భవిష్యచ్చింత, లద్దాన, వి
స్మృతమైపోయెను నేటిసౌఖ్యోదయము న్మిథ్యాదృశంబై; విహం
గతతుల్ సౌఖ్యముఁ జెందుచుండుఁగద మాకన్నన్ గటా! రేపు హా
బ్రతుకేలాగనుచింత లేనివఁట దేవా! సర్వజీవేశ్వరా!

మ. జగమెల్లం బహు దుఃఖసంకులము హింసాపాంసులం బిట్లొన
ర్పఁగ నేలాభము నీకుఁ జేకురునో? నీపాలించులోకంబు లి
ట్లగచాట్లంబడ నేమిగౌరవమొ? లేకాహ్లాదమో? కానిచో
నగుబాటౌననియైన నెంచవొకో! యేనాఁడేని సర్వేశ్వరా!

శా. మాకష్టాలకు బాధ్యులెవ్వరొ వచింపంగల్గుచోఁ జెప్పుమా
మీకర్మంబులెకాని నేనెపుడు నేమీ చేయలేనందువా
నీకు న్నాకును భేద మెందుఁగలదో? నీయీశ్వరత్వంబ దీ
లోకంబందున దేనికో తెలుపు మాలోచించి సర్వేశ్వరా!

శా. మాయాశక్తిన్ హరియింపఁ గోరియును సామర్థ్యంబు పూజ్యంబొ? లే
కాయిచ్ఛాకలనంబె కల్గదొకొ శక్త్యాయాధత గ్గల్గియున్ ?
నీయందీయుభయప్రభావములు లేనేలేవొ? కాకున్నచో
మాయామేయగుణాఢ్య! యేల మము నోమన్ రావు సర్వేశ్వరా!





౨. నాలందలోని ప్రధానస్తూపము, దానిని చుట్టియుండు చిన్నస్తూపములు



3. బుద్ధగుప్త సంఘారామము: ప్రధానసోపానమార్గము



౮. బుద్ధగుప్త సంఘారామము: లోపలిభాగము



౯. బుద్ధగుప్త సంఘారామము: ప్రధాన పశ్చిమద్వారము




కే. నరసింహాచారి గారు

భారతఖండమున ప్రసిద్ధిచెందిన పురాతన రాజ్యములలో మగధ యొకటి. జరాసంధుడును, అతని తనయుడు సహదేవుడును, పర్వత పరివేష్టిత మగు గిరివ్రజము, రాజధానిగా మగధను పాలించియుండిరి. వారి యనంతరము మగధరాజ్యచరిత్ర యంతగా తెలియదు. కాని క్రీ. పూ. 5 వ శతాబ్దము మొదలు ఈరాజ్యము కొంతప్రాముఖ్యమును చెంద నారంభించి క్రీ. శ. 12 వ శతాబ్దమున మహమ్మదీయుల దండయాత్రలవల్ల సంపూర్ణనాశము చెందు పర్యంతము కొద్దిగనో గొప్పగనో ఉన్నతదశ ననుభవించు చుండెను. ఈ మధ్యకాలమున శైశునాగులు, మౌర్యులు, సంగులు, బ్రాహ్మణులు, గుప్తులు, వర్మవంశస్థులు, పాలవంశస్థులు అనుపేరువంశపు రాజులు మగధ కధీశులై యుండిరి. అందు మౌర్యవంశస్థులగు చంద్రగుప్తుడును, అశోకుడును హిందూదేశము నంతయు, నేకచ్ఛత్రాధిపతులుగ నేలిరి. చంద్రగుప్తుని కాలముననే గ్రీకులు హిందూదేశమునుండి తరుమగొట్టబడిరి.

జరాసంధుని రాజధానియగుగిరివ్రజమే క్రీ. పూ. 500 మొదలు 450 వరకు రాజగృహమను నామాంతరము కలిగి మగధకు రాజధానియై యుండెను. కాని తర్వాత అజాతశత్రునికాలమున నీ రాజధాని పాటలీపుత్రమునకు మార్చబడెను.

క్రీ. పూ. 5 వ శతాబ్దారంభమున మగధకు బింబిసారుడు రాజై యుండెను. అతడు బుద్ధుని సమకాలికుడు. బౌద్ధమతమును స్వీకరించిన రాజులలో బింబిసారుడు ప్రథముడు. బౌద్ధమతము రాజమతమై రాజపోషితమయి వృద్ధిచెందిన ప్రథమరాజ్యము మగధ యయినందున నచ్చట బౌద్ధదేవాలయములును స్తూపములును, విహారములును, ఆరామములును ప్రబలినవిధమున మరెచ్చటను ప్రబలియుండలేదు. మతప్రాబల్య మెంతవిస్తారముగానుండెనో విద్యాప్రాబల్యముకూడ నంత యెక్కుడుగా నుండెను. విద్యాప్రాబల్యమునకు జనులు విద్యాభిలాషులై యుండవలెను. విద్యాభిలాషయు, విద్యాప్రాబల్యమును విశేషముగా నుండినయెడల జనులు నాగరికులై యుండవలెను.

నాగరికతయొక్క ప్రథమలక్షణములు సర్వజనసమత్వము, సర్వప్రాణి సమత్వము లేకాని వేరేదియు కానేరదు. అట్టి సర్వప్రాణిసమత్వమును జీవహింసా భావత్వము బౌద్ధమతప్రాబల్యకాలమున నుండినట్లు మరెప్పుడును ఉండలేదు. యుద్ధమునకు సర్వసైన్యసమేతులై పోయి శత్రువులను కసిమసంగుసమయమున తాముచేయు ప్రాణిహింసయొక్క యపారతను గురించి జిజ్ఞాసువులై యుద్ధమును చాలించి మరలుట ఆ యశోకాది మహాచక్రవర్తులకు సాధ్యమయ్యేనే కాని ప్రస్తుతమున నాగరికశ్రేష్ఠులని విర్రవీగుచు కయ్యమునకు కాలుద్రవ్వుచుండు పాశ్చాత్యప్రభువులకు సాధ్యమయ్యేనా? జీవహింసాపాపభయంబున తమ రాజ్యమును కోలుపోవుటకైన సమ్మతించి యుద్ధోపక్రమణము చేయుట పూర్వపు భరతఖండరాజుల కెట్లు సాధ్యమయి, నవీనపాశ్చాత్యులకు సాధ్యముకాకపోయెనో అట్లే జీవహింస లేకుండుటకొరకే జీవహింసాభూయిష్ఠములగు యుద్ధములు చేయుచున్నామనుట నవీనులగు పాశ్చాత్యులకువలె పూర్వులగు భరతఖండరాజులకు సాధ్యము కాకుండెను.

మగధరాజ్యము విద్యాధికులకు ప్రసిద్ధి చెందియుండెను. అందువలన ఇతరదేశములనుండికూడ విద్యాభిలాషులు మగధకేగి విద్య నభ్యసించుచుండిరి. అందు

వలననే అచ్చట విద్యాలయములును, విశ్వవిద్యాలయములును మెండుగానుండెను. అచ్చటి విశ్వవిద్యాలయములలో ప్రసిద్ధి వహించినది నాలందవిశ్వవిద్యాలయము (Nalanda University.)

## నాలంద పూర్వస్థితి

నాలంద యనునది రాజగృహమునకు ఉత్తరమున యేడుమైళ్లదూరమునందే యున్నది. బుద్ధగయకిది ఈశాన్యమున 49 మైళ్లును పాటలీపుత్రమునకు ఆగ్నేయమున 55 మైళ్లును అగును. తొలుదొలుత నిది యొక యామ్రవనమై యుండెను. 500 వణిజులీవనమును పదికోట్ల హేమనిష్కములకు కొని బుద్ధునికి తపోవనముగానర్పించిరి. బుద్ధుడందు ఒకానొకతరుణమున మూడుమాసములు వసించి ధర్మబోధ కావించియుండెను. బుద్ధుడుజీవకోటులకు తానెంత యొసగినను అది చాలదని యెంచువాడు కాన నాప్రదేశమునకు 'న + అలం + ద = నాలంద' యను సార్థకనామ మొప్పియుండెను. నాలంద సమీపప్రదేశములందే బుద్ధుని కాప్తశిష్యులగు శారిపుత్ర మహామౌద్గలాయనులు జన్మించిరి. నాలందయం దొక హ్రదమున నాలందయను నాగుడు నివసించుచుండెనట. తన్నామమున నాప్రదేశమున కాపేరు కలిగెననియుకూడ యొకగాథ కలదు.

బుద్ధుని నివాసమువల్ల పవిత్రమయినందున బౌద్ధులగు బింబిసారాదిరాజులుకూడ అప్పుడప్పుడు నాలందయందు నివసించుచుండిరి. క్రీస్తుశకము నాల్గవ శతాబ్దాంతమువరకును, నాలంద బౌద్ధక్షేత్రముగా ప్రసిద్ధిచెందియుండెనేకాని విశ్వవిద్యాలయ మప్పటి కింకను నేర్పడియుండలేదు. అందువలననే క్రీ. శ. 410 ప్రాంతమున హిందూదేశయాత్ర సలుపుచువచ్చిన ఫాహియాన్ అను చీనాదేశబౌద్ధయాత్రికుడు నాలందనుగురించి వ్రాయుచు విశ్వవిద్యాలయప్రశంస చేయలేదు. విశ్వవిద్యాలయము లేకుండినను, బౌద్ధక్షేత్ర మయినందునను రాజధానిసమీపమున నుండుటవల్ల రాజనివాస ప్రదేశమయి యుండినందునను, అచ్చట ననేక భవనములును, ఆలయములును ఉండినవి. ఇంకను అచ్చట ననేక హ్రదములు ఒక్కొక్కటి మైలు మైలున్నర పొడవు కలవి యున్నవి.

## విశ్వవిద్యాలయస్థాపనము

బుద్ధునినిర్యాణానంతరము కొంతకాలమునకు అనగా నాలుగుశతాబ్దములకు బ్రహ్మవంశస్థుడగు శక్రాదిత్యుడనురాజు, నాలందయం దొక 'సంఘారామమును' కట్టించెను. (పటము ౧.) సంఘారామమునకు పునాదిని త్రవ్వుచుండగా నొక నాగునికి (సర్పమునకు) గాయముతగిలెను. ఈసంగతి నెరింగినయొక బౌద్ధేతరుడు ఆప్రదేశము, మహిమ కలదనియు, అందు సంఘారామములను కట్టించినయెడల నానాదేశాగతులగు భిక్షుకులకు విద్యాప్రాప్తి కలుగుననియు చెప్పెను. శక్రాదిత్యుని యనంతర మతని తనయుడు బుద్ధగుప్తుడు దక్షిణమున నొక సంఘారామమును కట్టించెను. (పటము ౧-౨) అనంతరము; బుద్ధగుప్తుని తనయుడు తథాగత గుప్తుడు శక్రాదిత్య సంఘారామమునకు తూర్పున నొకదానిని కట్టించెను. (పటము ౧-౩). తర్వాత బాలాదిత్యుడు రాజ్యమునకు వచ్చెను. అతడు పైదానికి ఈశాన్యమున నొక సంఘారామమును కట్టించెను. (పటము ౧-౪) ఆ యారామములు ఒకదానినిమించి మరి యొకటి వైభవాలంకారములయందు మిన్నలయియుండినవి. బాలాదిత్యుడు తానుకట్టించు భవనము పూర్తికాగనే గృహప్రవేశోత్సవమునకై నానాదేశములనుండిన జనులను, జాతిమతభేదములు లేక యాహ్వానించెను. జనులందరు సమావేశమయినతర్వాత నిద్దరుసన్న్యాసులు ఆలస్యముగ సభ కేతెంచిరి. వారిరాకకు సభాపతి కారణమడుగగా వారు తమగురు వస్వస్థముగా నుండినందున ఆయనకు శుశ్రూష చేసి వచ్చుటవల్ల నాలస్య మయ్యెననిరి. ఈవార్త రాజునకు తెలియగనే తాను స్వయముగా వచ్చి వారిగురుభక్తికి మెచ్చి వారి నాదరించెను. బాలాదిత్యుడు సభయందు తానొకత్యాగియయి తన సర్వస్వమును దానము గావించెను. తర్వాత బాలాదిత్యపుత్రుడు వజ్రరాజు మగధకు పాలకుడయ్యెను. అతడుగూడ నొకసంఘారామమును కట్టించెను. (పటము ౧ - ౫). అది వానితండ్రి కట్టించిన దానికి పశ్చిమమున నుండెను. ఇంతవఱకును ఏకవంశీయులగు మగధాధిపతులు మాత్రము ప్రసిద్ధములగు సంఘారామములను కట్టించిరి. తర్వాత మధ్యదేశపు

రాజు మఱియొక సంఘారామమును (పటము ౧ – ౬) కట్టించి ఆయాఱుభవనములకును చేరి యొక ప్రాకారమును గట్టించెను. తర్వాత ననేకులు వారివారి భక్తిశ్రద్ధలకు దగినట్లు నాలందయం దసంఖ్యాకములగు భవనములను ఆలయములను కట్టించి, వాటియం దనేక చిత్రవిచిత్రములుగల శిల్పప్రావీణ్యమును విశదపఱచు విగ్రహముల బ్రతిష్ఠించిరి.

నాలంద దినదినప్రవర్ధమానమగు నగరమయి కాలక్రమమున హిందూదేశమున కంతకును ప్రసిద్ధివహించిన విద్యాపీఠమయ్యెను. అప్పటికి నానాదేశములనుండియు విద్యార్థులు వచ్చుచుండిరి. విద్యార్థులకు విద్యాలయమునందే సకలవసతులును ఏర్పరుపబడియుండెను. భోజనవస్త్రాదికములయందుగాని, వైద్యసహాయమందుగాని యేలోపమును లేక యచ్చటి విద్యార్థులు పోషింపబడుచుండిరి. నూరుగ్రామములపై వచ్చుధనము విద్యాలయమున కొసగబడెను. ఇదికాక పరిసరగ్రామములందలి ధనికులు అపారముగ ధనమును, ధాన్యమును, ఇతర సామగ్రులను ఇచ్చుచుండిరి. శక్రాదిత్యాది రాజనిర్మితసంఘారామములు కాక విద్యార్థుల నివాసమునకై యనేక భవనములు నిర్మింపబడియుండెను. ఒక్కొక్క భవనమును నాలుగుఅంతస్థులను కలిగియుండెను. ఒక్కొక్క విద్యాగృహమునం దనేకశాల లుండెను. శాలలలోని కుడ్యములు నానావిధములగు చిత్రములతో నిండి చిత్రపటములవలె నొప్పుచుండినవి. స్తంభములం దనేక విగ్రహములు చెక్కబడి పుష్పలతాదులగు అలంకారచిత్రసమేతములయి పరిపరివిధములగు వర్ణములతో నిండి ఇంద్రధనుస్సు సొబగున నొప్పుచుండినవి. ద్వార బంధములు సుందరములగు పెక్కు చెక్కడపు బనులతో నిండి అద్వితీయ సౌందర్య యుతములైనవి. పైకప్పు గ్లాసుతోను, పింగాణితోను చేయబడిన పెంకులతో కట్టబడియుండినది. సూర్యకాంతి నానావిధ వర్ణములుగల కాచఫలకముల మూలమున లోన ప్రవేశించి శాలలయందు నలువైపులను ప్రతిఫలితమై యొకవర్ణనాదుస్సాధ్యమగు వింతసొబగు నిచ్చుచుండెడివి. భవనముల శిఖరము లత్యున్నతములై ఏకశాస్త్రపారంగతులగు దేవగురు శిష్యులను అనేకశాస్త్రపారంగతుల జేయుటకై తమ విశ్వవిద్యాలయమున కాహ్వానింపబోయినవో యనున ట్లాకాశము నంటియుండినవి.

భవనములను చుట్టి యనేకోద్యానములును, కాసారములును నేత్రానందకరములయి చూపట్టుచుండెను. కాసారములందు ఇందీవర, నీలోత్పలాది పుష్పములు వికసించి పర్వి, తామరపత్రములతో నిండి రత్నకంబళ్లనుబోలియుండెను చీనాదేశయాత్రికుడగు హుయన్ త్సాంగు నాలందయందు అయిదుసంవత్సరములు విద్యార్థిగా నుండినందున అతని వర్ణనలు విద్యాలయ ప్రాముఖ్యమును వెల్లడిచేయుచుండి నమ్మదగినవై యున్నవి. నాలందచరిత్ర లేక హుయన్ త్సాంగు చరిత్రయు, హుయన్ త్సాంగు చరిత్ర లేక నాలంద చరిత్రయు పూర్తి కానేరవు.

## నాలంద యందలి విద్యాగురువులు

విద్యాలయమందు కాంచీపురవాసియు 'శబ్దవిద్యాసంయుక్తశాస్త్ర'(?) కర్తయునగు ధర్మపాలుడు, చంద్రపాలుడు, గుణమతి, స్థిరమతి, ప్రభమిత్రుడు, జినమిత్రుడు, జ్ఞానచంద్రుడు, శీఘ్రబుద్ధుడు, శీలభద్రుడు మొదలగు మహామహులగు పండితులు విద్యగరపుచుండిరి. ఇందొక్కొక్కరును ఒక్కొక్కశాస్త్రమునందు ప్రవీణుడు, అద్వితీయుడునై యుండెను. ఒక్కొక్కరును తనశాస్త్రమునకు అనేకవ్యాఖ్యానములును విశేషార్థములును వ్రాసి లోకమునకు జ్ఞానజ్యోతియై వెలుగుచుండెను, శీలభద్రుడు విద్యాలయమునందలి ప్రధానాధికారి. అతడు సకలశాస్త్రవేత్త, నిరుపమాన ప్రతిభావంతుడు. జ్ఞానమునందును వయస్సునందును వృద్ధుడై విద్యాలయ విషయములయందు సర్వాధికారమును గలిగియుండెను. ఆయనకు ప్రస్తుతపు మతగురువు లగు పీఠాధిపతుల యధికారము కలదు.

## విద్యార్థులును, విద్యయు

నాలందయందు పదివేలకు మించిన విద్యార్థులుండిరి. వారందరును వివిధదేశాగతులు. ఇంతటి గొప్ప సమూహమునకును విద్య యుచితముగా లభించుచుండెను. భోజనవస్త్రాదికములకును, శరీరారోగ్యసంరక్షణకును

దగిన వైద్యసహాయములకును శిష్యుల కేవిధమగు ఖర్చును లేక విద్య లభించుచుండెను.

ఈకాలమున విద్యనభ్యసించవలెనన్న నపారమగు ధనవ్యయమగును. విద్యార్థులు భోజనవస్త్రాదికముల చింత యొకవంకను, విద్యాభిలాష మరియొకవంకను వారి బాధించుచుండగా నీరెండుచింతలనడుమ నలిగి నానావిధ కష్టములపాలగుచుందురు. ఒకవేళ కష్టపడి విద్యాపరిపూర్తి నందగలిగినయెడల తదర్థము అంతకు పూర్వ మున్న ధనలేశమును వ్యయమగును విద్యలభించె నన్న సంతోషమునకుమారు ధనసంపాదనమార్గము గానక తపింపవలసియుండును. కాన ధనవంతుడుగానే యుండవలెనన్న విద్య నభ్యసించుప్రయత్నము మానుకొనవలసి యైనను, విద్య నభ్యసించవలెనన్న ధనికత్వమునకు నాశ వదలుకొనవలసియైనను ఉన్నది. విద్యావిషయికచింత తప్ప మరేచింతయు లేక విద్య నభ్యసించు సౌకర్యములు పూర్వపు భరతఖండముననుండిన, తక్షశిలా నాలందాది విశ్వవిద్యాలయములందు తప్ప మరెచ్చటను కానరావు. ప్రస్తుతము ప్రపంచమున, నేవిశ్వవిద్యాలయమునందును ఇట్టి యుత్తమపద్ధతి లేదు.

విశ్వవిద్యాలయమునందు ప్రత్యేకశాస్త్రములకు ప్రత్యేక కళాశాల లుండెను. అందు బౌద్ధమతగ్రంథము లెంతప్రధానములుగా నుండెనో వైదికగ్రంథములును అంతప్రధానములుగానుండెను. అనగా విద్యార్థులందరు ఆ కాలపు మతము లన్నింటియొక్క గ్రంథములనుచదివి పరస్పరమతములందలి గుణాగుణములనుగురించి చర్చించుచుండిరి. కేవలము మతవిద్యకేకాక శాస్త్రపఠనమునకుగూడ ప్రాముఖ్య మీయఁబడియుండెను. ఇచ్చట గణితము, జ్యోతిషము, ఛందస్సు, వ్యాకరణము, తర్కము, ఓషధిశాస్త్రము, వైద్యము, భూగోళ ఖగోళశాస్త్రములు, శిల్పము మున్నగుశాస్త్రములను నేర్పుటకు ప్రవీణులగుపండితు లుండిరి. విద్యాభ్యాసకాలము అనేకభాగములుగా నుండెను. నూతనముగ విద్యాలయమునచేరి ప్రారంభదశయం దుండువారందరు చేరివారి గృహకృత్యముల వారే చేసికొనవలయును. ప్రథమభాగమునందలి గ్రంథముల జదివి పరీక్షయందు త్తీర్ణులైనవారికి రెండవభాగమునకు (తరగతి) ప్రవేశము ఇయ్యబడుచుండెను. ఈకాలమున వారి గృహకృత్యముల జేసికొనుభారము విద్యార్థులకు లేదు. ప్రత్యేకపరిచారకులుండి యాపనుల జేయుచుండిరి. ఇంతవఱకును విద్యార్థులందరు చేరి యొకేగృహమున (సంఘారామమున) నివసింపవలసియుండెను. రెండవ భాగమునందు త్తీర్ణులైన విద్యార్థులకు మూడవతరగతియందుండుకాలమున ప్రతివానికిని సర్వపరికరసమేత మగు ప్రత్యేకగృహవసతి నిచ్చుచుండిరి. మూడుతరగతులు దాటి నాల్గవతరగతికి వచ్చు ప్రతివిద్యార్థియు నొక ప్రత్యేకసేవకుని కలిగియుండు యోగ్యతకలవాడగును. నాల్గుతరగతులను దాటినవారు శిష్యగణముల గలిగియుండుటకును వారికి విద్యగరపుటకును యోగ్యతకలవారగుచుండిరి. ఈశిష్యులకు ఉపాసకులని పేరు. అయిదుతరగతులయందు ప్రవీణుడయ్యెనేని వానికి గజవాహన మీయబడుచుండెను. అన్నిటికిని పైదగు ఆఱవతరగతి దాటినయెడల నతడు సేనాధిపతియగుచుండెను. సేనాధిపతికి పరివారము మెండుగా నుండెను.

నాలందయందు సకలశాస్త్రములకును సూత్రములకును ఇరువదికిమించిన వ్యాఖ్యానముల నెఱింగినవారు వేయుమందియు, ముప్పదికిమించిన వ్యాఖ్యానముల నెఱింగినవారు 500 మందియు ఏబదికిమించిన వ్యాఖ్యానముల దెలిసినవారు పదుగురును ఉండిరి.

విద్యార్థులందఱును వారి నిబంధనముల చక్కగా గమనించి భక్తిశ్రద్ధలతో జదువుచుండిరి. కళాశాలా నిబంధనములు కఠినములై విద్యార్థులను పరిశుద్ధప్రవర్తన కలవారినిగా నొనర్పదగినవి. ఎప్పుడుచూచినను ఏదో యొక మతచర్చయో శాస్త్రవాదమో జరుగుచుండెను. కావుననే నాలందకేగి యందలి విద్యాధికుల మన్ననల బడయు సామర్థ్యమును జూపి వారిచ్చుయోగ్యతాపత్రముల నందిననే కాని యెవ్వడును పదుగురి యెదుట విద్వాంసుడ ననుకొనుటకు ధైర్యము చాలకుండెను. 'నాలంద విశ్వవిద్యాలయ పట్టమును ధరించిన చాలును. అతడు విద్వాంసుడే యగును' అను విశ్వాసము ప్రబలియుండెను. పాశ్చాత్యవిశ్వవిద్యాలయముల కేగి యందు పట్టముల నందివచ్చినవారు 'B. A., Oxon.,' 'B.A.,

Cantab.' అని ప్రస్తుత మెట్లు గౌరవపాత్రులగుచున్నారో పూర్వము నాలందయందు విద్యాభిరుదముల నందిన వారును గౌరవము నందుచుండిరి.

విద్యాలయమందు జరుగు విద్వద్గోష్ఠులయందు జేరి తత్ప్రసంగములందు పాల్గొన గోరిరేని వారికి ప్రవేశము కలుగుటకుముందు ద్వారపాలుడే కొన్ని విద్వత్ప్రశ్నల నడుగును. వాటికిఁ దగు నుత్తరముల నివ్వనివాడు మరలిపోవలసిన దే. విద్య అతిప్రౌఢమయినందునను గురువు లతిప్రతిభాశాలు లైనందునను విద్వత్ప్రసంగాభిలాషులై వచ్చినవారిలో నూటికి ఎనుబదిమంది ప్రవేశపరీక్షయందే చిక్కి వెనుకకు మరలుదురు. తక్కిన ఇరువదిమందికూడ కడవరకు వాదప్రతివాదములందు జయించెదరను నమ్మకము లేదు.

## హుయన్ త్సాంగు నాలంద కేగుట

హుయఙ్ త్సాంగు చీనాదేశమును క్రీ. శ. 629 సంవత్సరమున వదలి, హిందూదేశమున క్రీ.శ 645 సంవత్సరము వఱకును పర్యటన మొనరించెను. ఆకాలమున కేవలము బౌద్ధక్షేత్ర యాత్రయేకాక ఎచ్చటెచ్చట విద్వాంసులుండిరో అచ్చట నంతయు నివసించి వారియెడ విద్య నభ్యసించెను. ఇట్లు క్రమముగా నానాదేశముల సందర్శించుచు మగధకు వెళ్లినప్పుడు నాలందను దర్శింప గుతూహలపడుచుండెను. అచ్చటి విద్యాధికుల ప్రజ్ఞ కచ్చెరువడి తానుగూడ వారియొద్ద విద్యాభ్యాసము చేయగోరెను.

నాలందకు పోవుటకు పూర్వము ఉత్తమపుణ్యక్షేత్రమగు బోధిమండలమునం (బుద్ధగయ)యందుండగా నాలంద విద్యాపీఠాధిపతి హుయఙ్ త్సాంగును ఆహ్వానించెను. ఆహ్వానపత్రమును నలుగురు పండితులు కొనివచ్చిరి. యాత్రికుడును, వారితోగూడ నాలందకు పోయెను. నాలందను చేరగనే విశ్వవిద్యాలయమునందలి మహాపండితులును, విద్యార్థులును రెండువందలమంది, ఛత్రచామరములతోను, పుష్పమాలికలతోను, గంధధూపదీపములతోను అతిథిని ఎదుర్కొని గీతవాద్యాది మంగళనాదములతో మహోన్నతభవనమున విద్యాలయమునకు గొనిపోయిరి.

## నాలందయందు హుయఙ్ త్సాంగుకు జరిగిన అతిథిసత్కారము

విద్యాలయభవనమున నొకగొప్ప సభామంటపముండెను. మహాసభలన్నియు నచ్చటనే జరుగును. అందొకప్రక్క ఉన్నతమయిన వేదికయు దానికెదుర ప్రేక్షకుల కాసనములును ఉండెను. వేదికపై ప్రధానపురుషుల కాసనము లమర్పబడియుండెను. వాటిమధ్య అగ్రాసనాధిపతియొక్క స్థానముండెను. హుయఙ్ త్సాంగు నాదరించుటకై యా యగ్రాసనముప్రక్కనే మరియొక యాసనము వేయబడెను. అతిథిని మహోన్నతభవనమున గొనివచ్చి యా ద్వితీయాసనముపై గూర్చుండజేసిరి. తర్వాత 'కర్మదానాధిపతి' ( Sub-Director ) ముందునకువచ్చి యొకఘంటను వాయించి అతిథియొక్క సుగుణగణాదికముల బొగడుచు అతిథిసమ్మానపత్రమును ఘంటానాదమును బోలినకంఠమున జదివి సభికుల కానందమును గలుగజేసెను. విహారమునగల సర్వస్వమును అతిథి తనవిగా భావించి స్వతంత్రముగా నుపయోగించుకొనవలయునని వేడుకొనెను. పిమ్మట, జ్ఞానులును, వయోవృద్ధులును అగు పండితోత్తములు ఇరువదిమంది హుయఙ్ త్సాంగును విద్యాపీఠాధిపతియగు శీలభద్రుని సన్నిధానమునకు గొనిపోయిరి.

పీఠాధిపతిని సమీపించినపుడు హుయఙ్ త్సాంగు అచ్చటి మర్యాదచొప్పున మోకరించి గురుపాదముల దనశిరమున నానించి, ముద్దుగొని, భూమికి శిరఃస్పర్శము కావించెను. శీలభద్రుడు హుయఙ్ త్సాంగును లేవనెత్తి యాశీర్వదించి, అచ్చట వచ్చినవారి కందఱకును ఆసనముల వేయించి యుపవిష్టుల గావించెను. శీలభద్రుడు తనవద్దకు విద్యార్థియై వచ్చిన విదేశయాత్రికుని అతిగౌరవముతో వాని దేశవర్తమానములను, క్షేమసమాచారములను నడిగి, హిందూదేశమునకు రా గారణమును తెలియగోరెను. అతిథి తాను యాత్రికుడై వచ్చి బౌద్ధక్షేత్రముల దర్శించి తన కిదివరకును దెలియని సంస్కృతభాషయందలి గ్రంథముల నన్నింటి మహనీయులవద్ద నేర్చుకొని పోవలయునని వచ్చితినని విన్నవించెను.

## శీలభద్రుని స్వప్నము

శీలభద్రుని శిష్యులలో అతని సోదరపుత్రుడు బుద్ధభద్రుడనువా డొకడు. బుద్ధభద్రునికి వయసు డెబ్బది

డేండ్లు. అతడు సకలశాస్త్రములయందును సూత్రములయందును నేర్పరియగుటయేకాక మహావక్తకూడ నయియుండెను. శీలభద్రుడు బుద్ధభద్రుని పిలిచి తనకుపూర్వమువచ్చిన రుగ్మతయొక్క చరిత్రమును సభ కెఱింగింపగోరెను.

బుద్ధభద్రు డిట్లని ప్రారంభించెను:

"నా గురువునకు పూర్వము గర్భకోశమున నొకనొప్పి ప్రారంభమయ్యెను. ఆనొప్పి యప్పుడప్పుడు వచ్చుచుండెను. నొప్పి తగిలినపుడు కరపాదములు ముడుచుకొనుటయు మహాబాధ కలుగుటయు తటస్థించుచుండెను. ఈరీతిగ ఇరువది సంవత్సరములు బాధపడెను. తుదకు బాధపడజాలక మూడుసంవత్సరముల క్రింద ప్రాణములపై విసిగి ప్రాయోపవేశము చేసి ప్రాణముల బోగొట్టుకొనదలంచెను. అప్పుడు ఒక నాటి యర్ధరాత్రమున నొకస్వప్నము గాంచెను. అందు బంగారువన్నె శరీరము వాడొకడును, స్ఫటికమువంటి శరీరము గలవాడొకడును, రజితమువంటివాడొకడును ముగ్గురు దేవతలు కానబడిరి. వారు గంభీరవేషులు, సూర్యప్రతిభులు. వారి స్వనము మేఘస్వనము. ఆదేదీప్యమానశరీరులు ముగ్గురు గురువును సమీపించి "నీవు పూర్వజన్మమున నొకరాజవై జనుల ననేకహింసల బెట్టినందున నీ జన్మమున నీ రుగ్మతవల్ల బాధపడుచున్నావు. అదియు గాక శరీరము బాధల నొందక తప్పదు. బాధలకని శరీరమును నాశనమును చేయకూడదు. ఆత్మహత్య మహాపాపము. పాపఫలము ననుభవింపక శరీరమును అంతరింపజేసినంత మాత్రము తప్పించుకొనుట జరుగదు. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్" అను న్యాయముచొప్పున నీవీశరీరముతోనే పూర్వజన్మపు నీపాపకృత్యములకు పశ్చాత్తప్తుడవయి భావి కాలమును పుణ్యకార్యములనే చేయుచుండుము. ఓపిక పట్టుము. శక్తివంచన లేక జనులకు విద్యాదానము చేయుము. నీ బాధల కంత్యము కానగలవు. అని చెప్పగా గురువు మిక్కిలి సంతసించి వారికి నమస్కరించెను. అంతట వారు హేమగాత్రుడు మంజుశ్రీ బోధిసత్త్వుడనియు, స్ఫటికశరీరి అవలోకితేశ్వరబోధిసత్త్వుడనియు, రజతగాత్రుడు మైత్రేయ బోధిసత్త్వుడనియు తమ్మెరుకపరచి గురువుతో మరల నిట్లనిరి. "నీవు బౌద్ధధర్మతత్త్వమును యోగశాస్త్రమును లోకమునకు బోధింపవలసినది. అట్లయిన క్రమముగా నీవ్యాధికుదిరి సుఖపడెదవు. కొలదికాలమునకు చీనాదేశమునుండి పరమభక్తుడు విద్యాభిలాషియై నీయొద్దకు రాగలడు. వానికి మిక్కిలి శ్రద్ధతో విద్యగఱపవలసినది" అని దీవించి యంతర్హితులైరి. అని బుద్ధభద్రుడు చెప్పినకథను విని సభికు లాశ్చర్యస్వాంతులైరి. హుయన్ త్సాంగుకథను విని పట్టరాని సంతోషముస నానందబాష్పముల గరియుచు గురువునకు నమస్కరించి "దైవాజ్ఞ ననుసరించి నేను మీపాదములను విద్యార్థినై యాశ్రయించితిని. కాన నాయం దనుగ్రహించి విద్య నేర్పు"డని వేడుకొనెను. హుయన్ త్సాంగు చీనాదేశమును వదలి యిప్పటికి మూడేండ్లు పూర్తియగుటయు, తన స్వప్నవృత్తాంతము జరిగియు నంతియకాలమగుటయు దేవతలు వాక్రుచ్చిన యాత్రికు డతడే యని సంతసించి శీలభద్రు డతనిని శిష్యునిగా నంగీకరించెను.

హుయన్ త్సాంగునకు జరిగిన యాదరణము

హుయన్ త్సాంగునకు, విడిదిగృహము బాలాదిత్యసంఘారామమునందలి బుద్ధభద్రునిగృహము. ఆగృహము నాలుగంతస్తులు కలది. బుద్ధభద్రుడు అతిథిని ఏడు దినములు తనయింటనే యుంచుకొనెను. తర్వాత నాతనికి ధర్మపాలబోధిసత్త్వగృహమున కుత్తరమున నొకయింట నివాస మేర్పరుపబడెను. ప్రతిదినమును 120 జంబీరఫలములును, 20 పూగములును, 20 జాజికాయలును, ఒకపలము కర్పూరమును, కొంతమహాశాలిబియ్యమును, దినవెచ్చమునకు, పంపబడుచుండెను. మహాశాలిబియ్యము మగధయందు తప్ప మరెచ్చటను పైరు కాదు. ధాన్యము చిక్కుడుగింజపరిమాణము కలిగిపండినపుడు కాంతికలిగి సువాసనాయుతమై యుండును. అట్టి ధాన్యమును మహారాజులకును మహావిద్వాంసులకును తప్ప మరెవరికిని ఇచ్చుటలేదు. ప్రతినెలకును, మూడుపళ్లునూనెయు, దినదినమును వెన్నయు, ఇతరసామగ్రులును హుయన్ త్సాంగు కోరినవెల్లను పంపబడుచుండెను.

హుయన్ త్సాంగెచ్చటకు పోయినను ఉపాసకు డొకడు గజారూఢుడై వెంటబోవుచుండెను. ఇదికాక

మొట్టుపట్లనుండు రాజగృహాదిపుణ్యక్షేత్రముల సందర్శించుట కాతనికి పల్లకియు, రథమునుకూడ నుండినవి.

### హుయన్‌త్సాంగు విద్యాభ్యాసము

హుయన్‌త్సాంగు శీలభద్రునివద్ద యోగశాస్త్రము మూడుమారులును, న్యాయానుసారశాస్త్రము నొకమారును, హేతువిద్యాశాస్త్రమును శబ్దవిద్యాశాస్త్రమును రెండుమారులును,ప్రాణ్యమూలశాస్త్రమేకను, శతశాస్త్రమును మూడుమారులును నేర్చెను. కాశ్మీరమున నుండగనే తాను నేర్చిన విభాష, శతపదాభిధర్మశాస్త్రములను మరల శీలభద్రునివద్ద చక్కగా నెఱింగెను. తర్వాత బ్రాహ్మణమతగ్రంథములగు వేదాదులను, వ్యాకరణశాస్త్రమును నేర్చెను.

వైవర్తకల్పారంభమున బ్రహ్మ వ్యాకరణమును లోకమునకు ప్రకటించెను. అప్పు డది పదిలక్షలశ్లోకములుగలిగియుండినది.వైవర్తసిద్ధకల్పారంభమున శక్రుడు దానిని ఒకలక్షశ్లోకములకు సంక్షిప్తపరచెను. తర్వాత ఉత్తరహిందూదేశమున గాంధారరాజ్యములోని శాలాతురనగరవాసియగు పాణిని ఋషివ్యాకరణశాస్త్రమును ఎనిమిదివేలశ్లోకములుగాజేసెను. సంక్షేపములగు వ్యాకరణశాస్త్రములుఇంకను కలవు. ఒకదానియందు ఒకవేయిశ్లోకములే కలవు. ఒకటి అక్షరవ్యుత్పత్తినిగురించి మూడువందలశ్లోకములను కలిగియున్నది.

అష్టధాతు (ధాతువృత్తి) యనుగ్రంథమున ఎనిమిదివందలశ్లోకములే కలవు.

హుయన్‌త్సాంగు పైగ్రంథములను చదివి భాషాజ్ఞానమును వృద్ధిపఱుచుకొని సంస్కృతమునగల యనేకబౌద్ధబ్రాహ్మణగ్రంథములను చక్కగా నెఱింగెను. ఇట్లు సకలశాస్త్రములను చక్కగా చదివినందున హుయన్‌త్సాంగు ఆకాలపు మతవాదములందును, శాస్త్రవాదములందును పాల్గొనగలిగి ప్రతిపక్షులవాదములను ఖండింప సామర్థ్యముకలవా డయ్యెను. ముఖ్యముగా బౌద్ధధర్మములను చక్కగా గ్రహించి అందలి సందేహముల నివర్తించు సామర్థ్యమతనికి నిరుపమానముగ నుండినందున ధర్మపతి లేక న్యాయపతి (Master of Law) అనిబిరుదనామ ముండెను.

### హుయన్‌త్సాంగు మరల యాత్ర వెడలుట

అయిదుసంవత్సరములకాలము విద్యాభ్యాసము చేసి విద్యాపరిపూర్తియగుడు అప్పటి కింకనుపూర్తికాని తన దేశపర్యటనకార్యమును నివర్తింప నెంచి శీలభద్రునిచెంతకేగి యాత్ర కనుజ్ఞవేడెను. శీలభద్రు డట్లే యనుజ్ఞనొసగి యాత్రానంతరము మరల నాలంద కొకమారు రమ్మని కోరను. వల్లెయని న్యాయపతి నాలందను వదలి మగధకు రాజధానియగు రాజగృహమునకు వచ్చి యట నుండి ఉత్తరహిందూదేశమునందలి సమస్తరాజ్యముల జూచుచు వాయవ్యమున పారశీకదేశపర్యంత మేగెను. ఇప్పటికి నాలందవదలి ఎనిమిదిసంవత్సరములయ్యెను. పారశీకమునుండి వెనుకకుమరలి మరల నాలందను కడసారిదర్శించుటకు వచ్చెను.

### హుయన్‌త్సాంగున కు నాలందయందు విద్యాగురుపదము లభించుట

నాలందయందు తనపూర్వపువిద్యాగురువగు శీలభద్రుడే యింకను పీఠాధిపతిగ నుండెను. కాని యిపుడు శీలభద్రుడు వృద్ధుడై, తత్కారణమున మరింతగౌరవపాత్రుడై యుండెను. ఈమారుధర్మపతి కష్టతరములగు గ్రంథములను విద్యార్థులకు నేర్పుటకై నియమింపబడెను. అతడు స్వయముగనే సంస్కృతమున గ్రంథములవ్రాయ దొడగెను. తనగ్రంథములందుసాంఖ్యవైశేషికాదిమతములను ఖండించెను. బౌద్ధమతమునగల కొన్నిస్వల్పభేదములను, సందేహములను విరుద్ధభావములను దొలగించి మతైక్యమునకు పాటుపడెను.

### బౌద్ధమతమున భేదములు

బౌద్ధమతమున రెండుముఖ్యభాగము లుండెను. ఒకటి మహాయానమతము ; రెండవది హీనయానమతము. రెండుకక్షులవారికిని బుద్ధునియందుగల భక్తి నిరుపమానము-కాని ఆచరణమునందలి భిన్నభావములవలన రెండుకక్షులుగా నేర్పడియుండిరి. మహాయానమతపువారు పవిత్రములుగాభావించుగ్రంథములు అయిదు. హీనయానపువారిగ్రంథములు తొమ్మిది. హీనయానమతస్థులకు బుద్ధునియందును ఆయనధర్మములందును భక్తి మెండుగా

సున్నను, జన్మరాహిత్యోపాయమునకు ప్రయత్నించుటకుదగిన స్థిరమతులు కారు. జన్మరాహిత్యమును గుఱించి వారి కంతనమ్మకము లేదు. మహాయానపువారు జన్మరాహిత్యమునందు నమ్మకమును అందులకు దగిన తపోనిష్ఠలయందు దృఢవిశ్వాసమును కలవారు. కాన మహాయానమతస్థులు హీనయానమతస్థులను కొంత తక్కువగా జూచుచుండిరి.

మహాయానమతమున నెందరుజను లుండిరో హీనయానమతమునగూడ నంతమంది యుండిరి. రెండుమతలును వ్యాపకమున నొకదానికొకటి తీసిపోవకుండెను. ఉత్తరమున బామియాన్, కపేశ, వారణాసి, కపిలవస్తు రాజ్యములును, తూర్పున నంపా, హిరణ్యపర్వత, మాళవరాజ్యములును, దక్షిణమున వల్లభిరాజ్యమును మధ్యదేశమునగల వైశాలియు, పశ్చిమమున ఘూర్జర, సింధుదేశములును, హీనయానమతము ప్రబలముగానుండినప్రదేశములు. మహాయానమతము హిందూదేశమున నంతట ప్రబలియుండెను. పుండ్రవర్థన, కొంకణపుర, మహారాష్ట్రి, అటలీ, అయోధ్య, మధుర, ఉజ్జయినీ, రాజ్యములయందు రెండుమతములును సమాన ప్రాబల్యము కలిగియుండెను. ఎచ్చటను పరస్పరద్వేషము లేక అన్యోన్యముగాను స్వేచ్ఛగాను వారివారిమతముల వారనుసరించుచుండిరి. ఉభయులును, వాదప్రతివాదములయందు పాల్గొనుచుండిరి. ఇవి కేవలము స్నేహభావమున జేయు వాగ్యుద్ధములే (Friendly Dialectic tournaments) కాని దౌష్ట్యము లేకుండెను. ఉభయులకును వేరువేరు మఠము లుండెడివి. ఒకరి మఠమునకు మఱొకరు పోవుటలేదు. భోజనాదికములందును, ఆచారవ్యవహారములందును భేదము లుండెను.

ఒక్కొక్కప్పుడు జనులు ఒకతెగనుండిమఱొకతెగకు వచ్చుటయు కలదు. గాంధారదేశమున అసంఘుడను మహాపండితుని శిష్యుడును, అభిధర్మకోశశాస్త్రకర్తయునగు వసుబంధుడు హీనయానమతము నుండి మహాయానమతమును స్వీకరించెను. మతిపురవాసియగు గుణప్రభుడను పండితుడు మహాయానమునువదలి హీనయానమవలంబించెను.

## హీనయానమతస్థుల అసూయ

కన్యాకుబ్జరాజ్యము హిందూదేశ మధ్యభాగమున చాలభాగము వ్యాపించియుండెను. శిలాదిత్య హర్షవర్ధనుడు కన్యాకుబ్జపు రాజు. అతడు బౌద్ధుడు. అతడు నాలందవిశ్వవిద్యాలయము నందలి శిష్యులకొఱకొక గొప్ప విహారమును కట్టించి దానికి మితిలేనిధనము నిచ్చియుండెను. వైభవమునం దీవిహారము వంటిది మఱెచ్చటను లేదు.

శిలాదిత్యుడు తనరాజ్యమునందు పర్యటన మొనరించుచు ఓఢ్రదేశము (Orissa)నకు పోయియుండెను. ఆదేశమున హీనయానమతము ప్రబలియుండెను. హీనయానికులందఱు శిలాదిత్యుడు నాలందయందు మహాయానికులకొఱకు కట్టించిన విహారమును గురించి విని యసూయాగ్రస్తులయి యుండిరి. కాన రాజును దర్శించి తమమతమునకు ఎట్టిపోషణము నొసగకపోవుట న్యాయముకాదని విన్నవించుకొనిరి. తమతమధర్మములనుఅందలి తత్త్వమును విశదపఱచు నొకగ్రంథమును రాజునకు సమర్పించి అందలిన్యాయములను ఖండించుట కెరికిని సాధ్యముకాదని ప్రజ్ఞలు పలికిరి. రాజు వారి విన్నపముల నాలించి "మహాయానతత్త్వమును గుర్తెఱుంగక మీరిట్లు ప్రజ్ఞలు పలుకుట యతిసాహసము. మీరొకమారు నాలందలోని పండితులతో గలిసి వారివాదముల విన్నయెడల మీప్రజ్ఞల కవకాశముండ"దనెను. అంతట వారు ఉభయమతములవారికిని వాదముల కవకాశము కలుగుటకై పండితసభ నేర్పఱుచుమని వేడుకొనిరి. రాజుసమ్మతించి వెంటనే పీఠాధిపతి శీలభద్రునికి ఉత్తరము వ్రాసెను. శీలభద్రుడు సభచేసి సాగరమతి, ప్రజ్ఞరశ్మిసింహరశ్మి, హుయన్‌త్సాంగు అను నలుగురు మహావిద్వాంసులను ఓఢ్రదేశమున జరుగు పండితసభకు పంప నిశ్చయించెను. ఉభయపక్షగ్రంథములను చక్కగా పరిశీలించి దేశమునందచ్చట నిట్టిమతవాదములందు పాల్గొని జయముగాంచియుండుటవల్లను మహావిద్వాంసుల మధ్య పేరు పడసియున్నందునను హుయన్‌త్సాంగు ఆనల్గురియం దొకడుగా నెన్నుకొనబడెను. నలుగురు విద్వాంసులును ఓఢ్రదేశమునకు పయనమగుసమయమున నాలందయం దొకవిశేషము జరిగెను.

బౌద్ధేతరులలో లోకాయతు లొకతెగవారు. ఒకనా డొకలోకాయతుడు తన బౌద్ధమతఖండనసిద్ధాంతములను నలువది విషయములుగా వ్రాసి వాటిని ఖండించ దలంచినవా రెవరైన నున్నయెడల తనతో వాదమునకు రావలసినదనియు, తన్ను జయించినయెడల తన శిరమును సమర్పించెదననియు ప్రతిజ్ఞచేసి యాపత్రమును, నాలందవిద్యాలయద్వారమున కంటించిపోయెను. హుయన్ త్సాంగదికని తనశిష్యుని పంపి యావిషయముల వ్రాయించుకొని మూలపత్రమును ధ్వంసముచేయించెను. లోకాయతు డదివరకే యావిదేశపండితుని సామర్థ్యము నెఱింగినవాడగుటచే వాదమునకు దిగుటకు శంకించి తనయోటమి నొప్పుకొని తనశిరమును కొనవచ్చునని చెప్పెను. అయినను హుయన్ త్సాంగు వానిని వదలక సభగావించి అందు వానితో వాదమునకు గడంగి యతని నలువదివిషయములను చక్కగా విమర్శించి ఖండించెను. సభయందు భూతులు, నిర్గ్రంథులు, కాపాలికులు, సాంఖ్యులు, వైశేషికులను బౌద్ధేతరులుండిరి; కాని యెవ్వరైనను ప్రతివాదము చేయరైరి. హుయన్ త్సాంగు లోకాయతుని శిరముకొనుటకు మారు బౌద్ధుల యహింసాధర్మమును బోధించి యతని తనపరిచారకునిగా నియమించుకొనెను. కొంతకాలమున కతని విడిచి పంపెను.

## కన్యాకుబ్జమున విద్వత్సభ

కన్యాకుబ్జము శిలాదిత్యహర్షవర్ధనుని రాజధాని. అది గంగా కాళిందీనదుల సంగమస్థానమున నుండెను. ఓఢ్రదేశ హీనయానమతస్థులు కోరిన మహాసభ కన్యాకుబ్జమున జరుగవలసినట్లు నిశ్చితమయ్యెను. ఆమహాసభకు రాజే అధ్యక్షుడు శిలాదిత్యునిపదునెనిమిది సామంతరాజులును సభకు వచ్చిరి. నానాదేశముల నుండియు మూడువేలబౌద్ధసన్న్యాసులును, రెండువేలబ్రాహ్మణులును, నాలందనుండి వేయిభిక్షుకులును వచ్చిరి. హుయన్ త్సాంగు రాజువెంట వచ్చెను. కన్యాకుబ్జమున రెండుగొప్పపర్ణశాలలు నిర్మించిరి. ఒకటి బుద్ధుని హేమవిగ్రహముండుట కేర్పరుపబడెను. రెండవ శాలయందు సభాగతులుండిరి. సభారంగమున సర్వాభరణసంశోభితమగు నొకగజముపై బుద్ధుని బంగారు విగ్రహ ముంచి యుత్సవ మారంభమయ్యెను. శిలాదిత్యుడు శ్వేతచామరమును గొని కుడిప్రక్కన పాదచారియై వచ్చుచుండెను. ఎడమవైపున బ్రహ్మవలె కైసేసికొని కుమారుడనుసామంతాధిపతి వచ్చెను. బుద్ధునివెనుక నిరుపార్శ్వములందును రెండుగజములపై పుష్పములతో నింపిన పేటికముల నుంచుకొని అడుగడుగునకును, పుష్పవర్షము గురిపించుచుండిరి. రాజువెనుక గజారూఢులై హుయన్ త్సాంగు మొదలగు పండితశ్రేష్ఠులును, రాజోద్యోగులును వచ్చిరి. సామంతరాజులును, ప్రసిద్ధులగు బౌద్ధభిక్షులును, మంత్రులును మూడువందలయేనుగులపై నెక్కి మార్గమున కిరుప్రక్కల వచ్చిరి. రాజుయొక్క పటకుటీరము నుండి యుత్సవమారంభమయి రెండుమైళ్ల దూరమున నుండిన సభామందిరములకు మహావైభవముతో వచ్చెను. బుద్ధుని విగ్రహము నొకపర్ణశాలయందు సింహాసనముపై ప్రతిష్ఠించిరి. రాజును, న్యాయపతియును బుద్ధునికి పూజలొనర్చిరి. అచ్చటి యశేషజనము నకును విందులు జరిగెను. పండితులకు బహుమానము లీయబడెను. తర్వాత రాజు హుయన్ త్సాంగును అగ్రాసనాధిపతిగా జేసి సభ ప్రారంభించెను.

హుయన్ త్సాంగు నాలందవిద్యార్థులలో నొకని పిలచి యామహాసభ యచ్చట గూడుటకు కారణములను తన యుపన్యాసముయొక్క యుపోద్ఘాతముసుసభ కెరిగింపగోరెను. తరువాత నాశిష్యుడు హీనయానమత సిద్ధాంతములకు హుయన్ త్సాంగు వ్రాసిన ఖండనముల జదివెను. ఆఖండనవాదమునందు అపవాదమున్నయెడల దనశిరము నివ్వగలవాడనని ధర్మపతి ప్రకటించియుండెను. ఆకాలమునందు ఇట్టి వాదప్రతివాదములయందు ఓడిపోయినవారు తమశిరము నిచ్చునట్లు ప్రతిజ్ఞలుచేయుట యాచారముగా నుండెను. కాని ఇట్టి ప్రతిజ్ఞలు ఆచరణలోనికి వచ్చినట్లు కానరావు. హుయన్ త్సాంగు చేసిన హీనయానమతఖండన విమర్శను వినిన సభికులలో గొందఱికాగ్రహము జనించెను. ప్రతివాదమున నాతనిజయించు సామర్థ్యము లేనందున నెవరును ఎదురాడరైరి. సభికులందరు మూకీభావము వహించిరి. ఇట్లు నాలుగు దినములు సభజరిగినను యెవ్వరును తన్ను ఖండించువారు లేనందున హుయన్ త్సాంగు హీనయానమతమున గల నైచ్యమును, మహాయానమునకు గల యుత్కృష్టతను

గురించి జయప్రదముగా గంభీరస్వరమున నుపన్యసించెను. అతనిని సభయందు బహిరంగవాగ్యుద్ధమున జయింప ధైర్యములేని యసూయాగ్రస్తులు కొందఱతని మాయోపాయమున రహస్యముగ జంపజూచిరి. రాజిది గ్రహించి అట్టి ద్రోహులుండిన వారిని కఠినముగా శిక్షించెదనని సంకల్పించెను. పదునెనిమిది దినములు ప్రతివాదనమున కెవరైన నచ్చెదరేమో యని నిరీక్షించిరి. ఎవరును రారైరి. కడపటిదినమున మరల హుయన్‌త్సాంగు మహాయానమతమును గురించి యుపన్యసించెను. అందువలన నూతనముగా ననేకులు మహాయానమత మవలంబించిరి.

విద్వద్విజయము నందిన యాచీనాదేశ యాత్రికుని హర్షవర్ధనాదిరాజులు మిక్కిలి గౌరవించిరి. ధనకనకాది బహుమానముల నొసగదలచిరి. కాని నిగర్వియు, త్యాగియు నగు నతడు పూజావిగ్రహములను గ్రంథములును తప్ప మఱిదేనిని గైకొనడయ్యెను. సభ ముగియగనే పండితులవాదమున జయమందినవాడితడని జనులకు దెలియుటకై హుయన్‌త్సాంగును గజముపై పురవీధులయం దుత్సవము గావించిరి. జనులందరును సంతసించి వానికి మహాయానదేవుడని బిరుదొసగిరి. ఈ బౌద్ధులుకాని హీనయానికు లతనిని మోక్షదేవుడని పిలచిరి. ఆసభయొక్క జ్ఞాపకచిహ్నముగా నచ్చట బూజింపబడిన బుద్ధుని హేమవిగ్రహమును నాలందవిశ్వవిద్యాలయమున కర్పింపబడెను.

## హుయన్‌త్సాంగు స్వదేశోన్ముఖు డగుట

హుయన్‌త్సాంగు హిందూదేశమునకువచ్చి చాలకాల మయినది. అయిదారు సంవత్సరములు నాలందయందే విద్యాభ్యాసమున గడపెను. నాలందను చేరిన తర్వాతనే యతనికి పూర్వము దొరకని గ్రంథములను, శాస్త్రములను సమగ్రముగ జదువుట కవకాశము కల్గెను. అతనికీర్తియు దిగంతముల వ్యాపించుట నాలందయందలి పండితసభలయందు పాల్గొని ప్రతిపక్షవాదములను ఖండించుటవల్లనే. హిందూదేశమున చూడవలసిన పుణ్యక్షేత్రముల నన్నింటిని చూచి చదువవలసిన గ్రంథములను బదివి చరితార్థుడయ్యెను. ఇంకను అతనికి విధ్యుక్తముగ నుండిన కార్యభాగము మిగిలియుండెను. అది తన పరిశ్రమలఫలము స్వదేశజనుల కందజేయుటయే. అందులకై స్వదేశోన్ముఖుడయ్యెను.

శిలాదిత్యహర్షవర్ధనుడు తనరాజధానియగుకన్యాకుబ్జమునం దయిదుసంవత్సరముల కొకమారు మహాదానవ్రతము సలుపుట కలదు. ఆయుత్సవమునకు హుయన్‌త్సాంగును ఆహ్వానించెను. ఉత్సవమునకు సుమారు అయిదులక్షల భిక్షువులు కూడిరి. వీరికందఱకును రాజు తన సర్వస్వమును దానముచేసెను. యాత్రికు డీయుత్సవమును సందర్శించి తనదేశమునకు బయలుదేరెను.

మార్గమునగల రాజులందరిచేతను వరుసగా నాదరణముల నందుచు వారిసహాయమున తానును, తనపరివారమును, గ్రంథసంచయములును, విగ్రహములును సింధునదిని దాటుటలో గ్రహచారవశమున తనగ్రంథసంచయమున కొంతభాగము నదీగతమయ్యెను. నష్టగ్రంథముల ప్రతుల మరల ఉద్యానరాజ్యమున వ్రాయించుకొని బయలుదేరి కపిశరాజ్యముచేరి హిందూకుశ పర్వతములందాటి అంత గనకుస్తన రాజ్యములనుజూచుచు స్వదేశమును సురక్షితముగా చేరెను. అతని గ్రంథసంచయమున 224 మహాయానగ్రంథములును ఇంకను హీనయానసర్వాస్తి, వాద, సమ్మతీయ, మహీశాసక కాశ్యపీయధర్మగుప్తాది బౌద్ధేతరగ్రంథములును చేరి 657 గ్రంథము లుండినవి.

నాలందవంటి విశ్వవిద్యాలయములు పూర్వకాలమున హిందూదేశమున ననేకము లుండినవి. అవన్నియు నాలందవలె నంత జగద్విఖ్యాతి వడయకున్నను ప్రసిద్ధియందు ఎట్టిలోపములును లేకుండినవి.

బుద్ధుని సమకాలమున గాంధారదేశమునకు రాజధానియయిన తక్షశిలయందొక విశ్వవిద్యాలయ ముండెను. జగద్విఖ్యాతకీర్తిశాలియగు అర్థశాస్త్రమును రచించిన చాణక్యుడును, వ్యాకరణకర్తయగు పాణినియు తక్షశిలావిద్యాలయ విద్యార్థులే. క్రీ. శ. 67 సంవత్సరమున చీనాదేశమున బౌద్ధమతమును వ్యాపింపజేసిన మహనీయులగు గోభరణుడును, మాతంగుడును తక్షశిలావిద్యార్థులే. కాశి యందొక ప్రసిద్ధమగు విశ్వవిద్యాలయ ముండెను.

నాలంద విశ్వవిద్యాలయమునందు నివసించి విద్యనభ్యసించిన నాగార్జునరాజు కృష్ణానదీతీరమున సుధాన్యకటకమునందొక విశ్వవిద్యాలయమును స్థాపించియుండెను.

అట్టి జగద్విఖ్యాత విశ్వవిద్యాలయములకు తావయియుండిన భారతదేశమున సుమారు వేయి సంవత్సరములవరకును అశాంతియుతమైయుండి విద్యావ్యాప్తి కవకాశము లేక ధూమ పూరిత గృహమున నూపిరాడక నశించు జీవుని భంగి భారతవిద్యయు, భారతకళలును, భారతనాగరికతయు నశించినవి. ఇట్టి విపరీత సమయమున నష్టమయిన పూర్వవిద్యాస్వాతంత్ర్యమును గడింపబూనిన జగద్విఖ్యాత కవిశిఖామణియగు రవీంద్రుని యాశయము జయప్రదమగుగాక యనియు ఆయనచేనియు నిచే స్థాపింపబడిన శాంతినికేతన విశ్వవిద్యాలయమునకు చిరాయువ్యముల నొసంగి రక్షించుకాక యని దైవమును ప్రార్థించుచున్నాడను.

## నాలందయందలి శిథిలములు

జగద్విఖ్యాత కీర్తియుతమగు నాలందయందు విశ్వవిద్యాలయ సంబంధములును, రాజనివాస సంబంధములునగు భవనము లసంఖ్యాకము లుండినవి. ఎచ్చట చూచినను ఉద్యానవనములును, గొప్ప సరోవరములును, సంపములును నుండినవి. ఇవన్నియు నిప్పటికి సుమారుపండ్రెండువందలసంవత్సరముల నాడు మంచి స్థితియందుండి తర్వాతికాలములయందు బౌద్ధమతద్వేషులగు బ్రాహ్మణులచేతను, మహమ్మదీయులచేతను నాశమునంది మిక్కిలి శిథిలావస్థ నొందియున్నవి. మనుష్యులు నాశనము చేయుటయే కాక మహాబలసంపన్నమగు కాలదేవతయాడ యీనాశకృత్యమునకు తోడ్పడి యనేక భవనములను నామమాత్రావశిష్టముల జేసెను.

నాలందయుండిన ప్రదేశమునకు బరగాఁవ్ అని పేరు. బుద్ధుని కాప్తశిష్యులగు శారిపుత్ర మహామౌద్గలాయనులు నాలందసమీపముననే జన్మించిరని చెప్పియుంటిమి. మహామౌద్గలాయనుడు జన్మించిన కులిక యను గ్రామము ప్రస్తుతము జగదీశపురదిబ్బ యన బరగుచున్నది. జగదీశపురదిబ్బ ప్రస్తుతము 200 అడుగుల చతురమయి విశేష మెత్తు లేక యున్నది. దానిశిఖరమున ననేక శిలావిగ్రహములు దొరకినవి. అందొకటి బోధి ద్రుమము క్రింద తపమాచరించుచున్నట్లుండు బుద్ధవిగ్రహము, బుద్ధుని చుట్టు ననేక రాక్షసులు, భూతప్రేతములు, సుందర స్త్రీలును, (అరిషడ్వర్గములు) బుద్ధుని తపోభంగమునకై చేయు ఆర్భాటములు, చక్కగా చెక్కబడి యున్నవి. శిలావిగ్రహపరిమాణము $15' \times 9\frac{1}{2}'$ దీనిని ఈకాలపు జనులు రుక్మిణియని పూజించుచున్నారు. ఈవిగ్రహమునకు మాంసక్షీరాదులు నివేదించుచుందురు.

విశ్వవిద్యాలయ భవనములు మాత్రము సుమారు పదునారువందలయడుగుల పొడవును, ఎనిమిదివందలయడుగుల వెడల్పును గలిగియున్నవి. అందు ముఖ్యమయినవి ఆలయసంఘారామములు. అందొకటియందును బాలాదిత్యుని యాలయము ప్రసిద్ధి చెందినది. (పటము ౧-ఠ)

బుద్ధుడు నాలందయందొక కాలమున మూడు మాసములు నివసించియుండి ధర్మమార్గోపదేశము చేసెను. అచ్చట నొక సంఘారామమున్నది.

అది (పటము 1-క) ఇప్పుడు 53 అ. ఉన్నతి కలిగియున్నది. శిఖరము 65 అడుగుల చతురము. దానికిపశ్చిమమున పుష్కరిణియున్నది. (పటము 1-గ). పై యాలయమునకు దక్షిణమున, నూఱడుగుల దూరమున ఒక స్తూపమున్నది. ఇది దూరదేశాగతుడగు భిక్షుకు డొకడు పంచాంగతపమును చేసిన ప్రదేశము. (పటము 1-గ). ఇంకను, దక్షిణమున అవలోకితేశ్వరాలయమున్నది. (పటము 1-చ). దానికి, దక్షిణమున బుద్ధుని నఖములను, కేశములను ప్రతిష్ఠించిన స్తూపము కలదు. (పటము 1 జ). ఈ స్తూపమునకు, ప్రదక్షిణములు చేసిన రోగులు నిరామయులగు చుండిరట. ఈస్తూప మింకను శిథిలావస్థయందు 20 అడుగుల ఎత్తయి యున్నది.

విశ్వవిద్యాలయ ప్రాకారమునకు పశ్చిమమున బేలఖ్రాదమునకు సమీపమున నొక స్తూపము కలదు. (పటము 1-ట). ఇదియొక బౌద్ధేతరుడు జననమరణముల, గురించి బుద్ధునితో వాదించిన చోటు.

పై స్తూపమునకు తూర్పున ప్రాకారము నానుకొని రెండువందల యడుగుల ఎత్తుగల విహారము కలదు. ఇది బుద్ధుడు నాలుగుమాసములు మతబోధ కావించిన

ప్రదేశము. దీనియున్నతి ప్రస్తుతము 60 అ. (పటము డ). దీనిచుట్టుకొలత 240 అ., కుడ్యముల మందము 15 అ. మొదలు 20 అ. వరకున్నది. ఈవిహారమున కీశాన్యమున లెక్కలేని స్తూపములు చిన్నవియు పెద్దవియు నున్నవి. వాటియున్నతి 10 అ. మొదలు 30 అడుగుల వరకు కలదు. ఒక్కొక్క స్తూపమునందును చిత్రవిచిత్రములుగా అలంకారచిత్రములు చెక్కబడియున్నవి. ఈ చిత్రములమధ్య బుద్ధవిగ్రహములు విశేషముగా గలవు. ఒక్కొక్క స్తూపముయొక్క పీఠమునందును రాళ్లను ఇనుపకమ్ములను చేర్చబడి బలవత్తరమును భూకంపముల నైనను సయితము ఓర్వగలిగియున్నవి.

పై విహారమునకు (పటము 1-డ). ఉత్తరమున నుండునది బోధిసత్త్వావలోకితేశ్వరాలయము (పటము 1 ణ). ఇచ్చటి దేవతను టిబెట్టుదేశస్థులు పద్మపాణియని కొలుతురు.

ఈయవలోకితేశ్వరాలయమునకు ఉత్తరమున నుండునది బాలాదిత్యుడు కట్టించిన ప్రసిద్ధమగు బుద్ధాలయము. (పటము 1 త). దాని యున్నతి 200 అడుగులుండెను. ఇది విహారప్రాంగణమునకు తూర్పుగాను, శిథిలావస్థయందు 45 అ. ఎత్తుకలిగియున్నది. దీని సమీపమున భైరవపీఠము అనుచోట నొక బ్రహ్మాండమగు బుద్ధుని తామ్రవిగ్రహ ముండెను. దానియున్నతి ఎనుబదియడుగులు. దానిని పూర్ణవర్మరాజు ప్రతిష్ఠించెను. విగ్రహమునకు ఆఱంతస్థుల ఆలయ ముండెను. (పటము 1 బ.)

సురాజప్రాసాదమునకు తూర్పున నొక తారాబోధిసత్త్వాలయమున్నది. (పటము 1-న) దానివైశాల్యము 70 × 60½ దానిక్రింద 125 అడుగుల చతురమగు అరుగు కలదు. ఆలయముయొక్క యున్నతి 240 అ. దాని ప్రాకారాంతర్భాగమున నొక గొప్పకూపము కలదు. (పటము 1. ప).

పటము VII (2) బుద్ధదేవతయగు అపరాజితాదేవివిగ్రహము. బౌద్ధులీదేవిని గణేశుని త్రొక్కుచున్నట్లు చిత్రించెదరు.

# రారాజు

దొంతరాజు వెంకట్రామయ్య గారు

చలము బలంబుతోడఁ దనుశత్రులడంగ శమంతపంచక
స్థలిని బరుండి వాయుసుతదారుణహస్తగదాభిఘాతన
ద్దళితనిజోరుభాగరుధిరంబు కరంబు భరంబుదోఁపని
స్థులపరితాపదుఃఖమున శోకిలుచుంటివె కౌరవేశ్వరా !

సీ. దివ్యనిర్మలరత్నదీపికలయ్యెనే, గగనభాసితతారకాగణంబు
వందిమాగధులకైవారంబులయ్యెనే, సవిధసృగాలసంచయరవంబు
లలితచందనసమారంభమయ్యెనె తను, స్రావితరుధిరధారాచయంబు
రమణీయమృదులపర్యంకమయ్యెనె నీకుఁ, గర్కశకలితసంగరతలంబు
పశుబలైకనిరంకుశప్రాభవమున, నేలనాలుగుచెఱఁగుల నేలినట్టి
సార్వభౌముఁడవయ్యు నీచందమిట్టులు, పరిణమించెనిదేలయ్య పార్థివేంద్ర !

ఉ. హాయిగ బాహ్లికప్రముఖ పార్థివసత్తము లోలగింప ర
త్నాయతసింహపీఠిఁ గొలువై కడువైభవమొందు నీవిటుల్
'నా' యనువారు లేక విజనస్థలి దుర్మరణంబు నొందె దా
రా! యవిలంఘనీయము పురాకృతకర్మఫలంబు లేరికిన్.

మ. ఘనులై పాండుకుమారు లాహవమునన్ గంధర్వులన్ గెల్చి ని
న్వనితామాత్యసమన్వితంబుగ విపద్వారాశి దాటించి సా
కిన సాహాయ్యమునైన నెంచక కృతఘ్నీభూతచిత్తుండవై
చనునే తన్నిజరాజ్యసంగ్రహణ దుస్తంత్రంబుఁ గావింపఁగన్.

చ. పరమపతివ్రతావిభవభాసురలీల వెలుంగు ద్రౌపదిన్
నరపతులెల్లఁ జూడ వసనంబున నూడ్చి కృపావిహీనతన్
బరిభవమున్ బొనర్చిన భవద్దురితంబిటులన్ ఫలించె; నౌఁ;
బరసతులన్ వెతల్ పఱిచి వర్ధితుఁడయ్యెనెవండు ధాత్రిపై.

గీ. నలినదళనేత్రములవాఁడు నల్లవాఁడు, వేయురీతులఁ జెప్పనవినక తుదకుఁ
బ్రాణములతోడ రాజ్యంబు వలసె విడువఁ, దెగెడుదనుకను బిగియింపఁ దగవె నీకు?

గీ. ఖలుఁడవయి వారి కెన్ని బాధలనిడినను, ధర్మసంస్థాపనార్థంబు ధరణియందు
నవతరించినయట్టి మహాత్ముఁ డుండఁ, బాండుతనయుల కేల లోపంబు కలుగు!

సీ. కువలయపాలనాకుశలుండవయ్యును, బద్మినీసతి భంగపరిచినావు
ఆచార్యదత్తవిద్యావైభవుఁడవయ్యు, సత్సంతతుల కీర్తి నలిపినావు
పాలవంటికులానఁ బ్రావిర్భవించియుఁ, బట్టి తండ్రిని ఘోషపెట్టినావు
రాచరికంపుగౌరవసంగతుఁడవయ్యుఁ, బటునిశాచరవృత్తిఁ బరగినావు
బాపురే! రాజరాజ! నీపాలనంబు, గడిచిపోయెను; జాగేల?—వెడలుమింకఁ
బ్రాఙ్నగంబున నదె లోకబాంధవుండు, దోఁచుచున్నాఁడు నిజకరద్యుతులతోడ.

మ. ధనరాజ్యంబులు భాగ్యభోగ్యములు సత్యంబంచు భావించి స
జ్జనసంతాప మొనర్చుచున్ విపులహింసామార్గమున్ బూని పా
వనమౌ భారతదేశగౌరవము విధ్వంసంబుఁ గావించు న
మ్మనుజుం డయ్యెడఁ బాత్రుఁడౌనె త్రిజగన్మాన్యత్వవిఖ్యాతికిన్.






పంఙ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు

[వెనుకటి సంచిక తరువాయి]

(1) (అ) గోధ్యక్షుడు—గోవులను జీతగాండ్రచే సంరక్షింపజేయుట.

(క) సంవత్సరమున కిరువదియొక్క మణుగు నేయి, కొంతమితిగల తోకవెండ్రుకలు, మృతగోవుల నుండి కొంతచర్మము నిచ్చుపద్ధతిని సమానసంఖ్యగల "లేగలు, లేజూడిసూవులు, ముదరమాడిసూవులు, ముసలిసూవులు" నూరు చొప్పున గొల్లవాండ్రకు సంరక్షింప నిచ్చుట.

(చ) సమానసంఖ్యగలిగి, రోగము, అంగహీనము, దొంగచేపు, కష్టముమీదచేపు, చచ్చినలేగలు, గలసూవులను గొల్లవాండ్ర కిచ్చి క్షీరాదులలో నర్ధభాగ మొందుట.

(ట) శత్రుభయముచేతను, వనజంతుభయముచేతను, ఇతరులు గోధ్యక్షునకు సమర్పించిన గోవులను జాగ్రత్తపఱచి వారిచ్చినదానిలో పదియవభాగమును వారికిచ్చుట.

(త) వృషభజాతులలో నేయేవృషభము లెందెందు కుపయోగింపునో ఆయాజాతుల నందందుకు సిద్ధపరిపించుట.

(ప) రోగములవలనను, వన్యజంతువులవలనను, సర్పాదులవలనను, దావాగ్ని మొదలగు నితరప్రమాదములవలనను, గోజాతిని రక్షించుచుండుట.

(య) చోరులచే నపహరింపబడిన గోవృషభముల బట్టి తీసికొనివచ్చినవారిని బహుళాకరించుట.

(శ) బాలవృద్ధవ్యాధిత పశువులకు గోపాలురచే చికిత్సల జేయించుట మొదలగు పనులను గోధ్యక్షుడు చేయింపవలెను.

గోపాలుడు, గడ్డిని వేయువాడు, పాలపిదుకువాడు, పాలు, పెరుగు, నేయి మొదలగువానిని, జేయువాడు, (మృగాదిభయములనుండి రక్షించుటకు చచ్చినవాని చర్మాదుల జాగ్రత్తపరచుటకు) బోయవాడు నను నైదుగురు నూరేసిగోవులకు జీతగాండ్రుండవలెను.

అరణ్యమునందు మేయుపశువులకు, దొంగలు, మృగములు, సర్పములు మొదలగువానినుండి బాధలేకుండగ, వేటకుక్కలసహాయముగల బోయవాండ్రచే నరణ్యమును శోధింపుచు, ఋతువుల ననుసరించి యరణ్యమును భాగించి పశువులను మేపించుచుండవలెను.

మజ్జిగను కుక్కలకును, పందులకును భోయించుచు, కొంతభాగమును భోజనముకొఱకు కంచుపాత్రలలో నుంచుకొనవలెను.

రుచికొఱకు జున్నును తెలకపిండితో గలిపి యుపయోగించుకొనవలెను. (జున్నును తెలకపిండితో గలిపి నిలువయుంచుకొనిన బాగుండునేమో మనకు గ్రొత్త. కాని జున్నుపాలలో పరిశుభ్రమగు తెల్లగుడ్డను

(1) కౌటిలీయార్థశాస్త్రమ్ (2-29)

నడిపి యారవేసి జాగ్రత్తపరచి యవసరమైనపుడు మంచిపాలలో నాగుడ్డను నాననిచ్చి యాపాలను గాచినచో జున్నుకలుగును. వర్షాశరత్ హేమంతఋతువులలో రెండుపూటలును శిశిర వసంత గ్రీష్మఋతువులలో నొక పూట మాత్రము పాలు బిదుకవలెను. శిశిరఋతుత్రయములో రెండవపూట పాలుబిదికినవాని బొటనవ్రేలు దెగగొట్టుటయే దండము. (ఇదినాటిగోసంరక్షకశాసనముయొక్క ప్రాముఖ్యమును సూచించుచున్నది.)

పశుజాతి కిడుమేత

ప్రతిపశువునకు యథేచ్ఛగ గడ్డిని, నీటిని నిచ్చుచుండుటయేకాక యీ క్రిందివిధముగు నాహారము (దాణా)నుగూడ నీయవలెను. ముక్కుకుట్టినట్టియు మెలుకుగా నడుచునట్టియు, బరువులను మోయునట్టియెద్దులకు 40 తులములగోధుమలు, 80 తులములగడ్డి, 1 తులము తెలకపిండి, 10 కుంచములపొట్టు, 5 తులములయుప్పు ముక్కుపైనబూయుట కరసోలడునూనె, శేరుపానీయద్రవ్యము, 1 తులము మాంసము, 4 శేరులపెరుగు, 4 శేరులయవలు, లేక మినపపిండి, 4 శేరులపాలు, లేక 2 శేరుల కల్లు, 1 శేరునూనె, 4 తులములకారము, 4 తులములు అల్లపురసము, ప్రతిదినమును బెట్టుచుండవలెను. దున్నపోతులకు, ఒంటెలకు పైదానికి రెట్టింపును, వేసడములకు, గోవులకు, గాడిదలకు మొదటిదానిలో నొకవంతు తక్కువగాను ఆహారము నిచ్చుచుండవలెను. పనిచేయు యెద్దులకు వానిపనినిబట్టియు పాలిచ్చునావులకు వాని పాలనుబట్టియు నాహారము నిచ్చుచుండవలెను.

(ఒకద్రోణముమితి(సుమారుయేడుశేరు)గల పాలనుండి యొకప్రస్థము (35 తులములయెత్తు) నేయివచ్చును. గేదె పాలనుండి యైదవవంతును, మేకపాలనుండి సగముహెచ్చుగను, నేయివచ్చును. అయినను భూసారము, తృణోదసారములబట్టి, పాలు, నేయి వృద్ధిక్షయము లగుచుండుట ననుభవముచే దెలిసికొనవలెను. ఇంకను విశేషముల నెరుగగోరువారు కౌటిలీయార్థశాస్త్రముయొక్క (2-29) గోధ్యక్షప్రకరణము చదువగోరెదను. నాటిపాడియొక్క విశేషము లిపుడు మనకు దెలియవుగాని, పాలు, పెరుగు నేయి మనుష్యులేకాక, కుక్కలు, పందులు, గాడిదలు, పశువులు కూడ యథేష్టముగ ద్రాగుటకు దగినంతగానుండెడిదనిమాత్ర మర్థశాస్త్రమునుబట్టి తెలిసికొనగలము. పాలకు, నేతికి, మజ్జిగకు మొగమువాచినమనకాకాలము కృతయుగకాల మగునా కాదా?

ఆముదపుపంట యీకాలముననే ప్రారంభింపబడెనని వాగ్భటాదుల వైద్యప్రశంసాసందర్భములబట్టి తెలిసికొనబడినది. కాని గృహములయందు దీపములకు నాముదమును వాడక, ఇంగదీతైలము (గారనూనె)ను వాడుచుండిరి. దాని నిటులుకాళిదాసమహాకవి సూచించి యున్నాడు.

(1) వాల్మీకాశ్రమమందలి మునికన్యలు సీతకు నర్హసత్కారముల జేసి, యజినము బరచినట్టియు, గారెనూనె దీపము గలిగినట్టియు పర్ణశాలయందు రాత్రినివసింప జేసిరి.

ఈ శతాబ్దాదివరకును పల్లెలలో పుండ్లకు నాముదమును రాయునటులు బౌద్ధకాలమునందు పుండ్లకు గారనూనెనే రాయుచుండిరి చూడుడు:

(2) ఏలేడిపిల్లకు జిన్నదనమున మూతికి దర్భముండ్లు గ్రుచ్చుకొని పుండుపడగా నది మానుటకు గారనూనెను పుండునకు రాయుచు చామబియ్యముతో బెంచితివో పుత్రునివంటిదగు నాలేడిపిల్ల నీకాళ్లకడ్డ పడుచు మార్గమును వదలుట లేదు.

బౌద్ధకాలపుప్రభువులు, ప్రభుత్వము, వ్యవసాయాభివృద్ధి కనేకవిధములుగా దోడ్పడుచుండిరి. బ్రిటిషుగవర్నమెంటువారు వ్యవసాయశాఖను (అగ్రికల్చర్ డిపార్టుమెంటు) నెలకొలిపినటులు నాటిప్రభుత్వమును వ్యవసాయశాఖను నెలకొలుపుచుండెను. వ్యవసాయశాఖ నాడు శాస్త్రీయముగా నేటివలెనే యుండెను. వ్యవసాయశాఖాధ్యక్షుడు "సీతాధ్యక్ష" నామముతో నేటి

(1) శ్లో. తా ఇంగుదీ స్నేహకృతప్రదీప మాస్తీర్ణమేధ్యాజినతల్ప మంతః,
తస్యై సపర్యానుపదం దినాంతే నివాసహేతో రుటజం వితేరుః.— రఘు-(14-91)

(2) శ్లో. యస్య త్వయా వ్రణవిరోపణ మింగుదీనాం తైలం నిషిచ్యత ముఖే కుశసూచివిద్ధే,
శ్యామాకముష్టి పరివర్థితకో జహాతి సోఽయం న పుత్రకృతకః పదవీం మృగస్తే— శాకుంతలనాటకము.4అంకము.

"యగ్రికల్చర్ డైరక్టరు" వలెనుండువాడు. నేటి "యగ్రికల్చర్ ఫారము" వంటికృషిక్షేత్రములు నాడును గలవు. చాణక్యార్థశాస్త్రమునుండి "సీతాధ్యక్ష" విధులను కొంత వ్రాసినచో చదువరుల కింపుగనుండునని యీ క్రింద వ్రాయుచున్నాడను:

(1) సీతాధ్యక్షుడు వ్యవసాయ వృక్ష వైద్య శాస్త్రముల దెలిసినవాడై, అట్టిశాస్త్రజ్ఞుల సాహాయ్యముగూడ పొందినవాడై యుండవలెను. సర్వధాన్యపుష్పఫలశాక కందమూలముల విత్తనములను, బచ్చలినంటి తీగలవిత్తనములను, పట్టు, పత్తివిత్తులను, కాలాతిక్రమణము కాకుండగ సంపాదించి పెక్కుసారులు దున్నబడిన వ్యవసాయక్షేత్రమునందు, పాలికాపులు, కూలివాండ్రు, చెఱనిడబడినవారు, కృషి చేయునటులు చేయవలెను.

నాగళ్లు, ఇతరములగు పనిముట్లు, ఎద్దులు, కమ్మరి, వడ్రంగి, మేదరి, త్రాడులనల్లువాడు, వలవాండ్రు, పాములబట్టువాండ్రు మొదలగువారిసహాయమును కర్షకులకు సీతాధ్యక్షుడు చేయించుచుండవలెను. కర్షకుల లోపమువలన గృషిఫలము చెడునపుడు ఫలహానికి సమముగా దండమును విధింపవలెను. (నా డరణ్యములు విస్తారముండుటచేతను మృగ సర్పభయము విస్తారము వ్యవసాయకులకు గలుగుచుండుటచే, వలవేటకాండ్రు, పాములవాండ్రు వ్యవసాయకుల కవసర మగుచుండిరి.)

(2) (సీతాధ్యక్షుడు తన కృషిక్షేత్రమునందు) తెల్లధాన్యము, ఎఱ్ఱరాజనాలు, ఆళ్లు, నువ్వులు, కొఱ్ఱలు, ధారకములు, వరాకములు నను ధాన్యవిశేషములను పూర్వసస్యములనుగాను పెసలు, మినుములు, కందులు మధ్యసస్యములనుగాను, కుసుంభములు, మసూరములు, ఉలవలు, యవలు, గోధుమలు, బోడసెనగలు, అవిసెలు, ఆవాలు నను సస్యముల నపరసస్యములనుగాను వ్యవసాయము చేయింపవలెను. ఋతువుల ననుసరించియైనను విత్తనములను వేయింపవలెను. సస్యములు వేయు కాల మతిక్రమించినయెడల లేక పెక్కువ మిగిలినభూములను పాలికి కొంతఫల మిచ్చునటులు ఇచ్చివేయవచ్చును.

తమశక్తివలన గష్టపడి సస్యాతిరిక్తభూములలో వ్యవసాయము చేసిన కర్షకులు నాలవవంతును గాని యైదవవంతును గాని తమకు నష్టము లేకయుండునట్లు యథేష్టముగా గాని ఫలము నధ్యక్షున కీయవచ్చును.

వ్యవసాయమునకై నీటిని గూడలువేసి చేతితో దీసికొనిపోవువారు ఫలితమం దైదవభాగమును, భుజములపై దీసికొనిపోవువారు నాలుగవభాగమును, నదులు, సరస్సులు, నూతులు, చెఱువులు మొదలగువానినుండి యేతముల మూలమున దీసికొనిపోవువారు నాలుగవభాగము నుదకభాగమనుపన్నుగ నిచ్చుకొనవలెను.

(3) కర్మకరులయొక్కయు, నీటియొక్కయు, ప్రమాణముల ననుసరించి, ఉష్ణసస్యములను, హేమంత గ్రీష్మర్తుసస్యములను వేయవలెను—వరిపైరు శ్రేష్ఠము; గుల్మసస్యము మధ్యమము; చెఱుకుదోట నీచము; చెఱుకును వ్యవసాయము చేయుటలో గష్టాతిశయము,

---

(1) సీతాధ్యక్షః కృషితంత్రగుల్మ వృక్షాయుర్వేదజ్ఞ స్తజ్జసఖో వా సర్వధాన్యపుష్పఫల శాకకందమూల పాల్లిక్యక్షౌమకార్పాసబీజాని యథాకాలం గృహ్ణీయాత్.

బహుహలపరికృష్టాయాం స్వభూమౌ దాసకర్మకరదండప్రతికర్తృభి ర్వాపయేత్.

కర్షణయంత్రోపకరణబలీవర్దైశ్చైషా మసంగం కారయేత్. కారుభిశ్చ కర్మారకుట్టాక మేదక రజ్జువర్తక సర్పగ్రాహాదిభిశ్చ తేషాం కర్మఫలవినిపాతే తత్ఫలహానం దండః.

(2) శాలి వ్రీహి కోద్రవ తిల ప్రియంగు దారక వరాకాః పూర్వవాపాః, ముద్గమాషశైబ్యా మధ్యవాపాః—కుసుంభ, మసూర, కుళుత్థ, యవ, గోధూమ, కలాయ, అతసీసర్షపాః పశ్చాద్వాపాః—యథర్తువశేన వా బీజవాపాః, వాపాతిరిక్త మర్ధసీతికాః కుర్యుః. స్వవీర్యోపజీవినో వా చతుర్థపంచభాగికాః యథేష్ట మనవసితభాగం దద్యుః; రన్యత్ర కృచ్ఛ్రేభ్యః స్వసేతుభ్యః—హస్తప్రావర్తిమ ముదకభాగం పంచమం దద్యుః—స్కంధప్రావర్తిమం చతుర్థం — చతుర్థం నదీసరస్తటాకకూపోద్ఘాటమ్—కౌటిలీయార్థశాస్త్రమ్- అధ్యక్షప్రచారే-సీతాధ్యక్షః (2-24)

(3) కర్మోదకప్రమాణేన కేదారం హైమనం గ్రైష్మికం వా సస్యం స్థాపయేత్. శాల్యాది జ్యేష్ఠం—షండో మధ్యమః—ఇక్షుః ప్రత్యవరః, ఇక్షవో హి బహ్వాబాధా వ్యయగ్రాహిణశ్చ—ఫేనాఘాతో వల్లీఫలానాం

యాతిశయము కలదు.—నుఱుగునేల, గోతులుగలనేలల యందు— తీగ (దోసమొదలగు) పాదుల బెట్టింపవలెను. ప్రవాహాంతరప్రదేశములయందు పిప్పలి, ద్రాక్ష, చెఱుకుతోటలను వేయింపవలెను.—నూతులుగల ప్రదేశములందు దుంపలు, కూరలు వేయింపవలెను. నట్టిపోయిన చెఱువులపల్లపుప్రదేశములలో, తృణధాన్యములను తీగ సస్యములను, సేద్యము చేయవలెను— దుక్కిచాళ్లు రెంటికినడుమను, గంధద్రవ్యములను (కర్పూరమువంటివానిని) ఔషధద్రవ్యములను, వట్టివేరు, కురువేరు, పెండలము, మొదలగు వానిని బెంచవలెను. మెట్టనేలను, పల్లపునేలను బెఱుగనోషధులను వానికి దగిన భూములయందు పెంపవలెను.

ధాన్యబీజముల నేడురాత్రులు మంచునందును, ఎండయందును నుంపవలెను. కోశధాన్యములను (కంద సెనగ, మొదలగునవి)ఇటులే మూడురాత్రులుంపవలెను. చెఱుకుమొదలగు కాండబీజములకు తేనె, నేయి, పంది క్రొవ్వు, పేడ పూయవలెను. దుంపలకు నేతిని, తేనెను పూయవలెను. కాల్చినగోతులలో బసువులయెముకలను పేడనువేసి వృక్షజాతులకు దోహదము చేయవలెను. ఉప్పనివి, పచ్చనివియు నగు చేపలను, జెముడుపాలను మొక్కలుపుట్టినపుడు జల్లవలెను— (ఎముకలయెఱువు, చేపలయెఱువు బౌద్ధకాల భారతీయులకు దెలిసియున్నది.) పొలములయందు పాములు లేకుండుటకుగాను, పత్తిగింజలు, పాముకుబుసము ధూపము వేయవలెను. ఆధూపముతగిలినచోటునందు పాములుండవు. చేసినకృషికి దగినటులు, పాలికాపులకు, కూలివాండ్రకు, భోజనద్రవ్యమునీయవలెను. ఇదిగాక వారికి నెలకొకటింబొతిక'పణము' జీతముగా నీయవలెను. పని ననుసరించి కారువులకు (వడ్రంగి, సాలి, మంగలి, చాకలి, మాదిగ, జాతీయులు) భోజనద్రవ్యమును జీతమును నీయవలెను. చెట్లనుండి రాలినపూవులు, పండ్లు దేవకార్యమునకును, ఆగ్రయణమనుయజ్ఞకార్యముకొఱకు వడ్లు, గోధుములను శ్రోత్రియులు, తపశ్శాలురును, రాశిలో మిగిలినయడుగుభాగమును,ముష్టివాండ్రును దీసికొనిపోవచ్చును.

వ్యవసాయము చేయబడి ఫలించినసస్యములనన్నిటిని కాలాతీతము చేయక జాగ్రత్తపఱుచుకొనవలెను. తెలివిగలవాడు క్రొంచెము పొట్టునైనను పొలమునందుంపఁడు. చేలగోసినవెంటనే మఱియొకచోటునం దొకదానితో నొకటి కలియకుండునటులును శిఖరము లెత్తుగనుండునటులును గుప్పలను వేయవలెను. కళ్లములనన్నిటి నొకచోట నేర్పఱచుకొని, పాలికాపులు, నిప్పును దగ్గరకు రానీయనివారై నీటిసహాయము గలవారై యుండవలెను.

—పరీవాహాంతాః పిప్పలీ మృద్వీ కేక్షూణాం — కూప పర్యంతా శ్శాకమూలానాం—హరణీపర్యంతాః (తటాకాదేరిక్తభూత ఆర్ద్రప్రదేశఃహరణీ) హారితకానాం పాల్యాలుపానాం—గంధభైషజ్యోశీరహ్రీబేర (హ్రీబేర) పిండాలుకాదీనాం యథా స్వం భూమిషుచ స్థాల్యాశ్చ అనూప్యా శ్చౌషధీ స్థాపయేత్. తుషారపాయన ముష్ణశోషణం చాసప్తరాత్రాదితి ధాన్యబీజానాం, త్రిరాత్రంవా కోశీధాన్యానాం మధు, ఘృత, సూకర వసాభి శ్శకృద్యుక్తాభిః కాండబీజానాం ఛేదలేపో మధుఘృతేన కందానాం అస్థిబీజానాం శకృదాలేపః శాఖినాం గర్తదాహో గోఽస్థి శకృద్భిః కాలే దౌహృదంచ, ప్రరూఢాంశ్చ శుష్కకటు మత్స్యాంశ్చస్నుహీక్షీరేణ వాపయేత్—

శ్లో. కార్పాససారం నిర్మోకం సర్పస్యచ సమాహరేత్, నసర్పా స్తత్ర తిష్ఠంతి ధూమో యత్రైష తిష్ఠతి.

షండవాట గోపాలక దాసకర్మ కరేభ్యో యథా పురుషపరివాపం భక్తంకుర్యాత్, సపాదపణికంమాసం దద్యాత్— కర్మానురూపం కారుభ్యో భక్తవేతనం - ప్రశీర్ణంచ పుష్పఫలం దేవకార్యార్థం— వ్రీహియవమాగ్రయణార్థం శ్రోత్రియా స్తపస్వినశ్చాహరేయుః, రాశిమూల ముంఛవృత్తయః—

శ్లో. యథాకాలంచ సస్యాది జాతజాతం ప్రవేశయేత్; నక్షేత్రేస్థాపయే త్కించి త్పలాల మపి పండితః. ప్రకారాణాం సముచ్ఛ్రాయాన్ వలభీ ర్వా తథావిధాః; నసంహతాని కుర్వీత నతుచ్ఛాని శిరాంసి చ. ఖలస్య ప్రకరా న్కుర్యా న్మండలాంతే సమాశ్రితాన్, అనగ్నికాస్సోదకాశ్చ ఖలే స్యుః పరికర్మిణః - కౌటిలీ యార్థశాస్త్రే, అధ్యక్షప్రచారే, సీతాధ్యక్షః-చత్వారింశో ఽధ్యాయః. ఆదితః పంచచత్వారింశః.

ఈకాలమునందు భూమిపన్నును, సాధారణముగా నారవపంతు, పంటలో రాజాదాయము క్రింద పుచ్చుకొనుచుండువారు. అర్థశాస్త్ర, యాజ్ఞవల్క్య స్మృతులనుండి, నిదర్శనములను వ్రాయుటకంటె సొంపగు కాళిదాసవాక్యమింపగునుగాన, దానిని వ్రాసెదను.

ఈక్రిందివాక్యములను "దిలీపమహారాజ" ముఖమునుండి పలికించినాడు.

(1) తల్లివంటి యీనందినీధేనువుం? లేగకును, హోమమునకును బోగా నీపొదుపున నుండుపాలను వసిష్ఠాజ్ఞనొంది నేను రక్షించుభూమినుండి యారవవంతుపన్నును దీసికొనునటు లనుభవింతును.

పన్ను ప్రజారక్షణముకొఱకే కాని యితరమునకు గాదని నాటివారు తలచుచుండిరి. మూడుఁ డెటుల చెప్పెనో?

(2) దిలీపుడు ప్రజల నభివృద్ధినొందించుటకే ప్రజలనుండి పన్ను పుచ్చుకొనుచున్నాడు. సూర్యుడు వేయిరెట్లు జలమును తిరిగియిచ్చుటకే భూసారముం గొనుచున్నాడు.

నేడు మనలో గొందరు తలచినటులు రాజకీయము పర్తకమనియు ఒకపన్నును బుచ్చుకొని మనిషియొక్క మేలును ప్రభుత్వము చేయుననియు నాటివారు తలచినటులు లేదు. మఱియు రాజునకు న్యాయమగు నారవవంతుపన్నును మతకార్యముగా గూడ నాటివారు తలచి పన్నును బుచ్చుకొనువారు. లేనిచో దేవతల కిడు బలివలె ధాన్యాదికమును ఏపవిత్రస్థలమునను వదలిపెట్టుచుండువారు—దాని నిటులు కాళిదాసు సూచించెను:

(3) నిత్యస్నానములు నిత్యతర్పణములు చేసికొనుటకు దగియుండి ఉంఛ (పొలములో గింజల నేరికొను) వృత్తిచే సంపాదింపబడిన ధాన్యములో రాజునకిచ్చు నారవవంతుపన్నగు ధాన్యముచే నలంకరింపబడు నిసుకతిన్నెలుగల మీ తీర్థజలములు నిరపాయములు గదా! (ఇది రఘుమహారాజు కౌత్సునితో ననిన వాక్యము.) నేటికాలమున నిటులు ప్రశ్నలిచ్చినవారు పిచ్చివారుగా పరిగణింపబడరా?

నాటిప్రభువులు ప్రజలయొక్క ఆయురారోగ్యములను నేవిగమును, ఈతిబాధలు లేకుండుటకును పాటుపడుచుండిరని యీక్రింది కాళిదాసవాక్యమువలన దెలియనగుచున్నది. ఇదియు దిలీపవాక్యమేను.

(4) ఓవసిష్ఠమహర్షీ! నాప్రజ లీతిబాధలు (అతివృష్టి, అనావృష్టి, యెలుకలు, మిడుతలు, పక్షులు, శత్రురాజులు) లేక నిక్షీతులై నూరేండ్లు సంతోషముగా జీవించుటకు నీబ్రహ్మవర్చస్సే కారణము.

మొదటినుండియు భరతఖండము వ్యవసాయకదేశ మగుటచేతను, వ్యవసాయమునకు పల్లెలే ముఖ్యస్థాన మగుటచేతను బౌద్ధకాలప్రభుత్వము పల్లెలయొక్క బాగోగులను జాగ్రత్తగ జూచుచుండెడిది. కౌటిల్యుడు "జనపదనివేశము" గురించి విశేషముగ జర్చించియున్నాడు. నాటిపల్లెలయొక్క పద్ధతుల నర్థశాస్త్రమునుండి స్వల్పముగా మూలరహితముగా వ్రాసెదను.

(5) గ్రామస్థు లెపుడును పొలములయందు విహరింప నిచ్ఛకలవారు. వారి కదియే యాశ్రమము కనుక, హస్తసమూహమునకు, హాలికి, ధనమునకు, ధాన్యమునకు వృద్ధినిగోరి నట నర్తక గాయక వాదక వాగ్జీవనకుశలవులు, గ్రామస్థలకార్యములకు విఘ్నము గలిగింపరాదు.

(1) శ్లో. వత్సస్య హోమార్థవిధేశ్చ శేషమృషే రనుజ్ఞా మధిగమ్య మాతః, ఊధస్య మిచ్ఛామి తవోపభోక్తుం షష్ఠాంశ ముర్వ్యా ఇవ రక్షితాయాః.
—రఘు. (2-66)

(2) ప్రజానామేవ భూత్యర్థం సతాభ్యో బలిమగ్రహీత్, సహస్రగుణ ముత్స్రష్టు మాదత్తేహి రసం రవిః.—
రఘు. (1-18)

(3) నిర్వర్త్యతే యై ర్నియమాభిషేకో యేభ్యో నివాపాంజలయః పితౄణామ్, తా న్యుంఛ షష్ఠాంకలసైకతాని శివాని వ స్తీర్థజలాని కచ్చిత్.
—రఘు. (5-వ సర్గః)

(4) శ్లో. పురుషాయుషజీవిన్యో నిరాతంకా నిరీతయః; యన్మదీయాః ప్రజా స్తస్య హేతు స్త్వద్బ్రహ్మవర్చసమ్.—రఘు. (1-63)

(5) కౌటిలీయార్థశాస్త్రమ్. (2-1)

(ప్రతిపల్లెయందు నేడు బయలుదేరు నాటక సంఘములు మొదలగువానివలన నేడనేకులు వ్యవసాయకులు వ్యర్థులగుచున్నారు. వినోదములపై తన్నునువేయుటకు మద్రాసుప్రభుత్వ మిపుడు యత్నించుచున్నది. వ్యవసాయకుల రక్షణకై యిది యుపయోగించినచో సంతసకరమగును.)

శిక్షలచేతను, కూలిచేతను, పన్నులచేతను బీడింపబడుకృషి కార్యమును, దొంగలచేతను, పాములచేతను, విషమునిడువారిచేతను, రోగములచేతను బీడింపబడు పశుగణమును రాజు రక్షింపవలెను. ఋత్విక్కులకు, ఉపాధ్యాయులకు, పురోహితులకు, శ్రోత్రియులకు, శిక్షలు, పన్నులు లేనటులు ఇనాముభూముల నీయవలెను. గ్రామాధ్యక్షుడు (మునసబు లేక రెడ్డి) కరణము మొదలగువారికిని, గ్రామసేవకులకు, సిపాయిలకు, వైద్యులకు, గుఱ్ఱపురౌతులకు, లేఖకులకు, వాహకులకు, దానవిక్రయాధికారములు లేకుండగ భూములనీయవలెను.

(1) సమాహర్త (నరు గ్రామములపైనుండు నధికారి "తహస్సీల్ దారు" వంటివాడు) తనయధికారమునకు లోబడినగ్రామములను, నాలుగుభాగములుగా విభజించి, యొక్కొక్కభాగమందలి గ్రామములను, 1-2-3 తరగతులుగా నేర్పఱచి, వానిలో నేవి పనికిరానివో, యేవి యాయుధపరిరక్షితములో, ఏవి పశుధనధాన్యజన సంపన్నములో నిర్ణయింపవలెను.

సమాహర్తచే నాజ్ఞాపింపబడిన "గోపుడు" (రివిన్యూయినస్పెక్టరు తుల్యుడు) పదికాని, యైదుకాని గ్రామముల బరీక్షించుచుండవలెను.

గోపుడు గ్రామములకు బొలిమేరల నేర్పఱచి, పొలములలో దున్నినవి, దున్ననివి, బీడులు, ఊడ్పునేలలు, తోటలు, పద్మాకరములు, వీథులు, వనములు, కట్టడములు, యాగప్రదేశములు, లేక, బౌద్ధమతమఠములు, దేవాలయములు, పంటచెఱువులు, శ్మశానములు, సత్రములు, చలిపందిరులు, పుణ్యస్థానములు, రాజమార్గములు, లెక్కగా వ్రాసి, పొలములయొక్క, అరణ్యములయొక్క, మార్గములయొక్క మితిని, మర్యాదను నిర్ణయించి, దాన, విక్రయములను, ముదరాలను యేర్పఱుపవలెను.

గోపుడు, పన్నుచెల్లించునట్టి, చెల్లింపనట్టి నాలుగుజాతులవారియొక్క గృహములను, కర్షక, గోపాలక, వైదేహక (వర్తకుడు), కారు (కమ్మరి), కర్మకర, దాసులను, ద్విపద, చతుష్పదజంతువులసంఖ్యను, కళలను, స్త్రీ, బాల, వృద్ధ, యువకుల కర్మచరిత్రను, వారి యాదాయవ్యయ జీవితపరిమాణమును తెలిసికొనవలెను.

సమాహర్త (తహశీల్ దారుతుల్యుడు) చే నియమింపబడిన గ్రామాధికారులు, గ్రామములోని పొలములమానములను, అందుత్పత్తియగు పంటమితిని, గృహములయొక్క దైశ్వర్యస్థితిక్షయములను, కులములవర్ణకర్మలను, మృగములను, ఆదాయవ్యయములను, వచ్చుచుబోవుచుండువారి రాకపోకలకుఁ గారణములను, దుష్టస్త్రీపురుషుల సంచారప్రవర్తనములను దెలిసికొనుచుండవలెను.

నాటి మత, సాంఘిక, రాజకీయధర్మములు, దేశమునందు కఱువులు లేకుండగ జేయుచున్నవని, యాజ్ఞవల్క్యస్మృతి, కౌటిలీయార్థశాస్త్రములచే దెలిసికొనుచున్నాము. యాజ్ఞవల్క్యస్మృతి యీక్రిందివస్తువులు దేశమునుండి పైకిబోరాదనుచున్నది. గ్రంథవిస్తరభీతిచేఁ దాత్పర్యమునే వ్రాయుచున్నాడను.

(2) ఫలములు, మణులు, పట్టు, సోమము, నువ్వులు, బియ్యము, రసము, క్షారము, నేయి, శస్త్రము, తేనె, లక్క, చర్మము, కంబళి, భూమి, పట్టుబట్ట, నీలిమందు, ఉప్పు, సీసము, తెలకపిండి, గంధము వీనిని వర్తకముచే జీవించువాడు కూడ నెప్పుడును విక్రయింపరాదు. ధర్మముజేయుటకైతే విక్రయింపవచ్చును. నువ్వులను ధాన్యమును ఒకదాని కొకటి మార్చుకొనవచ్చును.

అర్థశాస్త్రమునందును, యాజ్ఞవల్క్యస్మృతియందును ప్రతిగృహస్థుడును రెండుసంవత్సరములకు సరిపడిన ధాన్యమును గృహమునందు నిలవచేసికొనవలెననియు, దేశప్రభువు రాజ్యమునందు మూడేండ్లకు సరి

(1) కౌటిలీయార్థశాస్త్రము-౨-౩౫.
(2) యాజ్ఞవల్క్యస్మృతి-ప్రాయశ్చిత్తకాండ.

పడిన ధాన్యమును నిలవజేయవలయు ననియు గలదు. అందువలన భోజనపదార్థములకు దేశమునందు కొదువ లేదు. దుర్గాధ్యక్షుడు (నేటి మునిసిపల్ చైర్మెను లేక డిస్ట్రిక్టుబోర్డుప్రెసిడెంటువంటివాడు) నూలు వడుకుటకు జేయు నిబంధనలు బహుసూక్ష్మదృష్టితో బని లేనివారికి బనికల్పించుటకును, దేశక్షేమమునకును గారణములై యున్నవి. ప్రత్యేకము "వస్తువు నేతలపై" "సూత్రాధ్యక్షు"డను నధికారి యొకడుండువాడు. ఆ సూత్రవ్యవహారము ప్రస్తుతగ్రంథమున కనవసరమగుట చేతను, గ్రంథవిస్తరభీతిచేతను వ్రాయ లేదు. నాటిప్రభువులు భూమిపై విశేషముగ పన్నును విధింపక యెగుమతి దిగుమతులపైని, ఖనిజాదులపైని శుల్కమును వేసి దేశమునందు క్షామము లేకుండగను, రాజకోశమునకు నష్టము లేకుండగను జాగ్రత్తపడుచుండిరి. దేశమునుండి పైకిబోవు ధాన్యములపై నూటికి యిరువదియైదువంతుల వరకుపన్నువిధించుచుండినటులును, భూమిపన్ను నామ మాత్రముండుటచేతను, రైతున కాకాలమునందు లాభముగానే యుండెడిది. కాని శాశ్వతత్వము లేక, మద్రాసురాష్ట్రపు రీసెటిల్‌మెంటువలె ఒక్కొక్క తరమునకే భూమి రైతునకీయబడుచుండుటచేతను, కొంతవరకు రాజుయొక్క నిరంకుశాధికారముచేతను, ప్రజల కప్పుడప్పుడు బాధ కలుగుచుండెడిది. ఇంకను నాటివిశేషముల నరయగోరువారు కౌటిలీయార్థశాస్త్రము జదువుదురుగాక! ఇంచుమించీకాలముననే యీనాం భూములను పట్టాలను, అగ్రహారాదులకు దానశాసనములనూ ఇచ్చుటకు ప్రారంభించిరి. ఆ వృత్తాంతమును యాజ్ఞవల్క్యస్మృతి యెట్లు చెప్పుచున్నదో చూడుడు:—

(1) రాజుభూమిని దానమిచ్చు నిబంధనల జేసి రాబోవుయోగ్యులకు ప్రభువుల కానవాలుగ నుండునటులు వ్రాతమూలకము చేయింపవలెను.

బట్టయందుకాని రాగిరేకునందుకాని తనముద్ర యుండునటులను తనవంశస్థుల పేరులు తనపేరు నుండునటులును వ్రాయింపవలెను.

భూమికి నేర్పరచిననిబంధన, భూమియొక్క మితి, దానమిచ్చినకాలము, తనవ్రాలును పట్టాపైని నుండవలెను.

పై నిబంధనలననుసరించియే బౌద్ధకాలము మొదలు మహమ్మదీయకాలాంతమువరకు పెక్కు తామ్రశిలాశాసనములు దేశప్రభువులచే వ్రాయింపబడినవి. బట్టపై వ్రాసినశాసనములు స్వల్పకాలముననే శిథిలమగుటచేతను, అట్టిపటశాసనములు నేడు కాన్పించుచుండుట లేదు.

నేటికిని నాటికిని, భూమియొక్క సరిహద్దుతగాయిదాలు, పాలికాపుల నిబంధనలు, వారివేతనములు, వ్యవసాయదారునకు గలిగించెడి నష్టములు, అభియోగములు, అందులకగు శిక్షావిధానములు, ధాన్యాదులకొలతలు, ధాన్యాదుల నప్పుగొనుట, ధాన్యాదులకు వడ్డీని నిర్ణయించుట మొదలగు వ్యవసాయక సంబంధమగు వ్యవహారములు సమానమని యాజ్ఞవల్క్యస్మృతి కౌటిలీయార్థశాస్త్రముల జదివినవారికి స్పష్టమగును. కొన్నికారణముల నాలోచింపగా నేటికంటె నాడు పల్లెలయొక్కస్థితి బాగుండెనని తోచుచున్నది. కాని జను లమాయకులై నిరంకుశప్రభుత్వములకు జంకుచుండువారని తోచును. ఆ నిరంకుశాధికారము దేశమునందుండు మత సాంఘికవిషయములలో నంతర్యాప్తమగుటచే కొంత వడి తగ్గియున్నదేమో యని తలపవలసియున్నది. అమరుడు, పలుపు, దండు మొదలు నాగలివరకు గల సర్వ వ్యవసాయపరికరములను వర్ణించియున్నాడు. చాణక్యుడు నీటిత్రాడు, వాయుయంత్రాదికమును వర్ణించియున్నాడు. అందువలననే వేయివత్సరములదీర్ఘమితిగల బౌద్ధకాలమునందు వ్యవసాయము సర్వాంగసుందరమైయున్నదని తలంపబడుచున్నది.

---

(1) దత్వా భూమిం నిబంధంవా కృత్వా లేఖ్యంతుకారయేత్, ఆగామి భద్రనృపతి పరిజ్ఞానాయ పార్థివః.—(16) తటేవా తామ్రపట్టేవా సముద్రోపరి చిహ్నితమ్, అభిలేఖ్యాత్మనో వంశ్యా నాత్మానంచ మహీపతిః. (17) ప్రతిగ్రహపరీమాణం దానచ్ఛేదోపవర్ణనమ్, స్వహస్తకాలసంపన్నం శాసనం కారయేత్ స్థిరమ్.

—(18) యాజ్ఞవల్క్యస్మృతి-వ్యవహారకాండ.



# మరపు

శ్రీమతి న్యాయపతి వెంకటవిజయలక్ష్మమ్మ గారు

శ్రీకరమున్ సమస్తబుధశిష్టశరణ్యము భక్తలోకసౌ
ఖ్యాకరమున్ సదాభ్యుదయకారణమౌ యదువంశచంద్రు న
స్తోకకృపామృతంబు దయఁజూచుచుగావుత నెల్లకాలముం
గోకిలకీరరాజములకున్ శుభమంగళసౌఖ్యదాయియై.

ఉ. హాయిగ గంధవాహపరిహారము మైఁజెలరేగి సౌఖ్యసం
ధాయి లసద్గతిన్ హృదయతాపహరంబు వినోదవాహినీ
తోయ నవీనవీచికలఁ దోఁగుచు నిష్టఫలానుమోదివై
నాయటువంటివారిఁ గనినావొ మరాళకిశోరమా మదిన్.

ఉ. తీయని లేఁజిగుళ్లు తమిదీర భుజించెడువేళఁ దాపముల్
వాయ వసంతమారుత మవారిగఁ జల్లున వీచువేళలన్
గోయని తోడివారు గుమిగూడి విశాలరసాలశాఖలన్
ఊయలలూగువేళల నహో పికవత్సమ! నన్ దలంతువే.

ఉ. వెన్నెలవేళ నీవు కడువేడుకమై సరివారిలోన సౌ
ఖ్యోన్నతి నాటపాటల సముున్నతి వైభవశాలివై శుభా
సన్నప్రమోదచంద్రిక లజస్రముఁ గ్రోలఁగ నున్నవేళలన్
యెన్నఁగరాదుసూ సహజమే యిది నీకుఁ జకోరవత్సమా!

## మౌనము

ఉ. మాటలురావు నీకుఁ బలుమారిటు దెల్పఁగ నాదునాల్కయున్
బీటలువారెఁ జూపులకుఁ బెద్దయుఁ జక్కదనంబు ముద్దులున్
మూటలుగట్టు నోచిలుక మూకతనం బెటనుండివచ్చె నా
హాటకగర్భు నాడవలె నో నినుఁ బల్కిన లాభమున్నదే!

చ నిరతవనీవిహారకరణీయత మూర్ఛతఁ జెందియో మనో
హర తరుణీవినూత్నమృదుహారి కలస్వర మాలకించియో
సురుచిరబింబఖాదివయి చొక్కియొ కాక మరేమి కల్గెనా
కరయఁగరాదు నీకు నెటు లబ్బెను మూకతనంబు కీరమా!



# పంపరమాసి

ఎ. లక్ష్మణరాజునాయుడు గారు

ఫలవృక్షముల వ్యవసాయమున నారింజకుటుంబమునకు చెందిన 'పంపరమాసి' పండును చూడనివారుగాని తినని వారుగాని మనలో ఉండరని మా నమ్మకము. ఆంధ్రదేశమున విశాఖపట్నం, గోదావరీ, కృష్ణామండలములయందు విశేషముగా 'ఫలించునట్టి' యీ చెట్టుయొక్క చరిత్రము తెలియదగిన దగును.

## ఉపోద్ఘాతము

అందరెరిగినట్టియు విశేషముగా లభించునట్టియు నీ పంపరమాసిపండు మనదేశపు పండుగాదు. దీనికి సంస్కృతభాషయందు పేరేమియు కనబడదు. తెనుగున దీనిని పంపరమాసి, పంపరపనస, పంపరదబ్బ, తింపరదబ్బ మొదలగు వివిధనామములతో పేర్కొందురు. అయినను ఈపేర్లు తెనుగుపేర్లుగావు. మున్నూరేండ్లక్రిందట నీఫలజాతి భరతఖండమునకును, సింహళద్వీపమునకును పశ్చిమఖండవాసులు మలయద్వీపమునుండి తీసికొనివచ్చిరని చరిత్రమువలన తెలియవచ్చుచున్నది. హాలండుదేశీయులు దీనిని పాంపెల్‌మోస్ (pompel-moes) అనియు, స్పెయినుదేశీయులు పాంపిల్‌మూసా (pamplemusa) అనియు ఫ్రెంచివారు పంపెల్‌మోసి (pampelmousse) అనియు నందురు. ఈశబ్దముల యర్థము "గుమ్మడిదబ్బకాయ" యని గ్రహింపవచ్చును. మనవారు దీనికిపెట్టినపేర్లలో పంపరమాసి యనునది ఫ్రెంచివారి పేరగు పంపల్‌మోసి యనుదాని ననుకరించుచున్నది. కావున ఫ్రెంచివారే మనదేశమున దీనినిమిక్కిలిగా వ్యాపింపజేసిరనియు వారుపెట్టినపేరే మనవారు కొంచెముమార్పు చెందించి వాడుకొనుచున్నారనియు నూహింపదగి యున్నది. పిదప ఇంగ్లీషువారు దీనిని పుమేలో (pumelo) లేక paradise-apple అనివాడుచున్నారు.

[illegible]

ఉద్యానకృషి ననుసరించి ఇది నిమ్మ, దబ్బ, నారింజ, మొదలగు ఫలజాతిలో చేరినది. ఈజాతిలోని గొప్పపండు ౨౫ వీసెలబరు వుండును. ఈ పంపరపనస పుల్లనిది తియ్యనిదియని రుచినిబట్టియు, ఎఱ్ఱనిది తెల్లనిది యని లోపలిరంగునుబట్టియు రెండువిధముల నుండును. పెక్కుదినములవరకు నిలువయుండునది మంచిజాతిపండు. ఆరబండిన పిమ్మట కొన్నాళ్లు పండ్లను చెట్లనే యుంచవచ్చును. కోసి గదులలోనయిన నుంచవచ్చును. కోసిన రెండునెలలవరకు యిది చెడిపోదు. పచ్చికాయలనుగాని పరువుతగిలినకాయలను గాని యెంతమాత్రము కోయగూడదు. అపుడు పండినపండువలె నిలవయుంచిన పండు రసము చిలుకక తొనలు కొంచెము ఆరియుండును. పండ్లు నిలవయుండుటవలన తోటలువేయువారికిని, పండ్లనమ్మువారికిని లాభకరముగానుండును. శీఘ్రముగా చెడిపోవుపండ్లుభయులకును మంచివిగావు గాన మంచి జాతిపండ్లనే పండింపవలెను.

పంపరమాసిచెట్టు దక్కనిచెమ్మగల నేలను మిక్కిలిగా పెరిగి వేగముగా ఫ్రూతబట్టి యధికముగా ఫలించును. ఈతోటలు పుష్పించుకాలమున తోటంతయు సుగంధము వ్యాపించును. పండ్లకాలమున తోటలోని చెట్లన్నియు సువర్ణరమ్యములగు ఫలములభారమున నమ్రములై కన్నులపండువుగా నుండును. ఇప్పుడు సాధారణముగ పండు ఫలములు ౨ వీసెలు బరువు, ఏడు లేక ఎనిమిది అంగుళముల బంతివలెనుండి, ఒకటి లేక ఒకటిన్నర అంగుళము దళసరితొక్కగలవియైయున్నవి. చిన్నవియు కోలగానుఉన్న జాతులును షేడక్ (shaddock) అని వ్యవహరింపబడుచున్నవి.

జమైయికా ద్వీపమునందు ద్రాక్షఫలములరుచిగల పంపరమాసి యొకటిగలదు. బొంబాయి సమీప ప్రదేశములలో నయిదు ఉపజాతులు గలవు. అయిదేసిపేశల బరువుతూగు ఉత్తమజాతిని 'గుర్వీ' యందురు. రెండేసిపేశల బరువుతూగు రెండవజాతిని 'వినియానివాడి' యందురు. ఇందు కొంచెము ద్రాక్షరుచిగలదు. 'చారే', 'కాఫీ' యను మఱిరెండు మంచిరుచిగల పెద్దపండ్లజాతులు గలవు. అయిదవజాతియగు 'ఫాకో' యనునది కడు తేలికగానుండు పెద్దపండ్లను బండునుగాని, పండ్లమీది తొక్కయు లోపలిదూదియు నెక్కువగళసరిగలిగి తొనలసంపు మిక్కిలి చిన్నదియై యుండును. ఈజాతిపండు నాలుగణాలవెలగలిగియుండి 'గుర్వీ' జాతిపండు మూడేసిరూపాయల వెలగలిగియున్నది. ఈ జాతిపండ్లే యింగ్లాండున కెగుమతియగుచుండును. కలకత్తా ప్రాంతములలో పంపరమాసిని 'చకోత్రా' యందురు. పండ్లనుకోయునప్పుడు చర్మమునకు దెబ్బనెంతమాత్రముతగుల నివ్వకూడదు.

అంట్లు-మొక్కలు

బలమైన, ఆరోగ్యకరమైన ఉత్తమజాతిచెట్లను లేక అంటులను కొనవలెను. చెట్లు బలకరముగా నుండి బాగుగ పెరిగినను, జాతియందు లోపముండినయెడల మంచిజాతిచెట్లవలన వచ్చినంత లాభము రాజాలదు. అంట్లను కొనునప్పుడు శ్రేష్ఠతమమైనవాటిని ఎంచుకొనవలెను. అప్పుడు గమనించవలసిన విషయములు.—

౧. అంటు క్రిందిభాగము పైభాగమంత లావుగను అంతకంటె కొంచెమెక్కువలావుగను నుండవలెను.

౨. రెండుభాగములును బాగుగ కలిసియుండవలెను.

౩. పై భాగము పొడువుగా నుండకూడదు; పొట్టిగాను నలుప్రక్కలు కలిగియుండవలెను.

౪. అంటుకట్టినచెట్టు ఎంతముదురుగా నుండిన అంతమంచిది. కాని గిడసబారియుండకూడదు.

త్వరలో ఫలితము కోరువారు మంచిజాతిఅంటులను, నమ్మకమైనవారివద్ద పుచ్చుకొని నాటవలెను. మంచిజాతులను కొనునప్పుడు మూడు నాలు గణాలు హెచ్చు అయినను నష్టముకాదు. విత్తులనుండి పుట్టిన మొక్కలు ఫలితమునకు వచ్చేసరికి సుమారు ఆరేడు సంవత్సరములు పట్టును. కొన్నిచెట్లు ౧౨ మొదలు ౧౫ ఏండ్లవరకు బాగుగఫలించవు. బాగుగపండిన పండ్లవిత్తనములనే మొక్కలుకావలసిన వాడుకచేయవలెను.

నేల - శీతోష్ణస్థితి

ఫలవృక్షములపంటఅంతయు నేలమట్టిపై నాధారపడియుండుటచే మట్టియొక్క లక్షణములను గుణములను తెలిసికొనుట మంచిది. నేలలు ఒకప్పుడు ఫలవంతములుగాను, మరియొకప్పుడు ఫలరహితములుగాను నుండుటకు కారణములను తెలిసికొనగోరినయెడల మొక్కలు ఏవిధముగా పెరుగునది వాటినిబట్టి యాహారపదార్థములేవైనవి తెలుసుకొనవచ్చును. పంపరపనస సాధారణముగా శీతలప్రదేశములందును, చల్లగను, సముద్రతీరమునకు సమీపముగ నున్నచోట్లయందును వృద్ధియగును. అయినను ఉష్ణప్రదేశములలోను వర్షము స్వల్పముగా నుండెడిప్రదేశములలోను వృద్ధికిరావని తలపకూడదు. సూర్యరశ్మితగలనిదియు, మెట్టపల్లములుగలదియు, గట్టిగను బంకమట్టియుగలదియునగు నేలయందు తోటలను వేయకూడదు. ఎక్కడ తగినంతగాలి, తేమ, వేడిమి యుండునో ఆచోట్లలో మొక్కలు బాగుగ మొలచును. తోటలయందేకాక పెరడులలోకూడ నీరు వాడుకొనుచోటను ఒకటి రెండు మొక్కలను పెంచవచ్చును.

మొక్కలనునాటుట

తోటకొరకు ప్రత్యేకించిన స్థలమును, అంటులను నాటుటకుముందు బాగుగను, లోతుగను దున్ని నేలను శుభ్రపరచి నెలరోజులవరకు విడిచిపెట్టుట మంచిది. చెట్లు దూరదూరముగ నుండవలెనుగాన ముప్పదియడుగుల దూరమున పొడుగు, వెడల్పు, లోతు మూడడుగులుండునట్లు గోతులను త్రవ్వవలెను. కాబట్టి ఎకరమునకు 48 చెట్లుండగలవు. మొక్కచనిపోయినచోటమరొక మొక్కను నాటునది.

అంటుమధ్యవేరు లేక తల్లివేరుముడుచుకొనిపోకుండునట్లు గోతిమధ్యనుంచి నేల జేనడుతక్కువగా త[illegible]రు

చేసినమట్టిలోనింపి, కొద్దిగా నీరుపోయవలెను. నీరింకి నపిమ్మట తక్కినమట్టినిపూడ్చునది. అంట్లను లోతుగా కాక, వేరులన్నియు మట్టిలో పూడియుండునట్లుగా పాతవలెను. నేలమంచిదగుచో మొదటి సంవత్సరమున యెరువువాడ నవసరములేదు. రెండవసంవత్సరముతోలకరి ముందు బాగుగ ముక్కిన పశువులయెరువు ఒక్కొక్క తట్టెడు ఒకొక్కచెట్టుకు వేయవలెను.

మొక్కలను నాటిన మూడుమాసములవరకు వారమునకు రెండుమారులచొప్పున నీరుపోయుచుండవలెను. వేసవికాలమందు వారమునకొక్కమారు చెట్లకు నీరుకట్టవలెను. నారింజ,కమల, నిమ్మజాతులలో(citrus fruit trees)పంపరమాసిచేరినదగుటచేత నేలనెప్పుడు చెమ్మగా నుంచవలెను.

చెట్లమధ్యస్థలమున, చెట్లకును తోటయజమానికిని లాభకారిగా నుండుటకు అరటి, బొప్పాయి, అనాస లేక బచ్చలి, వంకాయ, ఉల్లి మొదలగు కూరగాయలను మూడునాలుగుసంవత్సరములకాలము పైరుచేయవచ్చును.

కొమ్మలను, పింజలను నరకివేయుట, కొమ్మలను కత్తిరించుట ఫలవృక్షములయందు చాల లాభకరము. సహజముగా పెరుగుచుండెడిచెట్టుయొక్క కొమ్మలన్నిటికి ఎండ, గాలి కావలసియుండును. చెట్టును కత్తిరించుట చేతను,కొమ్మలనురాపాడనివ్వకుండచేయుటచేతను, చెట్టు విరివిగా పెరుగక చెట్టుచుట్టుగల చెమ్మనుకాపాడి మొదటికి గాలి ఎండతగిలి పగులకుండునట్లుచేసి బలువంతేయు మధ్యనేయుండి ఫలములు పెద్దవిగను, ఎక్కువగను ఫలించును. కాబట్టి నిష్ప్రయోజనమైన కొమ్మలను కత్తిరించునప్పుడు వాడిగలచాకుతో గుంపుపైన నరుకవలెను. గుంపుపైన కొమ్మను ఉంచగూడదు. అట్లుంచవలసిన సమయములయందును ముదర కొమ్మలను తీసివేసిన చోట్లను పేడ, ఎఱ్ఱమన్ను కలిపి అంటించవలెను. మిగిలిన కొమ్మలకు కాచెడిపండ్లు రుచికరముగాను, అందముగాను ఉండి, కొమ్మలకు గట్టిగా అంటుకొని నీరు లేకపోయినను గాలిగట్టిగవీచినను రాలిపోవు.

పండ్లవలన మితిమీరిన బలువు లేకుండుటకుగాను పండ్లను ఎడయెడముగా నుంచుట మంచిది. ఒక్కొక్క గుత్తిలోను పెద్దపెద్ద కాయలను కొన్నింటినిఉంచి, కొన్నిటిని కోసిపారవేయవలెను. ఈలాగుచేసిన ప్రతి సంవత్సరమును చెట్టు ఫలించుచునే యుండును.

## ఎరువులు

పండ్లచెట్లకు యెరువునువేయుట చాలమంచిది. చెట్టుమొదలున ఆరు, ఎనిమిది అంగుళముల దూరము వరకు ఎరువునువేసి మట్టితోబాగుగ కలియచేసి నీరుపోయవలెను. తడిలేకపోయినచో చెదపట్టుట జరుగును. అందుకుగాను చెట్టుచుట్టు సముద్రపుయిసుకగాని ఏటియిసుకగానివేసిన చెదపట్టదు. ఎరువులు (గత్తములు) అనేక రకములు అయినను రైతులకు సులభముగ లభించుపశువుల ఎరువు ౫ మొదలు ౧౦ టన్నుల చొప్పున ఒక్కొక్క ఎకరమునకు వేయవలెను. సున్నము,బూడిద గానుగపిండి, పచ్చి, రసాయనపు యెరువులుగూడా వాడవచ్చును. అందులోనుండు నత్రజనిబట్టి ఏదియెంత వాడుక చేయవచ్చునన్న సంగతి తెలియగలదు.

## చీడలు - వ్యాధులు

ఈవ్యాసమును ముగించుటకుపూర్వము చెట్లవిరోధుల గురించి చెప్పుటావశ్యకము. ఫలవృక్షములకుసాధారణముగా చీడలు, వ్యాధులు వచ్చుచుండును. అయినను పంపరపనసకు చీడపురుగులు విశేషముగా నుండవు, కాని బత్తాయి, సంత్రా, చీనా, గుర్వీ మొదలయినపండ్లచెట్లకు వీనివలన హానికలుగును. ఈ విరోధులురెండు విధములు.ఆకులనుచర్మమునుతినివేయుపురుగులుఒకరకము రెండవజాతి లోపలనున్నరసమునుపీల్చిచెట్టునుచంపునది. వీటిబాధలేకుండచెట్లనుకాపాడుటతోటమాలీలయు,చెట్లయజమానులయుముఖ్యకర్తవ్యము.కష్టములువచ్చినప్పుడు నివారణచేసికొనుటకంటె, అవి రాకుండునట్లు చేయుట యెక్కువమంచిది. శీతోష్ణస్థితిగతులు, నేలస్వభావము, ప్రదేశము, దోహదము మొదలయిన విషయములు చెట్లయారోగ్యమును, చెట్లకు చీడలు వ్యాధులు రాకుండునట్లు నిరోధించుటకు దార్ఢ్యమును కల్పించును. శుభ్రముగాను శ్రేష్ఠమైన పద్ధతి ప్రకారము నాటి పెంచిన చెట్లకు వ్యాధులుగాని, చీడలుగాని యుండవు. ఈవ్యాధులను చంపుమందులు, వివిధద్రావకములు అం

గములయందు దొరుకుచున్నను, మంచి రకమునుతక్కువ వెలకు మనమే తయారు చేసికొనగలము.

ఒక పంపుసబ్బును, 3 శేర్ల వేడినీళ్లలో కరుగనిచ్చి, మూడుబుడ్లు కిరసనునూనెనుకలిపి ౫ నిమిషములు కాచినపిమ్మట పాత్రలయందు పోసిపెట్టుకొనునది. వాడుకచేయునప్పుడు 30 భాగములు నీళ్లలో కలుపుకొని పిచ్చికారుతో రెమ్మలను తడిపినచో పురుగుచచ్చి చెట్టుకు మరేవిధమైనహానిని కలుగనీయదు.

ఆకలములు, గంధకము, పొగాకుకాడలు మొదలయినవాటిని తోటమధ్యపోగుచేసి పొగపెట్టవలెను. మంట మండనివ్వకూడదు. పొగ గాలిలో వ్యాపించి తోటనంతను కప్పివేయును. పూతపూయు కాలమందారంభించి పండ్లుపండి కోయబోవునంతకాలము వరకను యీలాగున పొగవేయుట మంచిది.

చెట్లమధ్యనున్న నేలను తరుచు దున్నుచుండవలెను. అశిమము రెండు సంవత్సరముల కొకమా రయినను బాగుగ దున్నవలెను. లేనిచో చీమలు చెద పుట్టును. చెట్టునకు చెదపట్టుచున్నట్లుఅనుమానము కలిగినయెడల

| | |
|---|---|
| సున్నము | 1 తట్టెడు |
| మెత్తనిసబ్బు | 1½ వీశె |
| కిరసనునూని | పావుబుడ్డి |
| సోడ | ½ తట్టెడు |
| టర్పంటైనుతైలము | 1 చిన్నగిన్నెడు |
| నీళ్లు | సరిపోయినన్ని |

బాగుగకలిపి చెదపట్టినచోటున చాకుతోగోకి కుంచెతో పట్టించవలెను

చీమలపుట్టలయందు; మైదాపిండి, పంచదార, ఉల్లి, పాషాణము కలిపి పూసినయడల అవి చచ్చుటగాని లేకమరొకచోటునకు కదలిపోవుటగాని జరుగును.

ఉపయోగములు

ఆరోగ్యమునిచ్చు అన్నిపండ్లలోను యీజాతి పండ్లు మొదటివి. అమలాపురము తాలూకాలో పంపరమాసితోటలవలన నెందరో ధనమార్జించుచున్నారు. బొంబాయివారివలె విదేశముల కెగుమతిచేసి ధనమార్జింపవచ్చును. తెనుగుసీమను పండినపండ్లన్నియు మనవారు కేవలము తినివేయుటయందే ముగియుచున్నది. కాని ఆంగ్లరాజ్యముల కెగుమతిగాని లేక కాలిఫోర్నియా వారివలె టిన్నులలోగాని బుడ్లలోగాని నిలవచేయుటగాని లేదు.

మనవారు పంపరమాసితోటలను విశేషముగా వేయించి లాభమును పొందుదురుగాక!






అనంతపంతుల వేంకటేశ్వర్లు గారు, బి. ఎ.; బి. యల్.

ఒకపార్శ్వమున విభూత్యుగ్రరేఖాపాళిఁ, బంగనామము లొక్కపార్శ్వమందు
నుద్భటారాధ్యంబు నొకకేల నొకకేలఁ, బాండురంగక్షేత్రపద్యకృతియుఁ
బరిహాసకృద్గ్రామ్య భాషాళియొకమారు, పండితచర్వాచర్వభాష నొకటఁ
సీషణాత్రయ నిమగ్నేచ్ఛా విహారమొక్కతఱి ముముక్షువుగతి నొకప్డు
ప్రకటితము సేసి వికటస్వభావమూర్తి, నాఁగ నొకదివ్యపురుషుండు నానిమీలి
తాక్షులం జొచ్చి మన్మనఃస్థలమునందు, స్ఫుటముగానున్న "కుకవిప్రబోధ" మరసి.

క. ముమ్మారు మూఁడు తెఱఁగుల, నెమ్మాడ్కిని జదివెనో వచింపఁగలే ని
ష్ఠమ్మా! కడుపుబ్బఁగనా, కమ్మాదిరినవ్వు పుట్టినయ్యెఁ; పిదపన్.

క. "ఓవికటదాసరీ! భవ, దావాసంబెచట? యుష్మదభిధానంబుల్
నేవినఁగోరెదను; కుకవి, భావంబులఁ గేలిసేయఁ బాడిమె నీకున్."

గీ. అనుచుఁ బ్రశ్నించు నా కతఁడనియె "భేద, రహితజాతిగఁ దాఁగవివ్రజముఁ జెప్పె
మున్ని భేదంబు లెంచనోయి! యనినవ్వు, పుట్టె నిదిగాక నేఁ దప్పిపోతిఁగదర!

క. నాపేరు రామలింగఁడు, నాపేరెఱిఁగియును గుకవి ననుఁ దడవమి నే
నీపాలఁబడితి; నానుడు, లోపికతో, వించువ్రాయు మోయీ, సుకవీ!

గీ. 'వికటదాసరి' యని నన్ను వెక్కిరింప, నెంచితివిగాని, వికటకవీంద్ర యంచు
నన్నుఁ బిలిచితివేని నాయన్న! నిజము, పల్కియుందువు, గౌరవపరచియుందు.

గీ. బ్రహ్మమానసపుత్రుండు పరమమోద, మందుఁ గలహాశనాఖ్యనే యల్లె నాకు
వికటకవిశేఖరుండన్న పిలుపె కూర్చు, పంచభక్ష్యాన్నములవిందువంటిహాయి!"

క. ఇటుకొండకాల్వధాటిని, స్ఫుటముగఁ బలుకంగ నేనుఁ బోలిచి యతనిన్
తటుకున నతనిపదంబుల, నిటలతలముఁ జేర్చి నాదు నేరము సైఁపన్.

ఉ. వేఁడుచునుంటి నాతనికి వేడ్కజనింపఁగఁ "గాకవివ్రజం
బోడుచుఁ గూతమాని యెటకో చను మందులమూర్ఖులైన నీ

పాడెడుమాటకు స్ఫైదరి, న్యాయమె నగా సుకవీయటంచు నీ
వాడుట? యంత పెద్ద బిరుదావళి కేనెటు చాలియుండుదున్?"

గీ. నావిని యతండు పక్కన నవ్వి "భళిర! బాగుగాఁబోల్చితివి నాదుపలుకు వెగటు
సుకవి నిర్వచనమువిను సూక్ష్మకవన, రచయిత; మదీయఫోటిచిత్రపటమట్లు
లేరి కాకైత తెలియక యిరికియుండు!

గీ. అఱవయేకాంతమట్లు, చిదంబరము రహస్యమటుశుద్ధశూన్యమై, యనుభవైక
వేద్యమగునేమొయని భ్రమవెట్టివెట్టి, కుంభకోణంబుగా నది కొనకుఁదేలు."

క. అనియాతఁడు నవ్వింపఁగ, వినివిని యేమనఁగలేక "వికటకవీ! పె
ద్దనయంతవాఁడె నీకొక, తృణమయ్యెను, నేను లెక్కయే నీకింకన్.

మ. కవిసింహాంబ! రచింపఁగల్గెదవుగా కావ్యంబులెన్నేనియున్
వివిధంబౌ రసవాహినిన్దోల్తుకు గంభీరంపు వాకైతలన్
చవులూరన్ గలయట్టికావ్యరచనన్ సాగింప కీహాస్యపున్
దెవులున్ బట్టుటిదేల నీపలుకు? చన్నే నీచవాచాలతల్."

మ. అనుచున్ రోషముతోడ నేననిన పల్కాలించి తానవ్వుచున్
"వినుమోవత్స! కవిత్వసత్యగుణమున్ విన్పింతు; సామాన్యులో
చన మీక్షింపఁజెడు లీలలే కవనకాచద్వారమున్ జొచ్చి ద
ర్శనభావాధిక వైపరీత్యములు మీకున్ దోఁచెడున్గావునన్.

క. కవితకు హాస్యంబునకున్, లవమాత్రమునైన ముఖ్యలక్షణమునఁ గా
నవు భేదము; రెండింటికి, నవు జీవము వికటవాక్సహాయమునఁ జుమీ!

గీ. కవులువికటస్వభావవాగ్ధనులు, వికటకవులె కవిసర్వజనములు, కవివి నీవు
నన్ను "కవిసింహమా!" యని యెన్నితుదకుఁ, బరిహసింతువుగాఁ బశుప్రాయుఁడట్లు.

గీ. కుఱ్ఱ! కవులలో నిపుణతకొలఁదిఁగలుగు, నంతరంబులు సూచింప జంతుసంజ్ఞ
లేల? కవితెగఁ బశువులనేలఁజొన్పి, లాక్షణికులకు మతిపోవులాగు నేఁత!

క. కవిసింహము, కవినాగము, కవిబెబ్బులి, కవివృషభము, కవిజాగిలమున్
కవిజంబుకంబు మున్నగు, కవిపశువుల నిర్వచింపఁ గవి, నాతరమా!

క. వినువెండియు" ననుచే మే-మొ నుడువ నుంకింపనే "నమో"యని, "యపరా
ధుని నను క్షమియింపు మికన్, వినెదన్ మారనక నీదుపేశలవాక్కుల్."

చ. అనవుడు సంతసించి "యవునౌఁ గలగాన మనోజ్ఞవాక్యములే
వినుము తెనాలిహారె భువి; పేశలపుంగవు లెవ్వరన్న మీ
రనవలెసుమ్మ యీకవులెయంచు; బలే! కుకవీశుఁ డీకవిన్
వినిచెను; దీనిలక్షణము నిర్వచనం బొనరింతు నిత్తఱిన్.

క. ఈకలగాన కవీశులె, యీకవులయినారు; లోకు లిఁకఁ దమకవితా
ప్రాకటగుణము గ్రహింపఁగ, నీకలఁ దలమానిక మటు లిడికొందురుసుమీ."

గీ. అనుచు వచియించు నతని కే నాఁగలేక, "చాలుసీ నిర్వచన మిది సత్యమైన
నెట్టులీకలగానక వీశుఁడీ క,వీశుఁడనుపదముగు నెఱిఁగింపు" మనఁగ.

క. "కవులు నిరంకుశులై, నుడులవచించినవాని యొప్పులం జేయఁగఁ బు
ట్టువుఁగాంచెను నైయాకర,ణవితతి; యాగోడవమాను నాయన్న! యిఁకన్.

గీ. అడిగితివి కానఁ జెప్పెద నాలకింపు, కువలయంబెట్లు కువమయ్యెఁ గొనకు; నెట్లు
శైవలంబయ్యె శైవంబు, చెప్పు; మట్లు యీపదము లెంచవలె సాధురూపములుగ.

క. ఈకలగానకవిపదం-బీ కలకవిపదము మఱియు నీకవిపదము
న్నేకార్థబోధకములయి, వ్యాకృతి రూపాంతరములవలె వ్రాయఁబడున్.

క. కవికాకవిభేదం బిఁకఁ, జెవులారఁగ వినుము నేవచించెద; కవు లీ
ద్వివిధంబులెకానె ?; నిం,కవిభాగించినవి కావుకావనఁ జెల్లున్.

క. నవరస కవనార్ణవమునఁ, బ్రవిమలమైత్రోగుఁ గవిసరం, బుచ్ఛిష్టా
ర్థవశంబున బ్రతికెడుఁ గాకవు; లంతరమోని నేయుఁ గా వర్ణమిలన్.

చ. చతురతఁగాదె యీకుకవి చాలెను మాటికి భూతలంబునన్
బ్రతుకు కవీశులెల్ల నిజవర్గము గాఁగ వచించి, నామసా
మ్యతగుణభేదముల్ సెరచునా? ద్విగుణంబుల భేదమెంచెదక్
కుతలకవీశులందుఁ దలఁగొల్పడువా రుక్కాకవీశు లద్దిరా!

క. శివహరినామములు నహింపవా పశువులు గొన్ని కానఁ బసుపులె యాందే
నవినుతులు ? నక్కయెక్కడ, దివమెక్కడ ? కొండముచ్చు దేవుండగునా ?

గీ. కవిత నిఁకఁ గ్రొత్తయేమి నిక్కంబె; కవులు, తలఁపనగు స్వార్జితములుగఁ దమరచనలు
భావచౌర్యముఁ జేయనివ ట్లు;వార్య-మనఁగ, నెఱిఁగి పదార్థమంతని యనుమతిఁ
బడయకన్వలాభ పరనష్టపరతఁ గొనుట !

క. నాయన్న! యింకఁ జెప్పుదునా? యెడపదడంపు నీకు నగపడుచేటులే
దోయంచుఁ గవులు నుబ్బులు, పోయెడు నీకు చేసికొందు మనుమనుం" దనఁగన్.

క. "నిలునిలుము ప్రశ్న మొక్కటి, తులుకకుము కవియటంచుఁ గుకవియుకవినా
ములఁ దడవినట్లతోఁచెడుఁ, గలవే తన్నామమైన కవిగణ" మనుమన్.

మ. భళిరా! నేఁడుగదా కవీశ బిరుదప్రాప్తంబు నీకయ్యెఁ బ
ల్కులు నిట్లర్థవిశేషమంచు; బహులోకుల్ సత్కవుల్ భావనా
కలనన్; నానుడి దబ్బరైన నెటు సత్కావ్యార్థముల్ వారికిన్
దెలియున్? తద్రసశక్తి తత్కవికి భోతిన్ వారికావేశమా!

క. కవిభావసంపదన్ జెలఁగి రచింపఁగ శక్తిలేక కృతిసేయనియా
కవితామూకులు మూకవులు; కవుల వెనుకనుత్తములు మూకవులేసుమ్మా!

మ. అని తాఁ దిక్కున యజ్ఞయూపహరిహార ప్రాచీన తేజంబు భా
వనమున్ జేసి నుతించిన ట్లల పరబ్రహ్మంబు ధ్యానించుచున్
క్షణమాత్రంబున లీనమయ్యె నొకతేజం బందు; నాతేజు నా
కనులన్ నిల్చి మహోద్భుతావహముగాఁ గన్ వెల్గె దివ్యప్రభన్,

గీ. కనులనిండెడు నాదివ్య కాంతిఁ జూడఁ, జాలకమవేయ దృష్టులుసాగి, రెప్ప
ల్లినన్ ద్రోసి వెడలె మాయాప్రపంచ, దర్శనకుతూహలమున దుర్దశలఁ బడఁగ.

మ. రసగంధాధిక తుందిలాబ్జసుమగర్భంబున్ జెలన్ బోలె సం
తసమొప్పన్ దొలిసంజఁ బాసియళి, లూతాగర్భసంజాతతం
తుసమూహాస్థిత హైమకంకణముల న్నూత్నాతపప్రాప్తినె
మిసిమిన్ బూలతయంచుఁ జేరఁ జను చెమ్మిన్ మిత్రివాతన్ బడున్.

చ. కనులిటువీడగా నెదుటఁ గంజభవుం డుదయించియుండె; నూ
తనకిరణంబులెజ్జినయి తాఁ కె గవాక్షమునందునన్ మదీ
యనయనముల్ కవోష్ణగతి; నంతట నేఁగని విన్నదంతధ
య్యాన నిటు పూసగ్రుచ్చినటు లక్షరమున్ జెడకుండ వ్రాసితిన్.

సంపూర్ణము



# శారదానికేతనము-చిత్రకళాభవనము

మంత్రవాది వెంకటరత్నం గారు

శ్రీ చిత్రకళాభవనము గుంటూరుపురమందు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణదంపతులచే నాల్గు వత్సరములక్రిందట నెలకొల్పబడి నేటివరకు జయప్రదముగ పనిచేయుచున్న శారదానికేతనమునందొక శాఖయై యున్నది. ఈశాఖను సుమారు ఒకటిన్నరసంవత్సరము క్రితమే ప్రారంభించిరి. బాలికలకు ప్రాచీన విద్యాలక్షణముల నాదర్శముగ గైకొని సంగీతసాహిత్యములతో పాటుగ చిత్రకళకూడ నేర్పుచున్నారు. చిత్రకళయనగా సామాన్యముగ పాఠశాలలందు గరపబడునదిగాక చిత్రకళయొక్క నిజస్వరూపమునే భారతసాంప్రదాయలక్షణానుసారముగ నేర్పుచున్నారు. దీనితోపాటుగ భారత కళాసాంప్రదాయములు, కళాచరిత్రలుగూడ బోధించుచున్నారు. వ్రాతలవలననూ, పాఠములవలననూ బాలికలు చక్కగ కళను గుర్తెరిగి తమకోమలహస్తములతో మాధుర్యముగ చిత్రముల చిత్రించుచున్నారు.

నేడు భారతీయ కళాసాంప్రదాయములన్నియు కాలచక్రమునందు డాగియున్నవి. కాలము కొన్నింటిని తననోటబెట్టుకొనినది. కాని కళాలత చావలేదు. అది మరల చిగుర్చుచున్నది. ఇప్పుడిప్పుడు చిత్రకళ యభివృద్ధిగాంచుచున్నది. నూతన చిత్రకారులు తమతమకళాసాంప్రదాయనైపుణ్యమును ప్రదర్శించుచున్నారు. బందరుహనుమంతరాయ కళామందిరము, రాజమండ్రియందు 'రామరాయకళాగృహము' చిత్రకళాశాలలై నూతనావేశమును రసప్రపంచమునకు వెదచల్లుటయేకాక అనేక బాల,బాలికలకును, యువతులకును చిత్రకళ నేర్పుచున్నవి.

అటులే శారదానికేతనమునందలి చిత్రకళాభవనమునందుగూడ సమారు 35 గురు బాలికలు చిత్రకళ నభ్యసించుచున్నారు. మొదటితరగతియందు 18 బాలికలున్నారు. వీరందరు,సామాన్యరేఖాచిత్రములను చక్కగ వ్రాయగలరు. ఈ బాలికలు నూతనముగ పాఠశాలయందు ప్రవేశించిరి. రెండవతరగతియందు 8 బాలికలున్నారు. ఈ బాలికలు అజంతాచిత్రములను, తదితర చిత్రములను రేఖామూలమున చక్కగ వ్రాయగలరు. వర్ణలేపనమునందు వీరికిది ప్రథమదశ. వర్ణసంకలనము బాగుగ దెలియును. మూడవతరగతిబాలికలు ఒకటిన్నరవత్సరములో బాగుగ కృషిచేసిరి. వీరువర్ణలేపనము (Painting) చేయుచున్నారు. ఇందుప్రకటించిన చిత్రములన్నియు ఈ తరగతిబాలికలు రచించినవే. ఇంకకొన్ని చిత్రములు విక్రయించబడినవి. కొన్నిచిత్రములకు బాలికలుబహూకరింపబడిరి. పిల్లనడకలుగాన తప్పటడుగులవేయవచ్చును. కాని ప్రథమదశయందే వీరికికలిగిన కళానైపుణ్యమువలన ముందు వీరు కళాప్రపంచమందగ్రస్థానమాక్రమించగలరని యూహింపనగును ఈతరగతి బాలికలు దృశ్యచిత్రముల (Land Scapes)ను, మనుష్యచిత్రములను( Portraits) వ్రాయుచు అజంతాకళాసాంప్రదాయమున వీరు బహుత్వరితముగ చిత్రకళను సాధించుచున్నారు.

స్త్రీ ప్రపంచమందు నేడు ఆంధ్రదేశమున చిత్రకళ దెలిసివారు అరుదు. రాజమహేంద్రమందు కీ. శే. దామెర్ల రామరావుగారి ధర్మపత్ని సత్యవాణిగారును, రామరావుగారి చెల్లెలును, కీ. శే. దిగుమర్తి హనుమంతరావుగారి ధర్మపత్ని కృష్ణమ్మగారును నేడు చిత్రకారిణులయందు మిన్నలైయున్నారు. ఆంధ్రజాతీయకళాశాలయందు వరలక్ష్మియనుబాలికకూడ చిత్రకళనభ్యసించు

మన్నది. ఈబాలిక శ్రీకోతా శ్రీరామశాస్త్రిగారి పుత్రిక. శారదానికేతన విద్యార్థినులుకూడ చిత్రకళ నభ్యసించుచున్నారు.

ఇందుప్రదర్శింపబడిన చిత్రములలోకొన్ని శ్రీ తుంగల లక్ష్మీదేవి అనుబాలిక రచించినవి. ఈబాలికను విద్యకొరకు తలిదండ్రులు రంగూనునుంచి గురుకులము నకుబంపిరి. ఈమె తనతలిదండ్రులకు ఏకపుత్రిక. ఈబాల బహుసున్నితముగ చిత్రముల జిత్రించును. వర్ణసంకలనమం దీమె ముందంజవేయును.

మరికొన్నింటిని శ్రీగోగినేని జ్ఞానపుష్పాంబ చిత్రించినది. ఈమెది నిడుబ్రోలు (గుంటూరుజిల్లా). ఈబాలికవ్రాసిన "చంద్రిక" విక్రయింపబడినది. మేఘావృతమైన ఆకసమునుచీల్చుకొని ప్రకాశించు చంద్రమండలకాంతులు సముద్రతరంగములపై ప్రకాశించును. ఈ చిత్రమునకు బహుమానమొసంగిరి. దృశ్యచిత్రముల నీమె బహురమణీయముగ చిత్రించును.

మిగిలిన చిత్తర్వుల శ్రీవెలగాసరస్వతి అనుబాలిక వ్రాసినది. ఈమెది నిడుబ్రోలే. ఈబిడ్డ భూస్వాములగు పాముపాటి వెంకటకృష్ణయ్యచౌదరిగారి సోదరి. ఈమె చిత్రకళాకౌశలము మెచ్చుకొనదగినది.

ఇతరబాలికలుగూడ చక్కనిపటముల వ్రాయగలరు.

ఈవిధముగ శ్రీచిత్రకళాభవనముదినదినప్రవర్ధమానమగుచున్నది. ఇది ఆంధ్రదేశమునందలి స్త్రీపురుషులకు కళాసందర్శమున ఆదర్శప్రాయమై శారదానికేతనము యొక్క యశస్సును పెంపొందజేయునట్లు కళావిధాతయగు విశ్వకర్మను ప్రార్థించెదము.




## చాలు

పా. వి. రాఘవరావుగారు

౧

అంధకారకూప మందునఁబడియుండు
ధరణి నుద్ధరించు మెఱుపువీవు
దేవ! నీకు దివ్యతేజమేకాని ఆ
కృతియె లేదు; నీని నెఱిఁగియుండి
జ్ఞాననేత్రములను నూనెవత్తులఁగాల్చి
నీదురూప మకట నేను గంటి
తప్పఁజేయు నాకుఁ దగుశిక్షఁ గావించి
పలుకొంటివేని చాలుఁజాలు!

౨

ఏదొ రానియట్టి ఈకవిత్వమునేర్చి
అభవ! నిన్నుగూర్చి అల్లి, నీదు
పేరులోన నకట వేరుపుర్విడితిని
జడుఁడపాపరూపసముఁడ—నరుఁడ—
తప్పఁజేయు నాకుఁ దగుశిక్షఁ గావించి
పలుకొంటివేని చాలుఁజాలు!!

3

కరము ముదము నొసఁగు కమ్మకస్తురి తన
బొడ్డులోనిదనెడు బుద్ధిలేని
మృగమువోలె నిన్ను హృదయమందునఁదాల్చి
తీర్థములకుఁ బోయి తిరిగితిరిగి
నిన్నుఁ గానలేమి ఖిన్నుఁడనై నిన్ను
ద్రోహి వనుచు మిగుల దూరినాఁడ
తప్పఁజేయు నాకుఁ దగుశిక్షఁగావించి
పలుకొంటివేని చాలుఁజాలు!!!

